# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

**Monday 5th March 1956.**

The House met in the Assembly Hall, Kurnool, at half-past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## QUESTIONS AND REPLIES.

### Starred Questinos.

*Tapping of water from upper reaches of the rivers flowing from Mysore into Andhra.*

392—

* 765 Q.—SRI P. VENKATASUBBIAH:—
SRI P. BASI REDDI:—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) the terms of the agreement entered into between the composite Madras Government and the Mysore Government in the year 1892 regarding the tapping of water from the upper reaches of the rivers flowing from Mysore into Andhra.

(b) whether it is a fact that the Government have received reports that the Mysore Government have been tapping the water of the said rivers in violation of the terms of the agreement of 1892; and

(c) if so, the action taken by the Government?

THE HON. SRI N. SANJIVA REDDI:—

(a) According to the 1892 Agreement, the Mysore Government cannot construct new irrigation reservoirs across any portion of certain rivers, flowing from Mysore to Andhra without the previous consent of the Andhra Government.

(b) and (c) Yes. The matter was taken up with Mysore wherever necessary.

SRI P. VENKATASUBBAYYA:— మైసూరు ప్రభుత్వము ఏయే projects విషయములో ఈ చట్టాన్ని నిరోధించిందో తెలియజేస్తారా?

THE HON. SRI N. SANJEEVA REDDI:— రెండు మూడు విషయాలు మాత్రమే మా దృష్టికి వచ్చాయి. మద్రాసు రాష్ట్రములో ఉన్నప్పటినుంచి, 15 నదులకు ఇలాంటి చట్టము అన్వయిస్తుంది. ఆంధ్ర దేశమునకు సంబంధించినంతవరకు, తుంగభద్ర, హగరి, చిత్రావతి, పాపాగ్ని, పాల, South Pennar, ఈ నదులకు మాత్రమే సంబంధించి వున్నది. చిత్రావతి, పాపాగ్ని విషయములో మనకు రావలసిన నీరు అడ్డుపడిందని మాకు అప్పుడప్పుడు complaints వచ్చాయి. ఆవిషయము గురించి మైసూరు ప్రభుత్వానికి వ్రాశాము.

SRI CHITAMBARA REDDI:— అధ్యక్షా! ఈ మధ్యనే జయమంగళి అనే నదికి నూతనంగా ఈ agreement ను violate చేస్తూ, ఒక ఆనకట్ట కట్టి ఆ నీరు ఉపయోగించుకొంటున్నారు. ఈ సందర్భంలో ప్రభుత్వము ఏమి చర్యతీసుకొంటుంది?

THE HON. SRI N. SANJEEVA REDDI:— మనము దీన్ని అడ్డుకోవాలి అంటే, దీనికి కావలసిన material మనకు దొరకడంలేదు. మైసూరు ప్రభుత్వానికి వ్రాసి అక్కడనుంచి సమాధానము తెప్పించుకొనే మనము దీనిని పరిశీలన చేయాలిగాని, మన ఉద్యోగస్థులను పంపించి అక్కడ పరిశీలన చేసుకోవాలంటే చాలా కష్టమవుతుంది. కాబట్టే information call for చేశాము. మనకు వచ్చిన తగాదాలన్నిటి విషయంలోకూడ మైసూరు ప్రభుత్వమునకు వ్రాసి information ఇవ్వవలసిందిగా అడిగాము.

SRI P. BASI REDDI:— మైసూరు ప్రభుత్వంవారు agreement ను violate చేస్తే ఈ ప్రభుత్వము చేయగలిగిందేమి? ఈ ప్రభుత్వానికి ఉండే అధికారాలు ఏమిటి ఆ violations కు తగిన చర్య తీసుకొనే విషయములో?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఈ విధంగా violate చేసినారని వారికి తెలియజేస్తూ వారు మనము కలసి మాట్లాడుకొని సర్దుబాటు చేసుకోవచ్చు. లేకపోతే ఒక arbitrator ద్వారా ఢిల్లీ ప్రభుత్వానికి తెలియజేస్తూ ఆలాంటి తగాదాలు తేల్చుకోవచ్చు. అది సాధ్యంకాకపోతే, కోర్టుకుపోవడానికేమైన సాధ్యమవుతుందేమో! బసిరెడ్డిగారు lawyer కాబట్టి వారే అది తెలియజేయాలి.

5th March 1956]

SRI P. RAMACHARLU:—అధ్యక్షా! ఇంచుమించు 5 వేల ఎకరాలకు నీటి సప్లైచేసే బుక్కపట్నం చెరువు 30 సంవత్సరాలుగా నిండ కుండా రైతులుచాలా బాధపడుతున్నారు. మడకశిర తాలూకాలో ఉండే టటువంటి స్వర్ణముఖి నదికి పైన ఆనకట్టలుకట్టి నీరురాకుండా చేస్తున్నారు. ఈ విషయమై అనేకమైన complaints వస్తున్నప్పటికి, గవర్నమెంటు దీన్ని కేవలము ఉదాశీనంగా చూస్తున్నది. కాబట్టి ఇకమీదనైన ఈ విషయములో తగినటువంటిచర్య తీసుకొని వెంటనే పరిశోధన చేయిస్తారా?

THE HON. SRI N. SANJEEVA REDDI:— మాకు ఇది వరకు, అగళి, పాపాగ్ని, మధూడి, బుక్కపట్నం, వ్యాససముద్రం చెరువుల విషయములలో మాత్రం complaints వచ్చినాయి. వీటికి పైభాగమున అనకట్టలు కట్టడంవల్లనో లేక యితర కారణాల వల్లనో ఈ అయిదు చెరువులు చాలా నష్టపడుతున్నాయి. ఇంకొక State Government తో మనము ఈ విషయమై deal చేసే టప్పుడు చాలా జాగ్రత్తగా deal చేయవలసియుంటుంది. అనవసరంగా యిబ్బందులకు గురికాకుండా ఉండేటట్లు చూడాలి. కనుకనే మాకు ఇలాంటి complaints చాలావచ్చాయి, మీరే మెమో కట్టారట. వీటివిషయంగురించి వివరంగా తెలుపవలసిందని మైసూరు ప్రభుత్వానికి వ్రాశాము. ఇంకా ఆ details రాలేదు. అవి వస్తేనేగాని మనము ఏమిచేయడానికి వీలులేదు.

SRI P. SUNDARAYYA:— ఈ అడ్డకట్టలు తాత్కాలికమైనవా? శాశ్వతమైనవా? శాశ్వతమైనవే అయినట్లైతే, వాటి స్వభావమేమిటి? ఎన్నేళ్ల క్రితము ఇవి కట్టారు?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఇవి చాలా నాళ్ళ క్రిందటే కట్టారు. ఈ మధ్యనకట్టినవికావు. అవి చాలానాళ్ల క్రింద కట్టినప్పటికీ మనకు తెలిసేటప్పటకి చాలానాళ్లు అయిందని అనుకొంటాను. బుక్కపట్నం tank కు చిత్రావతినది వస్తుంది. కాని దీనిని మైసూరు State లోనే రామసముద్రం tank కు diversion చేసుకొన్నారు. ఎన్నాళ్లక్రింద అంటే కనీసం ఒక decade అయివుంటుందేమో! కట్టిన తరువాత ఎన్నాళ్ళకో మనకు తెలిసింది. ఈ విషయమై వారికి వ్రాశాము. ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాతగూడ రెండు మూడు సార్లు వ్రాశాము. దానికి ఇంకను సరియైన సమాధానముగాని, లేక fuller information గాని రాలేదు.

SRI N. C. SESHADRI:— అధ్యక్షా! ఇప్పుడు ఈ భైరవానితిప్ప ప్రాజెక్టు catchment area లో upper reaches నుంచి రాయదుర్గము తాలూకాలో ఇతర tanks కు supply channels తీసుకోడానికి మైసూరు ప్రభుత్వముయొక్క ఆక్షేపణ ఏమైనా ఉంటుందా?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఈ ప్రాజెక్టు కట్టిన తరువాత, మనము lower regions లో ఉన్నాము. కాబట్టి మననీళ్ళు ఎక్కడ తీసుకపోయినా వాళ్లకు ఆక్షేపణ ఏమివుండదు. మన capacity of water ఇంతయని నిశ్చయించుకొన్నాము. కాబట్టి మన భాగపు నీళ్ళు మనము ఎక్కడకు తీసుకుపోయినా వాళ్ళకు ఆక్షేపణలు ఉండదు. వారు ఆక్షేపణలు చేయడానికి వీలులేదు.

SRI K. VIJAYABHASKARA REDDI:— అధ్యక్షా మనము ఈ విషయమును గురించి మైసూరు ప్రభుత్వానికి వ్రాస్తే వారు సమాధానమిచ్చేందుకు చాలాకాలము తీసుకుంటారు. మొదటినుంచీ వాళ్లు అదే విధంగా ఇబ్బంది పెడుతూవుండే విషయము తెలుసును. కనుక వారు ఏ విధముగా ఈ conditions violate చెశారో మన ప్రభుత్వమే investigate చేసి, ఎందుకు ఈ విధంగా చేశారని మైసూరు ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తే బాగుంటుందేమోనని అనుకుంటాను. ప్రభుత్వము దీనికి ఏమిసమాధానము చెప్పుతుంది?

THE HON. SRI N. SANJEEVA REDDI:— వచ్చిన బాధల్లా అది వారిరాష్ట్రములో ఉన్నప్పుడు వారి రాష్ట్రములోకి మన అధికారులుపోయి ఈ రకంగా చేశారనడానికి హక్కులేదు. మనము వారినుంచి information తెప్పించుకొని దానిప్రకారం ఇది అక్రమమని చెప్పితేగాని మన ఆఫీసర్లు అక్కడపోయి investigate చేయడానికి వీలుకాదు, న్యాయముకాదు.

SRI P. SUNDARAYYA:— ఈ ఆనకట్టలు అనేవి దాచిపెట్టేటటువంటివిషయాలు కావు. ఉద్యోగస్తులు వెళ్లినా ఉద్యోగరీత్యావెళ్లకపోయినా సరే, అగుపడతాయి. ఉన్నవాటిని కాదనికూడ వాళ్ళు అనలేరు. మంత్రులైనా వెళ్ళి కనుక్కోవచ్చును. ఇది పదేళ్ళనుంచి జరుగుతూఉన్నదంటే మద్రాసు ప్రభుత్వము నిద్రపాతున్నదన్నమాట. వారుపైన కొంతనీరు తీసుకున్నప్పటికి క్రింద భాగానికికూడా కొంతనీరుపోనిచ్చి ఆ విధముగా సర్దుబాటు చేసుకుంటే బాగుంటుంది. కాని ఈ విధముగా మన ఉద్యోగస్తులను రానివ్వకుండా సరిగా సమాధానము ఇవ్వకుండా కాలయాపన చేస్తూన్నప్పుడు కేంద్ర ప్రభుత్వానికి వెంటనే వ్రాసి ఒక Arbitration Commission వెయ్యాలనే విధముగా ఈ ప్రభుత్వము వెంటనే చర్యసు కుంటుంధా?

THE HON. SRI N. SANJEEVA REDDI :— ఈ విధముగా వారు కట్టింది మనకు తెలియక పోలేదు. మనకు non-official గా తెలుసును. కాని ఈ విధముగా వారు మనకు రావలసిన నీళ్ళు వాడుకొంటున్నప్పుడు, దాని details కావలసి యుంటుంది. ఎంత నీళ్లు వాడుకొంటున్నారు, కొత్తగా కట్టిన tanks యొక్క capacity ఎంత, ఒకవేళ పాత tanks restore చేసిఉంటే వాటియొక్క additional capacity ఎంత, ఈdetails అన్నీ తెలుసుకోవలసి యుంటుంది. అదిలెకుండా ఊరికే ఎక్కడో అన కట్టలు కట్టినారు, చెరువులు కట్టినారు, అన్నంతమాత్రాన our case is not strong. కనుకనే ఈ లాంటి details అంతా ఇవ్వవలసిందిగా వాళ్లకు వ్రాశాము. ఇప్పుడు వాళ్లు కట్టినారా లేదా అనికాదు. It is a fact that they have constructed. దాన్ని గురించి వేరే evidence అక్కరలేదు. అది ఆ ప్రాంతాలలో ఉన్నవారికి మన ప్రజలకుఅందరికి తెలుసు కాని fuller details కుగాను వ్రాశాము.

ఒక వేళ ఇదివరకు ఉండినదే చిన్న tank ఏదైనా restore చేశామని అంటారనుకోండి. Then our case will be very weak. ఈ విషయంగురించి మద్రాసు ప్రభుత్వములో ఉన్నప్పుడే వ్రాశాము. డిల్లీ గవర్నమెంటుకుకూడా ఈ విషయాలు తెలిపి ఉన్నాము. Central Government is also in correspondence with us. ఈ మధ్యనే ఒక concrete shape కు వచ్చింది, and we are taking quick action.

SRI P. SUNDARAYYA :— మైసూరు P.W.D. మంత్రిగారు 1892 agreement కు వ్యతిరేకంగా మేము ఏమి అనకట్టలు కట్టలేదని పత్రికలలో ఒక statement ఇచ్చారు, ఆంధ్ర ప్రభుత్వము వచ్చిన తరువాత దాన్నిగురించి ఏమైనా చర్య తీసుకొన్నారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :— అది కూడా వ్రాశాము. ఈ మధ్య కట్టిన రామసాగర్ చెరువు మొదలైనవి కొత్తగా కట్టినవని మేము అంటున్నాము. వారేమోలేదు, మేము పాతవాటినే restore చేస్తున్నామని అంటున్నారు. ఈ రకంగా controversy ఉన్నది. కనుక ఊరికే చెరువులు కట్టారని చెప్పడానికి వీలులేదు. ఆ details మనకు తెలియాలి. ఈ చెరువుకు ఎంత capacity increase అయింది ఎన్ని million cubic feet of water పోతూఉంది, ఈ details అంతా technical knowledge ఉన్నవాళు చూస్తేతప్ప విస్పష్టంగా తెలుసుకోవడం చాలా కష్టము.

SRI S. VEMAYYA:— అధ్యక్షా! ఈ ప్రశ్న యిక్కడ ఇద్దరి పేర్లతో చెప్పబడియున్నది. నేను నా పేరుతో ప్రశ్నయిచ్చాను. ఇంకా అనేక మంది యిచ్చినట్లుగా భావించుచున్నాను. Information call for చేశామని మంత్రిగారు చెప్పారు అయితే call for చేసిన information ఏఏ points మీద అడిగారు? అవి యేమిటో వివరముగా మంత్రిగారు చదువుతారా ? ఇంతవరకు తీసుకున్న చర్య యేమిటో చెబితే, మేము కొంత తృప్తిపడటానికి అవకాశము ఉంటుంది. కాబట్టి అదియేమిటో చదువుతారా మంత్రిగారు ?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఇప్పుడు నేను ఆ వివరములు చదివినప్పటికినీ వేమయ్యగారికి తృప్తి కలుగదు అనే అనుమానం మాత్రము నాకు పూర్తిగా ఉన్నది. కాబట్టి నేను యిప్పుడు ఆ details ఇవ్వలేను.

SRI P. SUNDARAYYA:— ఆ ప్రాంతాలలో ఉన్న నదులు; అంటే పాపాగ్ని, చిత్రావతి, పెన్నా వగైరాలు ఆంధ్ర ప్రాంతములోనే ప్రవహించుచున్నప్పటికినీ మైసూరు ప్రభుత్వం తయారుచేసిన జనాభా లెక్కలనుబట్టి అవి తెలుగు ప్రాంతముల క్రిందనే ఉన్నట్లు తెలుస్తున్నది. అంటే అవి మన తెలుగు దేశానికి వచ్చేవి, తెలుగు ప్రాంతములో ప్రవహించాలి అక్కడనే పెట్టి తగాదాలకు గురిచేసే బదులు, అవి తెలుగు ప్రాంతములో కలిపే దానికి కేంద్ర ప్రభుత్వానికి మరొకసారి యీ ప్రభుత్వము సూచన చేస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—అందుకు యీ ప్రభుత్వానికి ఏలాంటి ఆక్షేపణలేదు. ఇంకను యీ ఎసెంబ్లీద్వారా మనలో అన్ని పార్టీలవారుగూడకలిసి చేయవచ్చు. కాని అవి వస్తాయా, రావా అనే సంకోచముతప్ప వాటిని అడగటానికి మాత్రము అభ్యంతరములేదు.

SRI S. VEMAYYA:— నేను అడిగిన ప్రశ్నకు మంత్రిగారు సమాధానము యివ్వలేదు. ప్రభుత్వము call for చేసిన information దానియొక్క terms of reference ఏమిటోచెప్పమంటే చెప్పలేదు. మంత్రిగారు యిప్పటికైనా చెబుతారా అని అడుగుతున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI:— వేరే ప్రశ్న వేయండి.

### *Post of Astanakavi.*

429—

* 309 Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Chief Minister be pleased to state whether there are proposals with the Government to maintain the post of Astanakavi by the State now ?

THE HON. DR. B. GOPALA REDDI:—The Government have ordered that Sri Sripada Krishnamurthy Sastry shall continue to be Poet Laureate in Telugu for his lifetime.

SRI S. VEMAYYA:— ఈ ఆస్థాన కవిగారికి ప్రభుత్వము ఏదైనా ఆర్థిక సహాయము చేస్తున్నాదా ?

THE HON. DR. B. GOPALA REDDI:— సంవత్సరమునకు వెయ్యి రూపాయలు ప్రభుత్వము యిస్తున్నది.

### *Registered Publishers within and outside the Andhra State.*

430—

* 410 Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the number of registered Publishers within (i) the State of Andhra, (ii) outside Andhra State if any now, in pursuance of G.O. Ms. No. 760, Education, dated 2nd July 1954; and

(b) the number of them to whom Government work is given now ?

THE HON. DR. B. GOPALA REDDI:—

(a) The number of registered Publishers, who were within the jurisdiction of the Andhra State, at the time of its formation and who were recognised as registered publishers by the Andhra Text-Book Committee without fresh registration, in pursuance of G.O. Ms. No. 760, Education, dated 2nd July 1954, is 122. Forty-six publishers were newly registered, of whom 14 are within the Andhra State and 32 are outside the State.

(b) Two of the above publishers have been entrusted with Government work.

SRI S. VEMAYYA:— మన ఆంధ్ర రాష్ట్రములోనే కాకుండా ఇతర రాష్ట్రములలోగూడ ఎక్కువగా మన publications ప్రింటింగుకు గాను పంపడము జరుగుచున్నది. దానిని అరికట్టేటట్లుచేసి యీ publications అన్ని మన రాష్ట్రములోనే printing జరగటానికి ప్రభుత్వము చర్యతీసుకొంటుందా ?

THE HON. DR. B. GOPALA REDDI:— గౌరవ సభ్యులు కొంచెము విశాల దృక్పథముతో యీ విషయాలు అన్ని పరిశీలిస్తారని నేను ఆశిస్తున్నాను.

SRI P. SUNDARAYYA:— విశాల దృక్పథముతో పరిశీలించే అడుగుతున్నాము. కనీసము మన ఎసెంబ్లీ రిపోర్ట్సు అయినా రెండు సంవత్సరాలదాకా ప్రింటుఅయి తయారు కానప్పుడు అవి తెలుగురాని ప్రదేశములలోఉన్న press లద్వారా printing చేయించే బదులు, అవి మన రాష్ట్రములోనేయిచ్చి తయారు చేయించటానికి ప్రభుత్వము కృషి చేస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI:— గౌరవ సభ్యులు చెప్పిన విధముగాచేస్తే అవి యిప్పుడుఅయ్యే రెండు సంవత్సరముల ఆలస్యముకన్న, యింకా ఎక్కువ ఆలస్యము అవుతుందేమోనన్న భయము కలుగుతున్నది.

SRI T. JAYYAR DAS:—అధ్యక్షా! మన రాష్ట్రమునకు సంబంధించిన publications ప్రింటింగు చేయించటానికి ప్రభుత్వము ప్రతి సంవత్సరము దాదాపు నాలుగు లక్షల రూపాయలదాక ఖర్చు చేస్తున్నది. ఆ విధముగాకాకుండా మనకుఉన్న ముద్రణాలయమునకే యీ పనియిస్తే, ఆ పని అంతానెరవేర్చగలదని ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. DR. B. GOPALA REDDI:— ఈ విషయములో యిక్కడ మనకుఉన్న printing capacity ఎంత ఉన్నది? అసలు మనకుఉన్న ముద్రణాలయాలు ఎన్ని? ఇంతకు ముందు రిజిస్టర్డుఅయిన ముద్రణాలయాలుఎన్ని? వాటి capacity ఎంతఅనే సందర్భాలుఅన్నీ పరిశీలించిన తరువాత ప్రభుత్వము ఆ విధముగా యితరత్రాపని చేయించుకుంటున్నది. కాని యిందులో ప్రభుత్వం త్వరపడి చేసినది యేమిలేదు.

SRI N. SREENIVASA RAO:— అయితే మన రాష్ట్రములో ఉన్న ముద్రణాలయములకు అవసరమైన machinery యిచ్చి యింకా బాగా develop చేయటానికి ప్రభుత్వము subsidyగాని, మరే యితర గ్రాంట్లుగానియిచ్చి అవి సాధ్యమైనంతవరకు మన రాష్ట్రములో ఆ printing అంతా జరిగేటట్లుగా చూస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :— Subsidy గాని యింకా గ్రాంట్లుగాని యీ ప్రభుత్వముకు యింత వరకుయిచ్చే అలవాటులేదు. అందువల్ల ఇకముందు అయినా అవి ఇవ్వ టానికి వీలులేదేమోనని అనుకుంటాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా! ఈ ముద్రణ విషయములో ఇతర రాష్ట్రములలోని pressలకు ఇవ్వటము వరకేనా, లేకపోతే వారుచేసే printing సరిగావున్నదా లేదా అనేది చూడ డము ఉన్నదా ? ఎందుకంటె ప్రథమ పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన కొన్ని విషయాలు మన ఆంధ్రప్రజ కోసము ఒకటి print చేశారు. ఆ పుస్తక ములోని printing చదువటానికిగాని, చూడటానికిగాని వీలులేకుండా పోయింది. అది Dalton Press వారిచేత printing చేయించారు. ఆ ప్రింటింగుచూచి మన ప్రభుత్వము ఏ విధముగా సహించి ఊరకున్నదో అర్థముకాలేదు. కాని డబ్బు మాత్రము వారికి ఇతరులకంటె హెచ్చుగానే యిచ్చారు. కాని ఆ పుస్తకాలలోని printing యేమిబాగాలేదు. కాబట్టి అసలు యీ printing అనేది సరిగా ఉన్నదా లేదా, publcations చూడ టానికి యింపుగాఉన్నవా లేవా అనేది supervise చేయటానికి, ఏదైనా supervising agency అనేది ప్రభుత్వము ఏర్పాటుచేసిందా ? లేకపోతే యిక Superintendent, Government Press (Andhra) యొక్క ఇష్టముమీద ఆధారపడి ఉన్నావా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ Superintendent, Government Press మీద పై అధికారి మన ప్రభుత్వ ములోని Education Department Secretary. వారు ప్రింటింగు సరిగా జరుగుతుందనే ఉద్దేశించి ఉంటారు వేరుకాదు, బహుశ అది అత్యవసరముగా చేసిఉండవచ్చు నేమోగాని, నాకు ఆ విషయము తెలియదు.

SRI PRAGADA KOTAIAH :— మన గవర్నమెంటు ప్రెస్సు తాలూకు పని నిర్వహించటానికి తగిన machinery హాజరులో లేదని అంటున్నారు. అలాంటప్పుడు మన ఆంధ్ర దేశములో ఎన్నో press లు పని లేకుండా మూలపడిఉన్నవి, ఆ సంగతి ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఏదివున్నప్పటికినీ ఆలస్యము అవుతుందని మాత్రము తెలుసు. కాని వాటికి పని లేకుండా ఉన్నవని మాత్రము తెలియదు.

SRI S. VEMAYYA :— ఈ private press ల ద్వారా మన publications అన్నీ print చేయించుకునే దానికి బదులు ఇప్పుడు

మనకువున్న గవర్నమెంటు ప్రెస్సునే అభివృద్ధి చేయించి, అందులోనే మన printing అంతా జరిగేటట్లు ప్రభుత్వము చర్యతీసుకుంటుందా ? ఇప్పటికి తీసుకున్న చర్యయేమిటి ?

THE HON. DR. B. GOPALA REDDI :— ఇప్పుడు మనకు కర్నూలులోవున్న గవర్నమెంటు ప్రెస్సును ఇప్పటికే అభివృద్ధి చేయటానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాము. మద్రాసులో మనకు న్యాయముగా రావలసిన machinery యే రాలేదు. దాని కొసము ఈ నెలలోపోయి తీసుకొని రావటానికి ఏర్పాటు చేయవలసిందిగా కోరియున్నాము. అందుకుగాను అన్ని విధములలో ప్రయత్నాలు చేస్తూనేవున్నాము. కాని యిప్పుడు మనకువున్న publications print చేయవలసినది చాలా ఎక్కువగావున్నది. అందువల్ల అవి త్వరలో ప్రింటింగు చేయించటానికి కొన్ని ప్రైవేట్ press లకుకూడ ఇవ్వవలసివచ్చింది.

*Nationalisation of the publication of Text-Books.*

431—
* 845 *Q.*—SRI P. VENKATASUBBAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state the steps taken so far to nationalise the publication of Text Books ?

THE HON. DR. B. GOPALA REDDI :—The Government appointed a Committee to examine one of the recommendations of the Kuppuswamy Committee, regarding the printing and publication of the Text-Books by the Government. The Committee's report has been received and it is under the consideration of the Government.

SRI P. VENKATASUBBAYYA :— ఆ కమిటీ యొక్క రిపోర్టును యీ సభముందు పెట్టడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :— అది సభముందు పెట్టవలసినంత పెద్ద అవసరము యేమీలేదనుకుంటాను. ఎవరైనా కావాలంటే, అడిగితే, ఆ రిపోర్టు కాపీ యివ్వటానికి ప్రభుత్వానికి ఎట్టి అభ్యంతరము లేదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :- ఆ రిపోర్టు కాపీ శాసనసభ్యులందరికి అందజేయాలని కోరుతున్నాము.

రెండవది రాబోయే education year ప్రారంభమయ్యే టప్పటికైనా యీ Text Books ను ప్రకటించే పద్ధతిఅయినా ప్రభుత్వము అమలు జరుపుతుందా ?

THE HON. DR. B. GOPALA REDDI:— అది వీలుకాదు. ఎందుకంటే, కమిటీవారి రిపోర్టులో దీనికిఅంతా ఒక Statutory Corporation మాదిరిగా ఒకదానినిపెట్టి, దానికి అయ్యే ఖర్చు వేరుగాయిచ్చి, యీ Text Books అన్నీ దానిద్వారా వారే చూచుకునేటట్లుగా సిఫార్సు చేయబడియున్నది. అందువల్ల యీ సంవత్సరము అది సభ్యులు కోరినవిధముగా చేయడానికి వీలుండదేమోనని అనుకుంటాను.

SRI L. LAKSHMANA DAS:— ఈ Text Books publication nationalise చేయడమువల్ల ప్రభుత్వానికి చాలా లాభదాయకముగా ఉంటుందని మొదట కమిటీ రిపోర్టులో చెప్పబడియున్నది. ఇప్పుడు వచ్చిన కమిటీ రిపోర్టులో అదేవిధముగా సూచన చేయబడిందా ?

THE HON. DR. B. GOPALA REDDI:— ఈ విషయాలన్నీ కమిటీవారు విపులముగానే పరిశీలించారు. కాని ఈ విషయము కేవలము ప్రభుత్వము స్వాధీనములో ఉండడమువల్ల దానియొక్క సాధకబాధకాలు గూడ వారు ఆలోచించియుంటారు. అందువల్ల యీ వ్యవహారము అంతా independent గా ఒక Corporation చేతిలో వదలివేయడము, దానికి ప్రత్యేక మూలధనము, కావలసిన Printing Press, కావలసిన సిబ్బంది, అంతాగూడా వేరుగా ఉంచితేనే బాగుంటుందని కమిటీవారు సూచించారు. ఇప్పుడు ఆ వ్యవహారము అంతా ప్రభుత్వముయొక్క పరిశీలనలో ఉన్నది.

SRI S. VEMAYYA:— ఈ కమిటీవారు చేసిన సూచనలలో ముఖ్యమైనది యేదో సెలవిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI:— ఆ printing అంతా ప్రభుత్వానికి ఏలాంటి సంబంధము లేకుండా independent గా ఒక Corporation ద్వారా జరగాలని అన్నింటికి ఆ Corporation జవాబుదారి వహించేటట్లుగా కమిటీవారు సూచిస్తూ సిఫార్సు చేశారు.

MR. SPEAKER:—Question Nos. 432 and 433 will be taken up together.

*Remodelling of Old Legislators' Hostel.*

432—
* 150 Q.—SRI M. RAJESWARA RAO:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the amount spent by the Government for (i) the remodelling of the Old Legislature Hostel and (ii) providing tents for the Legislators up to 31st March 1955;

(b) the expenditure incurred on the establishment of the Hostel up to 31st March 1955; and

(c) the total amount collected from members and others as rent for the use of the Hostel during the period ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(a) Rs. 69,373 was spent for remodelling the Basic Training School into Old Legislators' Hostel and for providing tents for Legislators. This is exclusive of the cost of the tents which amounts to Rs. 21,600.

(b) Rs. 18,549-8-3. (This amount includes Electric, Telephone and contingent charges and expenditure on provision of pigeon hole almirah and radio set.)

(c) Rs. 21,907.

*Reconstruction of Basic Training School into Legislators' Hostel.*

433—
* 311 Q.—SRI M. BAPAIAH CHOWDARY:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the amount spent for the reconstruction of Basic Training School into Legislature Hostel; and

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(a) Rs. 69,373 was spent for remodelling the Basic Training School into Old Legislators' Hostel and for providing tents for Legislators. This is exclusive of the cost of the tents which amounts to Rs. 21,600.

(b) A sum of Rs. 21,901 was realised by way of rent up to 31st March 1955.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:— అధ్యక్షా, ఇప్పుడు కొత్తగా కట్టిన building కు గాను ఎంత ఖర్చు అయింది? Proportionate గా ఒక్కొక్క గదికి యెంత అయింది?

MR. SPEAKER:—That is about the old Hostel. Please put a separate question.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:— ఇది చాలా relevant question అండీ!

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఈ ప్రశ్న ఎంతవరకు relevant అంటే, క్రొత్త హాస్టలులో కాపురముయుండే వారి ఆస్తి ఎంత, వారి పెండ్లాము పిల్లలు ఎంతమంది అని అడిగేది ఎంత relevant టో, యిదిగూడ అంతే relevant అండి.

*Posts of Commissioner, Deputy Commissioner, etc., in the Hindu Religious Endowments Board Department.*

434—

*721 Q.—SRI E. AYYAPU REDDI:—Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether the posts of (1) Commissioner, (2) Deputy Commissioner and (3) Assistant Commissioner in the Hindu Religious Endowments Board Department are filled up by direct recruitment;

(b) the scales of pay of these three grades of officers; and

(c) the basis on which the recruitment is made?

THE HON. SRI K. CHANDRAMOULI:—

(a) and (c) An extract* of Rule 3 of the Hindu Religious and Charitable Endowments (Administration) Service Rules issued in G.O. Ms. No. 1232, R.W., dated 22nd November 1951, relating to the recruitment of Commissioner, Deputy Commissioner and Assistant Commissioner is placed on the Table of the House.

| (b) *Name of the post.* | *Scale of pay.* |
| --- | --- |
| Commissioner | 1,000-60-Rs. 1,300-50-1,800. |
| Deputy Commissioner | 550-50/2-750. |
| Assistant Commissioner. | 250-50/2-500. |

SRI E. AYYAPU REDDI:—Will the Government consider the desirability of recruiting a greater percentage from the Bar for the posts of the Assistant Commissioners ?

THE HON. SRI K. CHANDRAMOULI:—కావలసినదాని కన్న ఎక్కువగా Bar నుంచి తీసుకోవలసిన అగత్యం ఏమిటో నాకు కనబడడం లేదు.

SRI E. AYYAPU REDDI:—The Hon. Minister how knows that the Bar is overcrowded and that there are more talented people at the Bar who are wasting their time and that is the desirability for recruiting more percentage from the Bar.

THE HON. SRI K. CHANDRAMOULI:- Department లో కూడ talented persons ఉన్నారని చెప్పి గౌరవనీయులైన సభ్యులు తెలుసుకోవడం మంచిది. అందువల్ల అన్ని సమన్వయం చేసుకుని చేయువలసియుంది.

SRI E. AYYAPU REDDI:—The percentage of talent is greater in the Bar than in the other Departments and greater number of youngsters are called to the Bar and there is no proper encouragement for recruitment from the Bar. That is why the desirability of recruiting and allotting more percentage from the Bar. Government may consider it.

---

* Vide Appendix at pages.

THE HON. SRI K. CHANDRAMOULI:— గౌరవనీయులైన సభ్యులతో నే నేకీభవింపజాలను. Talent అంతా ఒకే department సొత్తంటే దానితో ఎప్పుడూ ఏకీభవించడానికి వీలు లేదు. Talent అన్ని department లలో యున్నది. ఆ department అవసరాలను బట్టి ఆ department interest ను బట్టి recruitment జరుగుతూ ఉంటుంది.

SRI P. BASI REDDI:— అందులో Assistant Commissioners సంఖ్య ఎంత? Direct గా recruit చేసిన వారి సంఖ్య ఎంత?

MR. SPEAKER:—The paper placed on the Table contains all that.

THE HON. SRI K. CHANDRAMOULI:— Assistant Commissioners 11 మంది. వారిలో recruit చేయవలసిన Proportions ఉన్నాయి. ఇద్దరు direct recruits, యిద్దరు Bar నుంచి, ఒకరు executive officers నుంచి అని ఉండేది తరువాత ఆ rules మార్చబడ్డాయి. ఎల్లాగంటే ఇద్దరు executive officers నుంచి, యిద్దరు direct recruitment ఒకరు Bar నుంచి అనే proportion లో recruitments జరుగబోతున్నాయి.

SRI S. RANGANATHA MUDALIAR:—Is there any provision for appointing the Commissioner on a contract basis? Will the Government state the circumstances under which the present Commissioner was appointed on a contract basis?

THE HON. SRI K. CHANDRAMOULI:— ప్రస్తుతంవున్న Commissioner గారు contract basis మీద appoint చేయబడ్డారు.

SRI H. RAMALINGA REDDI:—Recently a Deputy Commissioner is appointed. On what basis is he appointed, Sir?

THE HON. SRI K. CHANDRAMOULI:—Recruitment Service Rules ప్రకారమే Deputy Commissioner recent గా appoint చేయబడ్డారు.

SRI S. RANGANATHA MUDALIAR:—Are there any special reasons for departing from the general rule in appointing the present Commissioner on contract basis ?

THE HON. SRI K. CHANDRAMOULI:—This appointment was made by the previous Government and they have considered it and under special reasons only they have appointed Sri Venkata Reddi as Commissioner.

SRI S. RANGANATHA MUDALIAR:—Will the present Government consider contract basis also as a basis for appointment ?

THE HON. SRI K. CHANDRAMOULI:—He is now continuing. Let us consider afterwards when the contract term expires.

SRI S. K. V. KRISHNAVATARAM:— ఈ మధ్య Deputy Commissioner ను ఒకరిని appoint చేశారు. ఆయన అంతకు మునుపు ఏమిచేస్తున్నారు? అంతకుమునుపు Judicial experience ఆయనకు ఉన్నదా?

THE HON. SRI K. CHANDRAMOULI: వారు ఇదివరకు R.D.O. గా వున్నారు. B.L., qualification ఉన్నది. అదీ recruitment కు అర్హత. ఇప్పుడు వేసిన వారికి కొంచం అనుభవంకూడా వున్నదనే వేశాం.

SRI T. JIYYAR DAS:— యిప్పటికి నియమింపబడిన సిబ్బందిలో ఎవరైనా హరిజనులున్నారా? హరిజను లుండవచ్చునా?

THE HON. SRI K. CHANDRAMOULI:—ఉండకూడదని prohibition ఏమీ లేదు. Qualifications వుండి Service Commission లో select ఐతే రావడానికి అభ్యంతరాలేమి వుండవు.

SRI P. GOPALU REDDI:— అధ్యక్షా! ఈ Deputy Commissioner లనుగాని, Commissioner లను గాని, Assistant

Commissioner లను గాని ప్రభుత్వము వారు appoint చేయడంలో కేవలం academic qualifications ప్రధానంగా చూస్తారా? లేక ఆచారం, ఆధ్యాత్మికంగా వుండవలసిన ఓపిక, భక్తి అనే వాటికి ప్రధాన్యత యిస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :— ప్రస్తుతంవున్న rules ప్రకారం వున్నవాళ్లలో కొంచం ఎక్కువ అనుభవం వున్న వారిని ఆ department కు బాగా పనికివస్తారనుకున్న వారిని recruit చేస్తాం.

*Andhra Rashtra Elementary Teachers Federation, Vijayavada.*

435—
* 625 Q.—SRI V. VISWESWARA RAO :—(Put by Sri Pillalamarri Venkateswarlu) Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government have issued any instructions to the Educational Authorities to take action against teachers who are either members or office bearers of the Andhra Rashtra Elementary Teachers Federation, Vijayavada; and

(b) the number of teachers punished for attending All-India Primary Teachers Federation Conference recently held at Puri as delegates ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) None.

*Increasing the number of seats in the College of Cuddapah.*

436—
* 364-K Q.—SRI Y. ADINARAYANA REDDI :— Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether there was any representation in this year (1955) from the Public as well as the

College Committee of Cuddapah to increase the number of seats in the College both for the Inter. and B.A. classes; and

(b) if so, the action taken thereon ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(*a*) The answer is in the affirmative.

(*b*) The strength of B.A. Group IV B (Economics) has been raised from 60 to 100 during 1955-56. The proposal to increase the seats in the III Group of the Intermediate has been dropped as the number of students waiting for admission in that group was not more than 25.

SRI B. RATHNASABAPATHI :—Intermediate class లో admissions దొరకక చాలామంది వెనుకకు పోయినట్లు మాకు ఇదివరకు వార్తలు వచ్చినవి. Intermediate class కు seats ఎక్కువ చెయ్యాలని Committee వారు మీకు మనవి చేసుకోలేదా?

THE HON. DR. B. GOPALA REDDI :– వచ్చివుండవచ్చును కాని దానికి కొంచెం limitations వున్నవి. University వారు ఇంతకన్న ఎక్కువగా Intermediate లో చేర్చుకోకూడదని ఒక limitation పెట్టారు. తరువాత కొన్ని groups లో మాత్రమే ఎక్కువ demand ఉంటుంది. కొన్ని groups కు demand ఉండదు. కాబట్టి ఆ groups లో కూడా ఇంతకన్న ఎక్కువ చేర్చుకోవద్దని University వారి restriction ఉంటుంది. కాబట్టి ఇవన్నీ గూడా గమనించవలసి యుంటుంది.

SRI P. BASI REDDI :— ముఖ్యంగా ఈ second group కు demand చాల ఎక్కువ ఉందండి. Intermediate class, ఈ second group కు చేర్చుకునే విద్యార్థుల సంఖ్య హెచ్చించడానికి ఆలోచిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI :— సాధ్యమైనంత వరకు second group లో హెచ్చుమందినే చేర్చుకోడానికి ప్రయత్నాలు జరుగుతూ వున్నాయి. అందుకు laboratory equipment, accommodation ఇవన్నీ చూచుకోవలసి వుంది. ఇవన్నీ University వారుగూడా గమనిస్తూ వుంటారు ఎప్పటికి అప్పుడు.

SRI P. VENKATASUBBAYYA:—Seats అధికం చేసి నందువల్ల accommodation ఎక్కువ కావలసి వస్తుందేమో, దానికేమి సదుపాయాలు చేస్తున్నారో సెలవిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI:— డబ్బున్నప్పుడు College లకు extensions sanction చేస్తూ ఉంటాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:— B. Sc. తరగతి ముందు సంవత్సరం నుంచి తీసివెయ్యాలని ఆలోచిస్తున్నారట. ఆ విధంగా క్రింద తరగతులుగూడా దానికి అనుకూలంగా ఉండే పద్ధతి ఆలోచిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI:—అది అమలులోకి వచ్చినప్పుడు ఇదంతా ఆలోచిస్తాం. ఈ B. Sc. విషయంగూడా Inter University Board వారు ఆలోచించారు. Three years course పెట్టినపుడు ఏదో కొంత basic గా అన్నీ ఉండవలెననే భావంతోనే వారు ఆలోచిస్తున్నట్లున్నది. ఇవన్నీ Inter University Board వారు, University వారు కలిసి ఆలోచిస్తున్నారు.

SRI S. VEMAYYA:— Accommodation లేదనే భావంతోనే, అక్కడ seat లు లేవని చెప్పేదానికంటే, shift system అమలు జరిపి అందరకి seats ఇచ్చుటకు ప్రభుత్వము ప్రయత్నిస్తుందా?

THE HON. DR. B. GOPALA REDDI:—University వారు ఈ shift system కు వ్యతిరేకులు. ఈ విద్యావిషయాలలో University వారు చెప్పినట్లు మనం నడుచుకోవాలి. వారు shift system గూడదంటున్నారు. ఇప్పుడు ఆంధ్ర దేశంలో ఏదో ఒక్క కాలేజీలో తప్ప మిగతా ఎక్కడా shift system లేదు. అది గూడా లేకుండా చెయ్యడానికి వాళ్ళు ప్రయత్నం చేస్తున్నారు.

SRI PILLALAMARRI VENKATESWARLU:— University వారు shift system కు వ్యతిరేకంగా చెప్పిన కారణాలేమిటో చెప్పగలరా?

THE HON. DR. B. GOPALA REDDI:—The reasons are obvious.

### *Voguru-Vakamada channel of Sidhout taluk.*

437—

* 267 Q.—Sri B. RATHNASABHAPATHI:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state the stage at which the investigation of the Voguru-Vakamada channel of Sidhout taluk stands now ?

The Hon. Sri N. SANJEEVA REDDI:—The proposals are under scrutiny of the local officers.

Sri B. RATHNASABAPATHI:— 1952 నుంచి ఈ కాలవ పైన investigation జరుగుతూవుంది. ఇంతవరకు నాలుగైదుమార్లు scrutiny జరగడం, రిపోర్టులు పంపడం కూడా జరిగింది అని నాకు తెలుస్తున్నది. ఇంతవరకు ఆ work తీసుకొనకపోవడానికి కారణం యేమిటో తెలియజేస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— ఈ work తీసుకొని లక్షలు ఖర్చుచేసి కడితే సోమశిల కట్టిన తరువాత ఇవన్నీ మునిగిపోతాయి. ఈ లక్షలన్నీ యేటిలో కలిసిపోతాయి అనే బాధ వుంది. అదేకాకుండా investigation నిదానంగా జరుగుతూవుంది.

### *Audit of Religious institutions in the State.*

438—

* 436 Q.—Sri S. VEMAYYA:—Will the Hon. the Minister for Revenue be pleased to state—

(*a*) the number of Religious institutions for which audit is being conducted (i) by private audit, (ii) by Local Fund Audit now; and

(*b*) whether all the institutions were audited up-to-date ?

The Hon. Sri K. CHANDRAMOULI:—

(*a*) and (*b*) The audit of accounts of religious institutions was not entrusted to any private auditors after the provincialisation of this Department.

Two *statements showing the progress of current and arrears audits are placed on the Table of the House.

---

* Vide Appendix at pages 244—245.

SRI S. VEMAYYA :— ఈ ఆడిటు చాలా institutions లో up-to-date గా జరగడం లేదు. లెక్కలు చాలా దుబారాగా వున్నవి. ఆ విషయం ప్రభుత్వానికి తెలుసునా? దానిని అరికట్టడానికి ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకుంటుందా?

THE HON. SRI K. CHANDRAMOULI :— Up-to-date audit జరగడానికే special staff వేసి arrears లేకుండా audit చేసి సక్రమంగా చెయ్యవలెనని Provincialisation చేసి నప్పటినుండి కూడా ప్రయత్నములు చేస్తున్నాము. చాలా వరకు అభివృద్ధి కనిపిస్తున్నది.

SRI P. VENKATASUBBAYYA :— ఈ institutions లో Local Fund audit జరుగుతుంది కదా. Audit fees యేమయినా charge చేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :— చేస్తారండి.

*Expenditure on the new plantations in forest areas of Vijayavada and Machilipatnam Ranges.*

440—
* 621 Q.—SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the expenditure incurred on the new plantations in forest areas of Vijayavada Range and Machilipatnam Range; and

(b) the number of plants planted and survived ?

THE HON. DR. B. GOPALA REDDI :—

*Items (a) and (b).*—The information is furnished below :—

| Name of the Range. | Year of plantations | Expenditure incurred. Rs | Number Planted | Number Survived |
|---|---|---|---|---|
| 1. Vijayavada Range | 1953—55. | 5,988-1-0 | 20475 | 16328 |
| 2. Machilipatnam | 1954—55. | 4,126-14-0 | 44860 | 41092 |

SRI S. VEMAYYA :— ఈ రీతిగా చేసినట్టు వృక్ష జాతులు యేయే జాతులలో వున్నవి.

THE HON. DR. B. GOPALA REDDI:— భిన్నమైన వృక్ష జాతులు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:— Survived అన్నారు వేసిన వారం రోజుల వరకు. ఈ వేళ వరకు బ్రతికి వున్నవా?

THE HON. DR. B. GOPALA REDDI:— రేపటి వరకు బ్రతికి వుంటవి.

*Appellate work under section 409, Criminal Procedure Code.*

441—

*767 Q.—SRI P. BASI REDDI:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(*a*) the arrangements, if any, made by the Government to relieve the Sessions Judges of the Additional Appellate work they would have to dispose of under section 409, Criminal Procedure Code, as amended by Act XXVI of 1955;

(*b*) if so, whether there are any proposals before the Government now in this behalf; and

(c) if so, what they are?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(*a*) to (c) Government have issued orders investing the existing District Magistrates (Judicial) with the powers of Assistant Sessions Judges for the purpose of hearing appeals from the convictions and sentences of second and third classes Magistrates so that the Session Judges may be relieved of the additional appellate work.

The Assistant Sessions Judges in the outlying places in the non-separation districts are also invested with appellate powers, to relieve the Sessions Judge in those districts.

SRI P. BASI REDDI :— ఈ క్రిమినలు ప్రొసీజరుకోడు క్రింద Assistant Sessions Judges powers, District Magistrate powers వేరు వేరుగా వుంటవి. ప్రభుత్వంవారు District Magistrate నే Judge గా యేర్పాటు చెయ్యడములో Advocate General opinion యేమైనా తీసుకున్నారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—High Court ను consult చేసే ప్రతి కార్యం చేస్తాం. ఈ District Magistrate, Senior Sub-Judge గా వున్నవారే. వారిని Additional District Judges గా వేస్తామని అనుకున్నాము గాని దానికి ఏదో కొద్దిగా amendment అవసరమని హైకోర్టువారే యిచ్చిన సలహా. వారి ద్వారా తీసుకున్న సలహాయే యిది.

SRI H. RAMALINGA REDDI :—Additional Judgesను వేస్తే యే యే జిల్లాలలో వేస్తారు? కర్నూలులో వేస్తే ఆదోనిలో పెడతారా? ఇదివరకు ఆ కోర్టు వుండింది.

THE HON. SRI N. SANJEEVA REDDI :— రెండు సంవత్సరాలుగా రామలింగారెడ్డిగారు చాలా బాధపడుతున్న విషయం మాకు తెలుసును. Additional Judges యిచ్చే విషయము ఆలోచిస్తాము.

SRI T. LAKSHMINARAYANA REDDI :— Cr. P. C. బాగా అమలు పరచవలెను. అంటే separation of Judiciary చాలా అవసరం. ఉదాహరణకు తూర్పు గోదావరిలో అమలు పరచడానికి అన్ని arrangements జరిగివున్నవి. అది అమలుపరచడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా?

THE HON. SRI N. SANJEEVA REDDI :— అమలుచేయవలెననే ఉద్దేశంతో మేము ప్రయత్నించాము. Separation వల్ల ప్రభుత్వానికి యెక్కువ ఖర్చుఅగుతున్నది. తూర్పు గోదావరికి 1, 2 లక్షలు యెక్కువ అవుతుందని అంచనాలు వేసినారు. ఎందుకు అదనపు ఖర్చు అవుతుంది? తగ్గించడానికి వీలు వున్నదేమో ఆలోచిస్తూ నిలుపుదల చేశాము. పరిశీలన చేసి తప్పకుండా అమలు జరుపుతాము.

SRI S. K. V. KRISHNAVATARAM :— ఇప్పుడు గవర్నమెంటు proposals లో Assistant Sessions Judge *cum* District Magistrate proposal చాలా బాగావున్నది. గాని District Magistrate వద్ద appearance కు Assistant Public Prosectuors, Grade

I and II వున్నారు. వారిని appear అయేటట్లుచేస్తారా? లేకపోతే Public Prosecutor appear అవుతున్నాడా ? Public Prosecutor అయితే చాలా వ్యయముకావచ్చును. కాబట్టి Assistant Public Prosecutors ను appear అయ్యేటట్లు provision చేస్తారా? దాని విషయములో ప్రత్యేక దృష్టితో వ్యవహరించవలెనని ప్రభుత్వాన్నికోరుచున్నాను. సమాధానము చెప్పవలెనని Deputy Chief Minister గారిని కోరుచున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :— చాలాచోట్ల ఇంతకుముందే Sub-Courtలు ఉన్నచోట్ల Additional Public Prosecutors వున్నారు. ఆ విషయము కృష్ణావతారంగారికి తెలుసును. అలా A. P. P. లు లేని జిల్లాలు ఎక్కువగావున్నవి. ఆ జిల్లాలలోకుడా Additional Public Prosecutors లను appoint చెయ్యడము అవసరముఏమో; అవసరమైతే A. P. P. లేనిచోట్ల ఏర్పాటు చెయ్యడానికి కృషిచేస్తాము. కొన్నిచోట్ల appear అవుచున్నారు. అన్నిచోట్ల appear కావడము ఎంతవరకు సాధ్యము అవుతుంది, అనేవిషయము ఆలోచిస్తున్నాము. వారికీ అధికారంయివ్వడము, అనేవిషయములో ప్రభుత్వం నిర్ణయానికి రాలేదు.

Mr. SPEAKER :—It is under consideration of the Government.

SRI S. K. V. KRISHNAVATARAM :—నా ప్రశ్న ఇప్పుడు A. P. P. లను క్రొత్తగావెయ్యాలనికాదు. అట్లాచేస్తే అధికముగా ఖర్చు అవుతుంది. A. P. P. Grades I and II లకు నెల జీతాలువున్నవి. వారిని appear కావాలని చెప్పవచ్చును. వేరే Additional Public Prosecutors ను appoint చెయ్యడము అనేది వుండకూడదన్నట్లయితే Public Prosecutors కు ఎంతో డబ్బు యివ్వవలెను. A. P. P. లకుకూడా యివ్వవలసివస్తే వ్యయము ఎక్కువఅవుతుంది అని నేను మనవిచేస్తున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :— వ్యయమగుతుందని యివన్నీమానుకుంటే Sessions Court లోకూడా P.P. లను మానివేసి వారినే పొమ్మనవచ్చును. దానికేమీ ఆక్షేపణలేదు. ఎక్కువవ్యయంఅవుతుంది కాబట్టి మనము అగ్గువ రకముగా పెట్టుకుందాము. దీనినే రు 200/- lawyer కు ఉద్యోగంయిచ్చి కేసులకు పొమ్మందాము. కూనీ కేసులు మొదలైనవాటికి లను మానివేసి ఈ రూ 200/- vakil ను పొమ్మని అన్నికేసులకు వాడుకోవచ్చును. అది wrong procedure. అన్నిచోట్ల Additional P. P. లు వున్నారు.

కొత్తగా మనం పెట్టిందికాదు. అగ్గువ అవుతుందికాబట్టి పెట్టమని చెప్పవద్దు. 200/-, 400/- అనికాదు efficiency of work జరుగుతుంది అని ఆలోచిస్తున్నాము. దానినిగురించి Department examine చేస్తున్నది. Efficiency of work కూడా తీసుకోవాలి. 400/- మిగులుతాయనికూడా important cases వారికి యివ్వడానికిలేదు. A.P.P. లుగా Junior Lawyers ను appoint చేస్తున్నారు. Senior Lawyer లు రావడములేదు. Junior lawyers ను appoint చేసినప్పుడు serious cases, important cases వారిచేతులలో పెట్టడం మంచిది కాదు The Department is examining. I would request my friend to wait for some time.

SRI P. GUNNAYYA:— అధ్యక్షా! పార్వతీపురం తాలూకాకు Additional Sub-Court చాలాకాలమునుండి ఆ Division లోవున్న lawyers, ప్రజలు కోరుచున్నారు ప్రభుత్వమువారు ఆ కోర్టుయిచ్చేందుకు ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఆలోచిస్తున్నామండి.

SRI P. BASI REDDI:— Additional P.P. లేని జిల్లాలలో వారిని ఏర్పాటు చేయవలెననే ఆలోచనవున్నదనిచెప్పారు. Additional Judge వుండేచోట్ల లేకపోతే Assistant Sessions Judge వున్నచోట A. P. P. లనువేసే ఆలోచనకూడావున్నదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:— నేను ఈ మధ్యనేతెలుసుకున్నాను ఈ point. Assistant Sessions Judge వున్నచోటకూడా అవసరంవున్నదేమో చూస్తాము. అందుకు పరిశీలనచేస్తున్నాము. Sub-Court వున్నచోట P.P. లు రెండు కోర్టులు attend కావటము కష్టంఅవుతుంది. ఎవరినైనా తన యిష్టంవచ్చిన junior ను పంపుతూవున్నారు. దీనివల్ల work suffer అవుతుంది అని తెలుసుకున్నాను. ఆ point కూడాఆలోచిస్తున్నాము. Why not we have an efficient man as A.P.P. for Assistant Sessions Courts? ఎందుకు తీసుకోగూడదు అన్న point మీద decision కాలేదు. పరిశీలనచెయ్యమని department కు పంపినాము. పరిశీలనలో వుంది.

*Basic Training School, Tiruvur, Krishna district.*

442—

* 848-A. Q.—SRI P. BAPAIAH and SRI S. VEMAYYA:—Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether any complaints were received by the Government from the public about the Basic Training School, Tiruvur, Krishna district, regarding its maladministration and misuse of public funds, etc.;

(b) whether the Government ordered any enquiry about the complaints received; and

(c) if so, whether the Government will be pleased to place the report of the enquiry conducted by the officer concerned on the Table of the House?

THE HON. DR. B. GOPALA REDDI:—

(a) and (b) The answer is in the affirmative.

(c) The Director of Public Instruction's final report in the matter is awaited.

SRI P. BAPAIAH:—1952-53 సంవత్సరంలోకూడా ఈ స్కూలు management సక్రమంగా లేదని, డబ్బు దుర్వినియోగం చేయబడుతోందని grant అపుచేయ వల్సిందనీ Educational Officer గారు రిపోర్టు చేశారని తెలుస్తోంది. అట్లాచేసినట్లు అయితే, అప్పుడు ప్రభుత్వం ఏమి చర్యతీసుకొన్నది? ఇప్పుడారిపోర్టు శాసనసభ్యులకు అంద జేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI:—అదేదో నాకు తెలియదండీ. ఇప్పుడేదో క్రొత్తగా మళ్ళీ ఒక enquiry చేశారు. ఆ రిపోర్టు యేమో డైరక్టరుదగ్గరనుంచి ఇంకా మాదగ్గరకు రాలేదు.

SRI P. KODANDARAMAYYA:—ఈ విషయంలో ములుకోల పత్రికలో చాలా విశేషంగా వ్రాశారు. అది ఈ ప్రభుత్వం దృష్టికి వచ్చిందా ? వస్తే దాని విషయం సంపూర్ణంగా విచారణ చేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—విచారణజరిగింది విచారణ రిపోర్టు యింకా మాదగ్గరకు రాలేదు. Divisiona Inspector యేమో రిఫోర్టు పంపించినారుఅది. D. P. I. దగ్గరనుంచి ఇంకా గవర్నమెంటుకు రాలేదు. ములుకోలలో ఏదో వ్రాశారని విన్నానుగాని, నేను ఎప్పుడు చూడలేదు.

SRI P. BAPAIAH :— ఈ స్కూలు management వారు ప్రభుత్వం దగ్గరనుంచి ఎంత Building grant తీసుకొన్నారు ? సెల విస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—Notice, Sir.

SRI P. SREERAMULU :— పత్రికల్లో ఏమి వ్రాశారో అని చెప్పి ముఖ్య మంత్రిగారు సెలవిచ్చారు. అసలీ పత్రికలన్నీ ప్రభుత్వానికి రావటం, వాటిలో ఉన్నటువంటి సారాంశాన్ని ప్రభుత్వంముందు పెట్టడం జరుగుతుందా? జరుగుతూఉంటే అందులోని విషయాలను గమనించి ప్రత్యేకమైన ప్రాధాన్యత యిచ్చి urgency ఉన్నప్పుడు ప్రత్యేకంగా enquiry ని expedite చేయించడానికి ప్రయత్నిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఏదో దిన పత్రికల్లో వచ్చింది పంపిస్తుంటారు. తీరిక ఉన్నప్పుడు అవి చూస్తూ ఉంటాము. ప్రతి దినంకూడా చూస్తామని గ్యారంటీగా చెప్పలేము. తర్వాత వార పత్రికలది మాత్రం పంపించరు.

SRI A. KALESWARA RAO :— ఈ తిరువూరు Basic School విషయంలో స్త్రీలు management చేస్తున్నారు. వచ్చినటువంటి పిర్యాదులు చాలా సున్నితంగాకూడా ఉన్నవి. గనుక, కేవలం ఒక్క Officer పోయి విచారించి రావడంకంటే ఎవరైనా విశ్వాసపాత్రులైనవారిలో Non-official committee వేయండి. సాక్ష్యంగూడా ఉద్యోగస్తులు సరిగా తీసుకోవడం లేదన్నారు. అందువల్ల నిష్పక్షపాతమైన విచారణ కావాలి. వాళ్ళు నిజంగా మంచి వాళ్ళు కావచ్చును, కాకపోతే చెడుగా ఉండవచ్చును. నిష్పక్షపాతమైన విచారణ చేయడానికి ఆ ఉద్యోగస్తులను ఒకరిద్దరినీ, లేకపోతే ముగ్గురినీ ఒక కమిటీగావేస్తే బాగుంటుందేమో? అది ఆలోచిస్తారా అని మనవి చేస్తున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :— ఇది కొంచెం కష్టమైనటువంటి ప్రశ్న. దీనికి తోడనే సమాధానం చెప్పలేకుండా ఉన్నాను. ఎందువల్లనంటే Divisional Inspector రిపోర్టు

పంపించినారు. D. P I. దగ్గర ఉన్నది అది. వారేంచెప్పినారో నా మట్టుకు నాకు తెలియదు. ఇటీవల నేను కాకినాడకు పోయి నప్పుడు వారు రిపోర్టు పంపించినారని మాత్రం చెప్పినారు. అంత కన్నా నాకు వివరాలు తెలియవు దీంట్లో యిప్పుడు Non-official committees ను వేసిన దానివల్ల కొన్ని లాభాలు, కొన్ని నష్టాలుకూడా ఉన్నాయి. దాంట్లో, కేవలం ఇటు వంటి విషయాలు అన్నీగూడా ఉద్యోగస్తులకు వదలితేనే మంచిది గానీ Non-officials కు వదలితే కొన్ని ఇబ్బందులుకూడా ఉన్నాయి. కాబట్టి ఈ విషయం ఇదమిద్ధమని నేనేమి చెప్పలేక ఉన్నాను. అవసరమైతే Non-officials నుకూడా వేస్తే వెయ్య వచ్చును. కాని వేస్తే ఉన్నటువంటి యిబ్బందులనుగూడా మేము గమనించవలసి ఉంటుంది.

SRI PILLALAMARRI VENKATESWARULU:—1952-53 లోనే D.E.O. దగ్గరనుంచి రిపోర్టు వచ్చిందని ఇప్పుడు పేట బాప య్యగారు వేసినటువంటి ప్రశ్నవల్ల తెలుస్తున్నది. అప్పటినుంచీ యీ రిపోర్టు ఉండగా ఇప్పటివరకు ఏ విధమైన చర్య తీసుకోలేదని స్పష్టంగా తెలు స్తున్నది. అందువల్ల వీటిని దృష్టిలో పెట్టుకొని కేవలం officials నుంచి ఆ రిపోర్టుమీదే ఆధారపడేటట్టు అయితే పూర్తిగా ఏ విధమైనటువంటి న్యాయ మైన చర్య తీసుకోలేక పోతామేమో గనుక Non-officials నుకూడా తప్ప కుండా ఆ committee లో co-opt చేసే విషయం ఆలోచిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI:—ఇప్పుడు వెంకటే శ్వర్లుగారుగూడా కోరినారు కాబట్టి నాకు చాలా అనుమానంగా ఉంది. Non-officials ను వెయ్యడంలో ప్రమాదాలు నాకు స్పష్టంగా కనుబడుతున్నాయి. ఒక తట్టు కాళేశ్వరరావుగారు, ఒక తట్టు వెంకటేశ్వర్లుగారు వీళ్ళంతా Non-officials ను వెయ్యవలెను అంటే, ఇది D. P. I. Divisional Inspectors కు వదలడం, అక్కడ D. E. O. లకు వదలడం మంచిది. కాని, ఇది నాకు తెలుసును. నేను కొంత కాలంగా వింటున్నాను. $1\frac{1}{2}$ సంవత్సరం క్రిందట ఎప్పుడో నేను తిరువూరుకుకూడా పోయి ఉంటిని. అప్పుడుకూడా complaints ను కొంతవరకు విన్నాను. అందువల్ల ఇది officials చేతుల్లో వదలితే మంచిదేమోనని అనుకుంటున్నాను.

SRI P. SUNDARAYYA:—కాంగ్రెసులో చాలా కాలంనుంచీ పనిచేస్తున్నటువంటి శ్రీ ములుకుట్ల వెంకటప్పయ్యగారు ఈ విషయంలో నిరా హారదీక్ష వహించాల్సి ఉంటుంది. ప్రభుత్వం ఏమి చర్య తీసుకోలేదని

చెప్పేసి చాలామంది శాసన సభ్యులకు ప్రభుత్వానికికూడా జాబులు పంపించారు. పోనీ Non-officials ను వేయకపోయినప్పటికి మీకు విశ్వాసపాత్రులైనటువంటి కాంగ్రెసులో మీకు చాలా నమ్మకం ఉన్నటువంటి వ్యక్తిని వెయ్యటం ఎక్కువ వుపయోగంగా వుంటుందేమో, officials కన్నా కూడా.

THE HON. DR. B. GOPALA REDDI :—దీంట్లో non-officials అంటే నాకు తెలిసినంతవరకు తిరువూరు ఆశ్రమంలో అట్టే తప్పులు లేవు. వీళ్ళంతా లేనిపోని ఫిర్యాదులు చేస్తున్నారని చెప్పేవారు కొందరున్నారు. లేదు, లేదు. కొంత యదార్థం ఉన్నది. మీరు గమనించి చర్య తీసుకోవాలని చెప్పేవారు కూడా కొందరున్నారు. అటువంటప్పుడు నాకు తెలిసినంతవరకు వాళ్ళను వేస్తే యేమి ప్రయోజనం? ఇప్పుడు కాళేశ్వరరావుగారిని వేసినారనుకోండి. నేను ఇంకా ఫిర్యాదులు అనవసరంగా చేసేవారిలో మీరు కూడా ఒకరేమో అని అనుకుంటున్నాను. లేనందులకు చాలా సంతోషం. మంచిదే. ఆ మాదిరిగా వాళ్ళకు అభిప్రాయాలు ఇంతకుముందే ఫారం అయినప్పుడు అది న్యాయంగా కూడా ఉండదేమో అని అనుకొంటున్నాను.

SRI PRAGADA KOTAIAH :— అధ్యక్షా! అనధికార సంఘాన్ని వెయ్యడం సాధ్యంకాదు అంటున్నాడు. కనీసం D. P. I. నుంచి వచ్చే రిపోర్టును ఈ శాసనసభ చర్చకైనా పెట్టేదానికి పూనుకుంటుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—ప్రతి Enquiry report అంతా కూడా ఈ టేబుల్ మీద పెట్టి దానికోసం ఒక దినమో, రెండు దినాలో చర్చ చెయ్యాలంటే సాధ్యంకాదు.

SRI T. JIYYAR DAS :— అధ్యక్షా! తిరువూరు మహిళా Basic Schoolయొక్క ఉదంతం ఖాయమైనప్పటికిన్నీ ఆంధ్రదేశానికిదెబ్బ తీసేట్లుగా వున్నది. ఇటీవల మన విద్యావేత్త అయినటువంటి G. V. సుబ్బారావుగారు, ముఖ్యమంత్రి, ఉపముఖ్యమంత్రి ప్రోత్సాహంతో ఆంధ్రదేశంలో విద్యాసంస్థ పెట్టాలనీ ఆంధ్రదేశమంతా తిరిగారు. ఈ తిరువూరు ఉదంతం విన్నతరువాత ఆ ఉద్యమాన్ని మానుకొన్నారు. పోనీ అనధికార సంఘం కాకపోయినా ముఖ్యమంత్రిగారైనా నైతిక దృష్టితో దీనిని పరిష్కరించకపోతే విద్యారంగానికి దెబ్బ తగుల్తుందని అంగీకరిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI :—నైతికంగా, భౌతికంగా, ఆర్థికంగా అన్నీకూడా పరిష్కారం చెయ్యాల్సిందే. దానికేమీ ఆక్షేపణ లేదు. ఏమైనా తప్పులుంటే తప్పులెంతవరకున్నాయో, ఎంతవరకు ఫిర్యాదు వాస్తవమో, అవన్నీకూడా జాగ్రత్తగా గమనించవలసి యున్నది. మన కాళేశ్వరరావుగారు చెప్పినట్టుగా ఈ విషయం కొంచెం సునిసితంగా వున్నది.

SRI T. PAPA RAO:— అధ్యక్షా, తిరువూరు ఉదంతం నేను కూడా ముఖుకోలలో చూశాను. నేను అక్కడ ప్రత్యక్షంగా జరుగుతున్న దానికి అందులో చూచినదానికి కొంతవరకు అతిశయోక్తులున్నట్లు కనబడు తున్నాయి. ప్రభుత్వం వాస్తవాన్నేమైనా ఆలోచించారా అని అడుగుతు న్నాను.

THE HON. DR. B. GOPALA REDDI:— రిపోర్టు అంతా చూస్తాము కాని దురదృష్టవశాత్తో అదృష్టవశాత్తో, నేను ఆ ముఖు కోలలో ఏమి వ్రాస్తున్నారో నాకు తెలియదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అయ్యా, వినోబాజీగారు అక్కడకు వెళ్ళి అక్కడ పరిస్థితులు తనకుకూడా అసంతృప్తిగా వున్నాయని చెప్పారని, ఆ తరువాత ఆంధ్రదేశ సర్వోదయ సంఘం వారు విచారణ చేసి రిపోర్టు తయారు చేశారని కూడా తెలుస్తున్నది. వాటిని దృష్టిలో వుంచుకొని అక్కడ జరుగుచున్న అన్యాయాలను అరికట్టడానికి ప్రయత్నిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI:—
మాకు తెలియదు.

*Work on the supply channel to Kongalaveedu tank in Badvel firka.*

443—
*268 Q.—SRI B. RATHNASABHAPATHY:—Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) Whether the work on the supply channel to Kongalaveedu tank in Badvel firka, Cuddapah District which was stopped as a result of the District Collector's stay orders, is resumed, and

(b) if not why?

THE HON. SRI K. CHANDRAMOULI:—
(a) The work on the supply channel to Kongalaveedu tank in Badvel firka, Cuddapah District has not yet been resumed.

(b) The matter is still under investigation.

*Land taken by the Government in Buchireddipalem.*

**444**—

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—
Will the Hon. the Chief Minister be pleased to state.

(a) whether it is a fact that the Government have taken lease of 5 acres of wet land at Rs. 400 per acre in Buchireddipalem, Nellore District, and

(b) if so why?

The Hon. Dr. B. GOPALA REDDI:—

*Clause* (a) The answer is in affirmative.

*Clause* (b) The land was taken for the production of nucleous paddy seed of long duration varieties required for distribution in the State.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:— ఏమాత్రం ఉత్పత్తి అయినది అక్కడ?

The Hon. Dr. B. GOPALA REDDI:—నోటీసు.

Sri S. VEMAYYA.—ఎకరం రు. 400 లకు ప్రయివేటువాళ్లు lease కు తీసుకున్నప్పుడు ఆ ఎకరం మీద ఎంత లాభం వస్తుందని వాళ్ళు data ఇచ్చారు?

The Hon. Dr. B. GOPALA REDDI:— లాభంకోసం కాదు. Research కోసం న్యూక్లియస్ paddy తయారు చేయుడానికి దీని పంపిణీకోసం చేశారు కాని, లాభంకోసం కాదు.

*New rail routes.*

**445—**

* 730 Q.—Sri E. AYYAPU REDDI: Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state:

(a) whether the Central Government have accepted the recommendations by this Government regarding the new rail routes: and

(b) if so, when they will be taken up.

The Hon. Sri G. LATCHANNA:—

(a) Not yet.

(b) Does not arise.

(a) ఇంతవరకు ఏ సమాధానం రాలేదు.

(b) ఉద్భవించదు.

Sri E. AYYAPU REDDI:— ఇంతవరకు Central Government తో సంప్రతింపులు జరిపిందా ప్రభుత్వం? సంప్రతింపుల ఫలితం యీ House ముందు పెట్టగలరా?

THE HON. SRI G. LATCHANNA:— కేంద్ర ప్రభుత్వం అన్ని రాష్ట్ర ప్రభుత్వాలను అడిగిన మాదిరిగానే ఆంధ్ర ప్రభుత్వాన్నికూడా ద్వితీయ ప్రణాళికలో చేర్చవలసిన నూతన రైల్వే లైనులు గురించి సూచనలు అడిగింది. మన ప్రభుత్వం అనేక సూచనలు పరిశీలించినమీదట order of priority క్రింద (1) నంద్యాల-కాట్పాడి, మైదుకూరు-కడప, పిలేరు-పాకాల లైను (2) నెల్లూరు నుంచి మైదుకూరుకు ఒకలైను (3) విశాఖపట్నం నుంచి భద్రాచలంమీదుగా కొత్తగూడెం ఒకలైను suggest చేశారు. ఇంతవరకు ప్రభుత్వానికి ఇదమిద్ధంగా సమాధానం ఏమిలేదు. కాని ఈ సిఫార్సులు చేసినతరువాత Chief Minister ఏప్రిల్ 1955 లో D. O. personal letter లాల్ బహుదూర్ శాస్త్రిగారికి వ్రాయడం, దానిని మే నెలలో acknowledge చేస్తూ ఇతర రాష్ట్ర ప్రభుత్వాలు ఇచ్చిన సూచనలతోబాటు ఈ రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన సూచనలు పరిశీలిస్తామని తెలియచేయడం జరిగింది.

Sri S. NARAYANAPPA:— క్రొత్తగా ఏర్పాటు చేయబోయే రైల్వేలైనులలో గుంతకల్లునుంచి కళ్యాణదుర్గంమీదుగా మైసూరు రాష్ట్రంలోని తుంకూరు స్టేషను కలపడానికి క్రొత్త రైల్వే లైను నిర్మాణంచేయవలసిందిగా ఆ ప్రాంతాలనుంచి విజ్ఞప్తులు పంపారు. ఎన్నో రాయబారాలు జరిపారు. ఆ విషయమై మంత్రిగారు ఏమిచర్య తీసుకున్నారో సెలవిస్తారా?

The Hon. Sri G. LATCHANNA:— రాష్ట్రములోని వివిధ ప్రాంత ప్రజలు పంపిన విజ్ఞప్తులు, జిల్లా కలెక్టరుల రిపోర్టులు ఇతర స్థానిక సంస్థల మెమోలు అన్నీ సుమారు 30 కు పైగా ఉన్నాయి వాటిని పరిశీలించిన మీదట కేంద్ర ప్రభుత్వంవారు నిర్ణయించిన ప్రాతిపదికల దృష్ట్యా - ఇన్ని మైళ్ళలోపుగా ఉండాలని, అడవుల ప్రాంతాలకు, రైలు మార్గాలు లేని ప్రాంతాలకు సంబంధించి వుండాలని ఈ మూడు సిఫార్సులు చేశాము.

SRI P. SUNDARAYYA:— ప్లానింగ్ కమిషన్ ప్రకటించిన దానినిబట్టి భారీ పరిశ్రమలు పెట్టిన స్థలాల్లో తప్ప మరొకచోట రైళ్లు వేయరని అన్నారు. అందువల్ల ఆంధ్రరాష్ట్రములో భారీ పరిశ్రమలుకాని మధ్య రకపు పరిశ్రమలుకాని లేని కారణంగా ఈ రైల్వేలైనుల వ్యవహారం మరొక అయిదు సంవత్సరాలపాటు స్వస్తి అనుకోవలసిందేనా?

The Hon. Sri G. LATCHANNA:— అలాగ అనుకోవడానికి అవకాశమేమీ కనుపించదు. ఇంతవరకు ప్రభుత్వ పరిశీలనలో ఉన్నట్లే కనిపిస్తున్నది ఇటీవల ఢిల్లీ వెళ్లినప్పుడుకూడా informal గా దీనికి సంబంధించిన మంత్రిగారితో చర్చించడం జరిగింది.

SRI P. SUNDARAYYA:— పరిశీలనలో ఉండవచ్చును. అది 5, 10 సంవత్సరాల వరకు పూర్తికాదని మంత్రిగారికి తెలుసునా?

The Hon. Sri G. LATCHANNA:— అంతవరకు జరగదనే ప్రభుత్వంవారి నమ్మకం. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఏ lines వేయాలనే విషయమై తుదినిర్ణయం జరుగవలసియున్నది.

Sri A. KALESWARA RAO:— ఇప్పుడు విశాలాంధ్ర వస్తున్నది కనుక వాల్తేరునుంచి ఖాజీపేట కలపడానికి, నెల్లూరునుంచి నల్లగొండ మీదుగా హైదరాబాదు కలపడానికి అటువంటి పెద్ద lines ఆలోచించి తక్కిన చిన్నవి కొంతకాలానికి పెట్టినా బాగుంటుందేమో— యోచించి ముఖ్యప్రాంతాలను హైదరాబాదుతో కలపడానికి క్రొత్త proposals చేస్తారా అని అడుగుతున్నాను.

The Hon. Sri G. LATCHANNA:— ఇప్పుడు ప్రభుత్వం సిఫార్సు చేసినవి చిన్న lines కావు, పెద్ద lines. విశాలాంధ్ర నిర్మాణమైన తరువాత ఏర్పడే ప్రభుత్వం ఆలోచిస్తే ఆలోచించవలసి ఉంటుంది. కాని ఇప్పుడు ఉన్న ప్రభుత్వం చేయవలసిన ఆలోచన చేసింది. ఇవ్వవలసిన సిఫార్సులు ఇచ్చింది.

Sri P. SURYANARAYANA:— క్రొత్తగా వేయబోయే రైల్వే లైను శ్రీకాకుళం నుంచి కళింగపట్నంమీదుగా వంశధార ప్రాజెక్టు వరకు వేయించవలసినదని ఇదివరకే అనేక దఫాలు మంత్రిగారికి రిపోర్టులు ఇచ్చాము. దానినిగురించి చూస్తారా?

The Hon. Sri G. LATCHANNA:— కళింగపట్నం నుంచి శ్రీకాకుళం మీదుగా వంశధార, ఆముదాలవలస నుంచి పాలకొండ, వీరఘట్టం మీదుగా పార్వతీపురం—ఈ సిఫార్సులన్నీ నేను మనవి చేసిన 30 సిఫార్సులలోను ఉన్నాయి. అన్నింటిని పరిశీలించిన మీదటనే final గా ఈమూడు lines propose చేశారు.

Mr. SPEAKER:— ఇచ్చేవారు ఈ గవర్నమెంటువారు కాదు.

Sri P. NARASIMHAPPA RAO:— ఇవన్నీ చాలారోజులుపడతా యనుకోండి. ప్రస్తుతంకర్నూలులో ఒకటే station ఉన్నది. Bcamp, Acamp గుమస్తాలు తక్కువ జీతగాళ్ళు, స్టేషను దూరంగా ఉండడంవల్ల కష్టంగా ఉన్నది. Urgent గా sub-station పెట్టడానికి ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri G. LATCHANNA.— ఇదివేరే ప్రశ్న. ఆలోచించతగినదే.

Sri P. PAPA RAO:— విశాలాంధ్ర Head quarters హైదరాబాదు అవుతుంది కాబట్టి హైదరాబాదునుంచి డైరెక్టుగా Vizag బదులు Parvatipur మీదుగా శ్రీకాకుళంకు line వేయడానికి suggest చేసే వుద్దేశం ఉన్నదా?

The Hon. Sri G. LATCHANNA:— విశాలాంధ్ర ఏర్పడిన పిమ్మట ఏర్పడే ప్రభుత్వానికి గౌరవ సభ్యులు ఈ సూచనచేస్తే బాగుంటుంది.

SRI P. SUNDARAYYA:— విశాఖపట్నం నుంచి శ్రీకాకుళం నుంచి హైదరాబాదుకు రైలు వెయ్యమని చాలామంది శాసన సభ్యులు కోరుతున్నారు. ఒక్కసారి మంత్రిగారిని ఆప్రదేశముమీదుగా తీసుకువెళ్లితే ఆలా రైలు వేయడం అసంభవం అని, లాభంలేదని తెలుస్తుంది.

(No answer)

Sri. L. LAKSHMANA DAS.—నౌపడా దగ్గరనుంచి గునుపూరు మీదుగా పార్వతీపురం కలపడానికి ఒక proposal ఉన్నది. Parlakimidi-light railway 1850 నాటిది అలాగే వున్నది. కాబట్టి దాని అభివృద్ధి గురించి, క్రొత్త lines గురించి, ప్రభుత్వం ఏమైనా సూచనలు చేసినదా ?

The Hon. Sri G. LATCHANNA.—ప్రభుత్వం చేసిన సూచనలు నూతనంగా వేయవలసిన railway lines కు సంబంధించినవి. ఇదివరకే ఉన్నవాటిని అభివృద్ధి చేసే విషయమై రైల్వే బోర్డు విచారణలో కొన్ని proposals ఉన్నాయి. ఆ విషయములో ప్రభుత్వం కొన్ని సిఫార్సులు చేసినది. Metre gauge ని Broad gauge గా చేయాలని, double line వేయాలని, కోరినవి ఉన్నాయి. అవి రైల్వేబోర్డు పరిశీలనలో ఉన్నాయి.

*Railway line between Khajipeta and Nellore.*

446—

* 848-B. Q.—Sri G. YELLAMANDA REDDI:— Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state:

(a) whether the Central Government (Planning Commission) dropped the proposal for laying a railway line between Khajipeta and Nellore via. Nandikonda; and

(b) if so, what is the action taken by this Government in this regard ?

The Hon. Sri G. LATCHANNA.—

(a) The proposal has not been recommended by this State for inclusion in the Second Five-Year Plan to the Government of India.

(b) The question does not arise.

(a) ప్రభుత్వం చేసిన సిఫార్సుల్లో ఇదిలేదు.

(b) అవకాశం లేదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—ఈ line సంగతి అట్లావుండగా, నందికొండకోసము కృష్ణమీదుగా వేసే bridge road ఆపారని అంటున్నారు. యధార్థం చెబుతారా ?

The Hon. Sri G. LATCHANNA.—ఈ ప్రపోజలుకు సంబంధించినంతవరకు ఆంధ్ర ప్రభుత్వపు Chief Engineer నందికొండను దృష్టిలో పెట్టుకుని రైల్వే అధికారుల సమావేశంలో సూచన చేశారు. ఆ సూచనపై ఇంతవరకు South Indian Railway వారి ప్రాథమిక సర్వే కూడా పూర్తికాలేదు. అవి జరిగి రైల్వేబోర్డువారి ఆమోదం పొంది పంచవర్ష ప్రణాళికలో చేర్చబడడం ఆలస్యం అవుతుందని ఆంధ్ర ప్రభుత్వ ఆమోదం మీద నాగార్జునసాగర్ బోర్డువారి నిర్ణయాన్ని అనుసరించి మాచర్ల నుంచి dam site వరకు railway line వేయడానికి నిర్ణయం చేశారు. దానిని గురించి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

Sri SHEIK MOULA SAHEB:— నెల్లూరు జిల్లా మెట్ట తాలూకాల్లో రైలు వేస్తామని చిరకాలంగా వసూలుచేసిన డబ్బు నెల్లూరు జిల్లా బోర్డులో 18 లక్షలవరకూ ఉంది. దరిమిలా దొనకొండనుంచి పడుగుపాడు వరకు సర్వేకూడా జరిపారు. ఆ లైను ముఖ్యంగా నిర్మించాలని ఆంధ్ర ప్రభుత్వానికి 1955 ఏప్రెల్ 22వ తేదీన ఒక నివేదిక సమర్పించి వున్నాను. కనీసం యీ ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి దీనిని గురించి సిఫార్సు అయినా చేయకపోతే ఆ డబ్బు దగాచేసి వసూలు చేసినట్లుకాదా? అట్లా ప్రభుత్వం చేయడంభావ్యమా అని మనవి చేస్తున్నాను.

The Hon. Sri G. LATCHANNA,—ప్రభుత్వం చేసిన దగా ఏమిలేదు. జిల్లాబోర్డువారు చేసి వుండవచ్చునేమో! నేను చెప్పిన 30 సిఫార్సులలో గౌరవ సభ్యులు చెప్పినది పరిశీలన చేయబడింది.

*Conversion of Board High School into Higher Secondary School in Rayadrug.*

447—

* 481 *Q.*—Sri N. C. SESHADRI: Will the Hon. the Chief Minister be pleased to state:

(*a*) whether any representation was made to the Government for converting the Board High School, Rayadrug, Anantapur District, into a Higher Secondary School from the next academic year, and

(*b*) if so, the action taken thereon ?

The Hon. Dr. B. GOPALA REDDI.—

(*a*) The answer is in the affirmative.

(*b*) The matter is under consideration.

Mr. SPEAKER:—Question hour is over.

[*Note.*—An asterisk. * at the commencement of a speech indicates revision by the member.]

II *Adjournment Motion.*

*Re.*—Eviction of Cultivating Tenants.

Mr. SPEAKER.—Sri Vavilala Gopalakrishnayya has given notice of the following adjournment motion.

"300 ఎకరములు భూస్వాముల పొలాలు భూసంస్కరణల పేరిట తగ్గింపబడటము సబబుకాదని, వారు బెంగపడవలసిన పనిలేదని, ప్లానింగు *మీషను సంవత్సరమునకు 15 వందల రూపాయల ఆదాయము ఉండగల భూములను, అంటే దాదాపు 20, 30 ఎకరములు వరకు కనీస కమతము లుగా ఉండవలెననడము సబబుకాదని ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు చేసిన ప్రకటన వల్ల భూసంస్కరణలు వస్తాయనే ఆదుర్దాతో ఇప్పటికే కౌలుదార్లను భూములనుంచి వెళ్ళగొడుతున్న భూస్వాములు

5th March 1956]

ఇంకా మరింత అధికంగా కౌలుదార్లను తొలగించే ప్రమాద పరిస్థితులు ఏర్పడుతున్నందువల్ల కలుగుచున్న అవసరం, ప్రజా వ్యవహారాన్ని చర్చించుటకు ఈ సమావేశము వాయిదా వేయడము అయింది.”

I do not think it is of such urgent importance. This can be discussed in the general discussion or in the land revenue discussion. The motion is ruled out.

Sri A. ERUKU NAIDU:—On a point of information, Sir

అధ్యక్షా, రోజూకూడ 1, 2 adjournment motions వస్తున్నాయి. మనకు ఇప్పుడు బడ్జటు లోటుగా ఉన్న సమయములో ఏది అవసరమో, ఏది అనవసరమో తెల్సుకొనకుండా ప్రతిదానికి adjournment motions ఇవ్వడము జరుగుతున్నది. వీటిని ప్రతిరోజు వినడం కష్టం అవుతున్నది. అందువల్ల ప్రభుత్వమువారు ఎటువంటి వాటికి adjournment motions యివ్వవచ్చునో కొంత నిర్వచనము చెబితే బాగుంటుంది.

Mr. SPEAKER.— Rules మార్చడానికి ఒక ప్రతిపాదన చేయండి.

Sri. VAVILALA GOPALAKRISHNAYYA.— మన ఆంధ్రరాష్ట్రానికి ఒక ఎరువుల ఫ్యాక్టరీ కేంద్ర ప్రభుత్వం యిస్తుందని చెప్పినారు. దానికొరకు యిన్నాళ్ళనుంచి ఆశతో చూస్తున్నాము. మన బడ్జటులో దానిని గురించి ఏమీ ఉదహరించలేదు. కేంద్ర బడ్జటులో చూస్తే మద్రాసుకు యిచ్చినట్లు అనుమానంగా ఉన్నది అది యదార్థమో కాదో మంత్రిగారు సెలవిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—మాకు ఢిల్లీనుంచి వచ్చిన information వల్ల అది లిగ్నైటు ఫ్యాక్టరీకి అనుబంధంగా వస్తుందని తెలుస్తున్నది.

## III. GENERAL DISCUSSION OF THE BUDGET FOR 1956-57.

SRI PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా! ఈనాడు మనం రెండవ పంచవర్ష ప్రణాళికలో మొదటి సంవత్సరం బడ్జటుమీద చర్చించబోతున్నాము. ఆంధ్ర రాష్ట్రానికి ఇదే చిట్టచివర బడ్జటు అవుతుందనికూడా అందరమూ ఆసిస్తున్నాము. బహుశ వచ్చే యేడాది తెలంగాణా ప్రజలతోకలసి మనము హైదరాబాదులో ఒకే శాసనసభలో కూర్చుని మన బడ్జటును తయారు చేసుకోవటము జరుగుతుందని మనం పూర్తిగాఆశిస్తున్నాము. కాని ప్రస్తుతం ఈ బడ్జటు ఉపన్యాసంవిన్నా, బడ్జటును లోతుగా పరిశీలించినా అది ఈ శాసన సభ్యులనుగాని, ప్రజలనుగాని ఏమాత్రం ఉత్సాహ

[SRI PILLALAMARRI VENKATESWARLU

పరచడం లేదనే అభిప్రాయం స్పష్టమవుతుంది. 1955-56 బడ్జెటులో మొత్తం 56 కోట్ల 34 లక్షల రూపాయలు ఖర్చు పెట్టడానికి నిశ్చయించు కొన్నాము. కాని మొత్తం బడ్జటును పరిశీలించేటట్లయితే అసలు ఈ బడ్జటువల్ల ప్రజానీకమునకు ఎంత ఉపయోగము కలుగుతుంది, ప్రజలు రెండవ పంచవర్ష ప్రణాళిక ఆశించినటువంటి ఫలితాలను దృష్టిలో పెట్టుకొని బడ్జటును పరిశీలిస్తే ఆ ఆశలు ఎంతవరకు నెరవేర్చినది అర్థమవుతుంది. ఒక ప్రక్క పన్నులభారము పెంచుతున్నాము. ఇప్పటికి 2 కోట్ల 50 లక్షల రూపాయలవరకు మనం కొత్త పన్నులు వేశాము. కాని ప్రజలకు కలిగించేటటువంటి సౌకర్యాలు ఏమాత్రము పెరగడములేదు.

విద్యమీద పెట్టేఖర్చు గత సంవత్సరముతో పోల్చిచూస్తే చాలా వరకు తగ్గింది.

THE HON. DR. B. GOPALA REDDI:— తగ్గించలేదు. కొంత economise చేస్తున్నాము.

SRI PILLALAMARRI VENKATESWARULU:— ఒకప్రక్క తగ్గించామని ఒప్పుకుంటూ అది economy అంటున్నారు. ఈ రోజున విద్యను సర్వవ్యాపితంగాచేసి, దానిని అధారంగా తీసుకొని Technical విషయాలు, Medical మొదలగు వాటిని మనం అభివృద్ధి చేసుకోవాలనుకొంటున్నాము. కాని విద్యమీద పెట్టిన ఖర్చునే కొంత కోయడం జరిగిందనే విషయం మనకు యీ బడ్జటు చూస్తే స్పష్టంగా బోధపడుతుంది.

ఈ బడ్జటు అంతటిలో మనం ఒక status quo ను maintain చేస్తున్నాము. అంటే మనం ఇప్పుడు ఎక్కడ ఉన్నామో 5 సంవత్సరముల అనంతరము కూడా అదేస్థానంలో ఉంటాన్నామన్నమాట. మనం రెండవ పంచవర్ష ప్రణాళికలో ఏ రకమైన అభివృద్ధి చేకూర్చుకోవాలను కున్నామో ఈ బడ్జటును ఎంత చదివినా కనిపించడములేదు.

పారిశ్రామికాభివృద్ధిని మన ఆర్థిక మంత్రిగారు మరచిపోయారంటే అందులో ఏమాత్రం ఆశ్చర్యంలేదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మనం పెద్ద పెద్ద పరిశ్రమలను అభివృద్ధి చేసుకొన్నప్పుడే మన దేశము యొక్క సమస్యలన్నీ పరిష్కారము అవుతాయని చెప్పారు. అదేవిధంగా భూసంస్కరణలనుకూడా దానితో జతపరచాలి. ఇట్టి సంస్కరణలకై బడ్జటును ఎంతతరచిచూచినా కనిపించడంలేదు. ప్రభుత్వం వాటిని వదలి వేయడం జరిగింది. నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు 1 కోటి 80 లక్షలు అదనంగా ఖర్చు పెట్టామని చెబుతూ, ఇంకా ఎక్కడో అక్కడ ఖర్చు తగ్గిస్తున్నామని చెబుతూ ప్రధానమైన విషయాలలో కోతకోయడం జరిగింది.

SRI PILLALAMARRI VENKATESWARLU]
బడ్జటు లోటు ఏర్పడినది కాబట్టి కొన్ని ముడికోతలు కోస్తున్నాము అన్నారు. లోటు బడ్జటులు మనము ఎప్పుడూ చూస్తూనే ఉన్నాము. అలోటు ఏర్పడినందువల్ల ఏమాత్రమూ ప్రమాదంలేదు. అందువల్ల లోటు బడ్జటు అయినప్పటికీ ఎక్కువగా ప్రజానీకానికి సౌకర్యాలు చేకూర్చేందుకు ఖర్చు పెట్టాలి అనే విషయము దృష్టిలోపెట్టుకొని ఈ బడ్జటును తయారు చేయలేదు. ద్వితీయ ప్రణాళికలో మనం 116 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టవలసియున్నది. ఈ సంవత్సరం ప్రణాళికలో మనం 25 కోట్లు ఖర్చు పెట్టవలసివున్నది. అట్లుకాక మనం చాలా తక్కువ మొత్తమును యీ సంవత్సరంలో ఖర్చు పెట్టుతున్నాము. 1 కోటి లేక $1\frac{1}{2}$ కోట్లు అటు ఇటుగా ఖర్చుపెట్టవచ్చును, గాని ఇంత తక్కువగా ఖర్చు పెట్టడం అనేది సబబుగాలేదు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద 116 కోట్ల రూపాయలు మాత్రమే చాలుననిచెప్పారు. ఆంధ్రదేశం ఎంత వెనుకబడివున్నా, మనకు పెద్ద పరిశ్రమలు ఎక్కడా లేనప్పటికీ, ఆదాయం వచ్చే మార్గాలు పూర్తిగా మృగ్యము అయినప్పటికీ, పెద్ద పరిశ్రమలకు ఏమీ కేటాయించ కుండా కేంద్ర ప్రభుత్వం మనకు సున్న చుట్టింది. కేంద్ర ప్రభుత్వం కేటాయించిన మొత్తం కన్నా కూడా మన ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు ఇంకా తగ్గించారు.

గోపాలరెడ్డిగారు Budget speech లో "మాకు ఉన్నటువంటి డబ్బును బట్టి, పరిస్థితులను బట్టి ఖర్చు తగ్గించుకోవలసివస్తే తగ్గించుకోవలసి ఉంటుంది" అని చెప్పారు. పునరాలోచించడం ఎందుకు ? ఏమైనా ఎక్కువ చేయడానికి మనవల్ల కాదుగదా ! మనపైన కేంద్ర ప్రభుత్వం ఒక ceiling పెట్టింది. పునరాలోచించుకోవడం అంటే తగ్గించుకోడానికి మనం పునరాలోచించుకోవాలి. ఇప్పటి కప్పుడే $2\frac{1}{2}$ కోట్ల రూపాయలు మనం పన్నువేశాము. వచ్చే సంవత్సరానికి యింకా రెండున్నర కోట్లు అదనపు పన్ను వేస్తామంటే, వేసేటటువంటి పరిస్థితి కూడా ఉన్నట్లుగా నాకు కనబడ్డంలేదు. ఏ పెద్ద జమిందారులమీదో, భూస్వాములమీదో ఎక్కువ పన్నులువేసి, వాళ్ళ ఆస్తులను పరిమితం చేసినప్పుడు ఏమి జరుగుతుందో తప్ప, ప్రస్తుతం యిప్పుడున్న పరిస్థితులలో అదనంగా పన్నులు వేస్తామంటే ప్రజలను పీల్చిపిప్పిచేయడం తప్ప మరేమీవుండదు. అలాంటప్పుడు ప్రభుత్వానికి అదనపు ఆదాయం ఎక్కడనుంచి వస్తుంది? ఈ మొదటి సంవత్సరములో మనం పెట్టేటటువంటి ఖర్చువల్ల ఉత్తరోత్తర మన ఆదాయం ఎంత పెరుగుతుందో వారేమైనా చెప్పారా ? ఈ విషయములు మంత్రిగారి Budget speech లో ఎక్కడా కనిపించుట లేదు. మనకు ఎంత ఆధాయం పెరుగుతుంది ? National Plan-

[SRI PILLALAMARRI VENKATESWARLU

ing లో 5 సంవత్సరాలలో 25% ఆదాయం పెంచామన్నారు. ఆంధ్రరాష్ట్రానికి వారు ఏమైనా work out చేశారా ? ఒకవేళ అలా apply చేసినట్లయితే యీనాడు ఆంధ్రరాష్ట్రంలో National income ఎంత ? దానిని ఎంత పెంచబోతున్నారు ? కేంద్ర ప్రభుత్వం 5 సంవత్సరములలో 80 లక్షల మందికి ఉద్యోగావకాశాలు కల్పిస్తున్నదన్నారు. మనకిచ్చినటువంటి draft plan లో 2 వ ప్రణాళికా కాలంలో సుమారు 88 వేల మందికి వుద్యోగాలు కల్పిస్తామనిచెప్పారు. ఈ విధంగా బడ్జట్ తగ్గించారుకదా ! దీనినిబట్టి ఎంతమందికి వుద్యోగాలు కల్పించబోతున్నది ? ఎంతమందికి తగ్గిపోతున్నది అనే విషయాలు కూడా గోపాలరెడ్డిగారి వుపన్యాసంలో ఎక్కడాలేవు. ఇప్పుడు మనకు technical personnel చాలా కొరతగావుందని స్పష్టంచేశారు. ఈ విషయాన్ని మేము క్రిందటి సంవత్సరంకూడా చెప్పాము. మనకు Doctors, Engineers చాలా కొరతగావున్నారు. Technical studies అభివృద్ధి చేయడానికి మీ plan ఏమిటి అని అడుగగా కావలసినంత మందివున్నారు, ఇతరచోట్లనుంచి వస్తారు అని శ్రీ కళా వెంకట్రావుగారు చెప్పారు. ఇతర చోట్లనుంచి వచ్చేపరిస్థితులు ఎల్లప్పుడువుండవు. అన్ని రాష్ట్రాలలో ప్రణాళికలు వేసుకొని ఆప్రణాళికలను గురించి పని చేసినట్లయితే ప్రతిచోటగూడా యిదే కొరత ఏర్పడుతుంది. అలాంటప్పుడు భారతదేశంలో యీ కొరతను ఎలా పరిష్కరిస్తారనే విషయమేమైనా యీ బడ్జట్టులో చూపించారా అంటే, అదిగూడా యిందులోఎక్కడాలేదు. అసలు యీ విషయాన్నిగురించి ప్రస్తావించనేలేదు. ఈ పరిస్థితుల దృష్ట్యా ఈ బడ్జెటును పరిశీలించినట్లయితే యీ నాటిపరిస్థితులనుండి ఒక్కడుగుకూడా ముందుకుపోలేమని స్పష్టమవుతున్నది. విద్యావిషయంలో చూచినట్లయితే యిప్పుడున్న పరిస్థితులనుంచి వెనక్కు వెళ్ళుటకు అవకాశాలువున్నాయని, యిప్పుడుండే నిరుద్యోగ సమస్యను పరిష్కరించు కోడానికి ఏమాత్రమూ యీ బడ్జెట్టు ఉపయోగపడేదిగా లేదని మనకు స్పష్టంగా భోధపడుతున్నది.

ఒక్క నాగార్జునసాగర్ ప్రాజెక్టు విషయంలో తప్ప యీ బడ్జట్‌లో గత సంసత్సరంకంటే ఏమీ ఎక్కువ కనబడుటలేదని బోధపడుతున్నది. ఈ సందర్భంలోనే మద్రాసు బడ్జట్‌ను దృష్టిలోకి తీసుకోవలసిందని నేను కోరుతున్నాను. మద్రాసు బడ్జట్‌లో గత సంవత్సరం Capital Expenditure 20 కోట్ల 5 లక్షలు. ఈ సంవత్సరం 27 కోట్ల 61 లక్షలు రూపాయలు ఖర్చుపెడుతున్నారు. మన గోపాలరెడ్డిగారు గత సంవత్సరం Capital Expenditure 14 కోట్ల 95 లక్షలువుంటే యీ సంవత్సరం 15 కోట్ల 12 లక్షలు ఖర్చుపెడుతున్నారు. దీనినిబట్టి ఎంత

SRI PILLALAMARRI VENKATESWARLU]

proportion లో యిస్తున్నారో ! ధైర్యంగా అప్పుచేయడానికి గూడా మనం ప్రయత్నంచేయాలి. మన అవసరాలను దృష్టిలోపెట్టుకొని budget plan చేసుకోవాలి. మనకు యింతేవుంది అంటేవచ్చే సంవత్సరం మాత్రం డబ్బు ఎక్కడనుంచి రాబోతున్నదని నేనుఅడుగుతున్నాను. వచ్చే సంవత్సరం మాత్రం మనకు అప్పుఎవరిస్తారు ? కేంద్ర ప్రభుత్వం యిస్తామని చెప్పిందా ? మీ తంటాలేవో మీరే పడండని చెపుతున్నారు వాళ్ళు. అసలు మన resources ఏమిటి ? మనం పెద్ద పెద్ద భూస్వాముల దగ్గరనుంచి, పెట్టుబడిదారుల దగ్గరనుంచి ఏవిధంగా డబ్బు సంపాదించగలమో చూచుకోవాలి. అదేవిధంగా అప్పుచేయడానికి మనం ధైర్యంగా ముందుకు రావాలని నేనుకోరుతున్నాను. ఉన్న గుడ్డ ప్రకారమే కోటు కుట్టించుకుంటాననే స్థితిలోగనుక నున్నట్లయితే మన దేశం ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రం అభివృద్ధిలోకి రావటానికి సావకాశాలు లేవు. మదరాసు బడ్జెట్‌లో వాళ్ళువున్నంతవరకు లోటుబడ్జట్ అయినా సరే ముందుకుపోవడానికి ఏ విధంగా Capital out lay ని పెంచ డానికి పూనుకొన్నారో అదేవిధంగా మనం పెంచకపోయినట్లయితే మనము అభివృద్ధిచెందలేమనే విషయాన్ని నేను మీఅందరి దృష్టికి తీసికొనివస్తున్నాను. ఇప్పుడు బడ్జట్ మొత్తం 116 కోట్ల రూపాయలు. దాంట్లో మొదటి సంవత్సరం ఖర్చుపెట్టవలసిన 23 కోట్ల రూపాయలనైనా మనం సరిగా ఖర్చు పెట్టితేగాని లాభంలేదు. ఇప్పుడు 19·54 లక్షలు మాత్రమే ఖర్చు పెడుతున్నాము. 1955-56 లో చూసుకున్నట్లయితే 18 కోట్ల 4 లక్షలు రూపాయలు ఖర్చు పెట్టాము. దీనినిబట్టి మనం పంచవర్ష ప్రణాళికను ఎంతవరకు పూర్తి చేయ గలుగుతాము ? మనకిచ్చినటువంటి 116 కోట్ల రూపాయలుకూడా ఖర్చు పెట్టలేమనే అనుమానం కలుగుతున్నది. ఇది పరిశ్రమల అభివృద్ధిని ఆటంకపరుస్తున్నది. దీంట్లో 42 లక్షల రూపాయలు పరిశ్రమల అభివృద్ధి కోసమని నిర్ణయించడం జరిగింది. హిందూపత్రిక సంపాదకీయం మంత్రి గారు చూచే వుంటారనుకుంటాను. దీనినిగురించి ఎంతో బాధపడుతూ వ్రాశారు. మీరు ఈవిధంగా బడ్జట్ తయారు చేసుకున్నట్లయితే ఏవిధంగా అభివృద్ధిని సాధించుకోగలుగుతారు ? అందులో వాడిన పదములు చెప్పా లంటే "To limit only to paper mills etc., to neglect more essential area of developments"అని ఉన్నది. పరి శ్రమలను అభివృద్ధి చేయడములో మనప్రభుత్వంకూడా కనీసం Financial Corporation ను యేర్పాటుచేసి దానిద్వారా మిగిలిన అన్ని పరిశ్రమలను పెట్టుబడిదారులను, ప్రయివేటు పరిశ్రమలవారిని ప్రోత్సహించి వారిద్వారా పరిశ్రమలు పెట్టించడానికి పూనుకోవాలని వారు suggest చేశారు. కాని దీంట్లోగూడా చాలా తక్కువ మొత్తము తీసుకొచ్చారు. ఈ పరిశ్రమలు పెట్టడములోగూడా 42 లక్షలరూపాయలు యిచ్చినప్పుడు ఒక Paper Mill

[SRI PILLALAMARRI VENKATESWARLU

ఒక సిరమిక్ factory ఈరెండు మినహాయించినట్లయితే Cottage Industries అని చెప్తారు. ఇది చెసినప్పుడు మనం కొంచెం జాగ్రత్తగా ఆలోచించాలని మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. అసలు revised Second Five-year draft plan లో తెలియజేసిన ప్రకారం large scale and medium industries కి 71 లక్షల 39 వేల రూపాయలు ఖర్చు పెట్టాలని దాంట్లో సూచించారు. Village Industries కి 1 కోటి 40 లక్షల రూపాయలు. అంటే మొత్తం రెండుకల్పి సుమారు 2 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టాలని అంచనా వేసుకోడం తరువాత 42 లక్షలకు దీనిని తగ్గించడము జరిగింది. మన పరిశ్రమలు బుట్టలు, చాపలు, తివాసీలు, కుండలు, మట్టి బొమ్మలు యిటువంటివి తయారుచేయడం దీనికోసం డబ్బు ఖర్చుపెట్టడము దేశమంతగూడ పారిశ్రామిక యుగంలో వుంది. మనదేశములో పరిశ్రమలు చాలా తక్కువగాయున్నాయి. అటువంటప్పుడు మనం కేవలం మట్టి బొమ్మలు, చాపలు మొదలైన వాటిమీద దృష్టి నిలుపుతామంటె మనం ఎలా అభివృద్ధిలోకి వస్తాం ? ఈ విషయం జాగ్రత్తగా ఆలోచించవలసిందని నేను మంత్రివర్గ దృష్టికి తీసికొని వస్తున్నాను.

దీంట్లో Ceramic Factory, Paper Mill, Government Press వున్నాయి. వీటితో సంతృప్తిపడితే సరిపోదు. ఇంకా పరిశ్రమలను అభివృద్ధి చేసుకోడానికి కనీసం హిందూపత్రిక చేసినటువంటి సూచననైనా పాటించి ఒకకోటి రూపాయలను దానికి ప్రత్యేకించి పెట్టుబడిదారులను ప్రోత్సహించి వారిచే యిటువంటివన్నీ పెట్టించడానికి ప్రయత్నంచేయాలి. కళా వెంకట్రావు గారు ప్రైవేటు పెట్టుబడిదారులు రావడంలేదని అనేక పర్యాయములు చెప్పారు. అలాంటప్పుడు ఏంచేయాలి ? డబ్బంతా ప్రభుత్వం భరించి అయినాసరే పరిశ్రమలను ప్రారంభించడానికి పూనుకోవాలి. పరిశ్రమలు లేకపోతే మనము చాలా చిక్కులలో పడతాము. ఈనాడు మనకువచ్చిన అవసరాల దృష్ట్యా చూసుకున్నాసరే పరిశ్రమలు ఎక్కువగా లేకపోతే ముఖ్యావసరాలుకూడా మనం నెరవేర్చుకోలేక పోతున్నాము. Capital outlay irrigationకు మనం 2 వ పంచవర్ష ప్రణాళికకు 56 కోట్లు ఖర్చు పెట్ట నిశ్చయించుకున్నాము. 1955-56 డిశంబరులో మనం ఖర్చుపెట్టుకున్నది చూసినట్లయితే irrigation and electricity కలిసి 11 కోట్ల 76 లక్షలు ఖర్చు పెట్టాము. ఈనాడు అంతకంటె తక్కువ. Power చూచుకున్నప్పుడు 6 కోట్ల 28 లక్షలనుంచి 15 కోట్ల 69 లక్షలకు తగ్గించడం జరిగింది.

పంచవర్షప్రణాళికలు వేసుకొని అభివృద్ధిచెందటానికి మారుగా electricity అవి చూచుకొన్నప్పుడు ఆ మొత్తాలు తగ్గించడము జరిగింది. ఈ

SRI PILLALAMARRI VENKATESWARLU]
విధంగా మనము ఖర్చుపెట్టుకొన్నవి తగ్గించుకొని పొదుపుపేరట అసలు అవసరమైనటువంటివన్నీ తగ్గించుకుంటున్నాము. Electricity అత్యవసర మని అంతా అంగీకరిస్తున్నారు. దీనిని develop చేసుకుంటేనేగాని పరిశ్రమలను అభివృద్ధి చేసుకోలేము. అలాంటి పరిస్థితులలో ప్రధానమైన దానికి ఖర్చు తగ్గించుకోవడంఅంటె ఏమాత్రం సబబుగాలేదు. అందుచేత దీనిని ఎక్కువ చేయడానికి పూనుకోవాలని నేను కోరుతున్నాను. Irrigation మీద expenditure చేసుకోడానికి budget demand లో చూచుకున్నట్లయితే maintenance and repairs అనేవి పూర్తిగా cut off చేసి పారేశారు. ఇందాకా ఖర్చు తగ్గించలేదు. పొదుపుచేస్తున్నామని మంత్రి గారు చెప్పారు. కాల్వలమీద, ఆనకట్టలమీద irrigation ప్రాజెక్టులమీద repairs, maintenance మాత్రం పూర్తిగా తగ్గించారు. దానినిబట్టి నేను వేసిన లెక్కల ప్రకారం చూచినట్లయితే సుమారు 10 లక్షల రూపాయల వరకు తగ్గించడంజరిగింది. చాలా దారుణంగా దీనినితగ్గించడం జరిగిందని మంత్రివర్గం దృష్టికి తీసికొని వస్తున్నాను. అంతేకాకుండా introduction development sworksలో కూడా తగ్గించడము జరిగింది. క్రిందటి సంవత్సరం3కోట్ల 34 లక్షల రూపాయలకు తగ్గించడం జరిగింది. Irrigation side ని చూసుకున్నాసరే ఎక్కడైతే మనము ఎక్కువ ఖర్చు పెట్టవలసిన అవసరం వుందో అక్కడే మనం తగ్గించుకొన్నాము. ఇలా తగ్గించుకోవడంవల్ల వచ్చే ఫలితం మనకు తెలుసు. ఈనాటినుంచి మళ్ళీ కరువుకు గురిఅయ్యే అవకాశంతప్ప వేరేమీలేదు. అందువల్ల మంత్రివర్గం తిరిగి దీనిని పరిశీలించాలని కోరుతున్నాను. అన్నిటికంటే ప్రధానమైనటువంటిది విద్య. విద్య విషయం చూసుకున్నట్లయితే ఎవరైనాసరే చివరకి పూర్వం విద్యాశాఖమంత్రి గారైన పటాభి రామారావుగారైనాసరే. దీంట్లోవున్న ప్రతిపాదనను బలపరుస్తారా ? అని నేను అడుగుతున్నాను. Second planలో మొత్తం 7 కోట్ల 60 లక్షల రూపాయలు ఖర్చుపెట్టమని దీంట్లోయున్నది. దాన్ని ప్రకారం plan వేసుకొన్నట్లయితే కనీసం 88 లక్షల రూపాయలు ఆదనంగా plans కి development కి ఖర్చు పెట్టాలనివుంది. 1955-56 లో 71 లక్షల రూపాయలు ఖర్చుపెట్టారు. కాని యీ బడ్జటులో 46 లక్షల రూపాయలు మాత్రమే ఖర్చుపెట్టాలి. Plan ప్రకారంగా 88 లక్షలు ఖర్చుపెట్టాలి. 1955-56 లో 71 లక్షలు ఖర్చుపెడితే 1956-57 వచ్చేసరికి 36 లక్షలుమాత్రమే మనము ఖర్చు పెడుతున్నాము.

మొట్ట మొదట తయారుచేసిన దాని ప్రకారం 88 లక్షలు ఖర్చుపెట్టాలి. 1955-56లో 71 లక్షలుఖర్చుపెడితే, 1956-57 బడ్జట్ వచ్చేటప్పటికి 36లక్షలు మాత్రమే ఖర్చు పెడుతున్నారు. అటువంటప్పుడు దీనివల్ల మనం ఏవిధంగా అభివృద్ధి సాధిస్తాము. మన ఆశయం ఏవిధంగా నెరవేరుస్తాము అనేటటు

[SRI PILLALAMARRI VENKATESWARLU

వంటి వాటినిబట్టిచూస్తే ఎవ్వరూకూడా ఈ ప్రతిపాదనతో ఏకీభవించలేరు. గత సంవత్సరం budget చూసినట్లయితే 5 కోట్ల 23 లక్షల రూపాయలు budget లో estimate చేశారు. 5 కోట్ల 16 లక్షలరూపాయలు మాత్రమే ఖర్చుపెట్టారు. ఈనాడు చూచినట్లయితే 4 కోట్ల 78 లక్షలకు తగ్గించారు. అంటే ఎంత తగ్గించారో మనకు బోధపడుతూనేవుంది. ప్రధానంగా ముఖ్య మంత్రిగారే Education Minister గా వుండడము ఒక విధంగా చిక్కు వచ్చిందేమోననిపిస్తుంది. Education Department వారి చేతులలోనే వుండడంచేత ఎవరు అడుగుతారులే అనే ధోరణిలో చేసినట్లు కనిపిస్తున్నది. లేకపోయినట్లయితే University Education ని 44 లక్షలనుంచి 31 లక్షల రూపాయలకు తగ్గించడం ఎందుకు జరుగుతుంది? ఇక building grants ఎంతతగ్గించారు, అంటేమీకుపాఠశాలలు అక్కరలేదు. పాఠశాలలు లేకుండా ఏచెట్టుక్రిందో, పుట్టక్రిందో కూర్చొని చదువుకోండి అనే విధంగా తయారు చేశారు. ఆవిధంగా బిల్డింగ్ గ్రాంట్సు పూర్తిగా తగ్గించారు.Non Government Secondary School Building grant లక్ష 74వేలకు తగ్గించారు Local body లకు building grant 2 లక్షల 98 వేలకు తగ్గించారు Direct grant to Non-Government private schools was reduced by 6 lakhs 36 thousands, local bodiesకు primary education క్రింద 59 వేలు తగ్గించారు. Stipend సగానికి సగము cut off చేశామని మొన్న budget speech లో చెప్పారు. సగానికి సగమేకాదు అది speech లోనే చెప్పారు యింకా ఎక్కువే cut off చేయడం జరిగింది. Training of the school masters stipends reduced from 2 lakhs 95 thousand to 28 thousand. Training of school mistress stipends one lakh 22 thousand to 50 thousand వరకు తగ్గించడం జరిగింది. అందువల్ల విద్యావిషయములో యీవిధంగా తగ్గిస్తూవచ్చారు. యీవిధంగా తగ్గించడంవల్ల వచ్చే ఫలితం ఏమిటో గూడా మీకు తెలుసు. Madras Government Primary School teachersకు Elementary School teachers కు అందరికిగూడా Government ఉపాధ్యాయులకిచ్చే జీతాలే యిస్తామని చెప్పింది. మన మంత్రిగారుగూడా యిది వరకు అదేవిధంగా తెలియజేశారు Budget వుపన్యాసములోగాని, budgetలో గాని ఆ ప్రతిపాదన ఏ విధంగాగూడా మనకు కనబడలేదు. అది ఎందువల్ల జరిగిందో చెప్పవలసిన అవసరమున్నదనిమాత్రం నేను అనుకుంటున్నాను. ఇప్పుడు కుప్పుస్వామి committee report లో elementary school management అంతాకూడా ప్రభుత్వమే తీసుకోవాలని సూచించారు. కాని అదంతా ఆవిధంగా అట్టే పెట్టటం జరిగింది. ఒకటి రెండు జిల్లాల్లో మాత్రం experiment చేస్తూఉన్నారు. ఆ experiment కూడా అదేవిధముగా సాగుతుంది, ప్రధానంగా primary education అంతా గూడా

SRI PILLALAMARRI VENKATESWARLU]
private వ్యక్తుల చేతులలో వుండడంవల్ల అనేకనష్టాలు వస్తున్నాయనే విషయము మనము గమనిస్తున్నాము. ఇటువంటప్పుడు అవన్నీ మార్చవలసిన అవసరమున్నది. మళ్ళీ తిరిగి తీసుకోవలసిన అవసరంగూడా వున్నదని మంత్రివర్గముయొక్క దృష్టికి తీసుకొస్తున్నాము. Education మీద యీ విధంగా సంకుచిత దృష్టితో మనం budget తయారు చేసేటట్లయితే మనము మనరాష్ట్రాన్ని ఏవిధంగాను ముందుకుతీసుకుపోలేము. Medicine తీసుకోండి ఈరోజున medicine కావాలిఅంటే, social services యివన్నీ అభివృద్ధి కావాలి అంటున్నాము. గ్రామ గ్రామానికి compounder ను, midwife ను లేకపోతే చిన్న డాక్టరునో పంపాలని అనుకుంటున్నాము. అలాంటిది మీ medicine యొక్క demand అంతా చూసే టట్లయితే దాంట్లో ఏమన్నా కనబడుతున్నదా అంటే కనబడదు. మీరు యిచ్చినటువంటి వుపన్యాసంలో ఎక్కడైనా సరే ఇంతమంది డాక్టర్లు ఉన్నారు. ఇంతమందిని ఎక్కువ చెయ్యబోతున్నాము. ఈ సంవత్సరం ఇంతమందని ఎక్కువ చేస్తాము. 5 సంవత్సరాలలో ఇంతమందిని ఎక్కువ చేస్తామని చెప్పింది ఎక్కడైనా ఉన్నదా అంటే ఎక్కడా లేదు. Budget memorandum చూసేట్లయితే అసలు ఏ విధమైనటువంటి explanation ఉండదు. ఎందువల్ల తగ్గించారో చెప్పరు. Technical గా దాంట్లో ఉండేటటువంటి విషయాలు తీసుకువచ్చి చెప్పడం తప్ప అసలు budget memorandum తయారు చేసినంతవరకు అది ఏవిధంగా సభ్యులకు ఉపయోగపడడంలేదని మంత్రివర్గానికి తెలియజేస్తున్నాను. ఎప్పుడో పూర్వం 1920 వ సంవత్సరంలో తయారు చేసినటువంటి పద్ధతిలో budget memorandum తయారు చేయడం ఏ విధంగాను సబబుగా లేదు. ఎందువల్ల తగ్గించారంటే అది budget లోను, budget memorandum లోను కనబడదు.

Hand loom weavers విషయంలో గూడా cess fund నుంచి 31 లక్షలకు తగ్గించడం జరిగింది. ఈ నాడు మనం hand loom cloth ను ప్రోత్సహించాలనేటట్లయితే కేవలం ప్రత్యేకంగా hand loom cloth అమ్మే టటువంటి చోట మాత్రమే ఈ sales tax లేకుండా చేస్తే సరిపోదు. ఈ నాడు ప్రజలు అనేక దుకాణాలలోకి పోతున్నారు. Hand loom cloth ఎక్కడ ఉన్నప్పటికీ, మిగిలిన mill cloth కంటె ఎక్కువ advantage గా ఉండేటట్లుగా చెయ్యాలంటే hand loom cloth మీద sales tax అన్నది పూర్తిగా రద్దు చేసేటట్లయితే ఈ hand loom cloth ఎక్కువగా విడుదల కావడానికి వీలవుతుందని తెలియజేస్తున్నాను.

హరిజనుల వీళ్ళ అభివృద్ధిని గురించి వేమయ్యగారు ఇంకా వివరాలు తెలియజేస్తారు. దీంట్లో చూసేటట్లయితే దీనిలో డా house sites provide చెయ్యాలని చెప్తున్నాము. భూములు ఉన్నవి తీసుకొని

[SRI PILLALAMARRI VENKATESWARLU

ముందు మీరు ఇల్లు వేసుకోండి అనే ఉత్తరువు చేయవచ్చును. పూర్వం సంజీవయ్యగారు అనేక తడవలు చెప్పారు. Land acquisition సవరిస్తే గాని house sites చురుకుగా ఇవ్వడం జరగదని తెలియజేశారు. కాని ఇంతవరకు అసలు ఏ విధంగా సవరించాలో, అటువంటి proposals ఏమి పెట్టలేదు. సంవత్సరానికి 10, 15, 20 మందికి గూడా house sites ఇస్తున్నామనే లెక్కలు కనబడుతున్నాయి. అసలు గ్రామాలలో ఉండేటటువంటి వారికి ఎవ్వరికి గూడా ఉండటానికి ఇల్లు లేకుండా ఉండగూడదనే principle తో start అయి, Government భూములు లేకపోయినట్లయితే అక్కడ వుండేటటువంటి భూములనుగాని లేక పెద్ద పెద్ద భూస్వాముల యొక్క భూములను తీసుకొని, వారంతట వారు తంటాలుపడి ఇల్లు వేసుకోవటానికి ఇళ్ళ స్థలాలైనా provide చెయ్యాల్సిన అవసరం ఉన్నదని ప్రభుత్వంయొక్క దృష్టికి తీసుకువస్తున్నాను. మరో విషయం ఏమిటంటే దీనిలో Excise Department ఉన్నది. Prohibition తీసుకుపోయి police తో కలిపామని చెప్పారు. కాని ఖర్చు మాత్రం అక్కడే ఉంది. Prohibition Department క్రింద పూర్వము 31 లక్షల 52 వేలు ఖర్చు చేస్తే, ఇప్పుడు 31 లక్షల 88 వేలు ఖర్చు చేస్తున్నారు. ఎందువల్ల ఇది ఇట్లా ఉందో తెలియడంలేదు. Prohibition work అంతా Police Department చేస్తున్నది. ఖర్చు మాత్రం Prohibition Department క్రింద ఉన్నది. ఈ డబ్బు ఏ విధంగా ఖర్చు చేయబోతున్నారో గూడా అర్థం కాకుండా ఉన్నది. అదేవిధంగా loans ఇచ్చేటటువంటి విషయంలో గూడా చాలావరకు తగ్గించడం జరిగింది. Co-operative societies కి 67 లక్షల నుంచి 45 లక్షల వరకు తగ్గించడం జరిగింది. Development schemes కు గూడా 84 లక్షల నుంచి 50 లక్షల వరకు తగ్గించారు. Low income groups కు పది లక్షల రూపాయలు ఇళ్ళు కట్టుకోవడానికి ఏర్పాటు చేశారు. ఇప్పుడు వాటికి గుండు సున్న చుట్టారు. అక్కడి వాళ్ళకి ఒక్క దమ్మిడీ గూడా provide చెయ్యడం జరగలేదు. Weavers గూడా cess fund నుంచి 47 లక్షల నుంచి 31 లక్షలకు తగ్గించి ఇవ్వడం జరిగింది. ఇవన్నీ గూడా budget లో మనకు ప్రత్యేకంగా కనపడుతున్నాయి.

అందువల్ల యివన్నీ చూచినపుడు అసలు యీ budget ఎంతవరకు వుపయోగపడుతుందో చూడడం ప్రధానమైనటువంటి విషయం. యీ budget చదివినపుడుగాని, budget లో గాని, budget speech లో గాని land reforms తీసుకురాబోతున్నామని చెప్పలేదు. ఎంతసేపు "ఆలోచన" "ఆలోచన", తెగనటువంటి, అంతులేనటువంటి ఆలోచన జరిగిపోతున్నది. కొన్ని సంవత్సరాలనుంచి ఆలోచనలోనే ఉన్నది. అక్టోబరు చివరలో కమిటి report వచ్చినది; అసలు committee వేయడమే శుష్క దండగ అను

SRI PILLALAMARRI VENKATESWARLU]
కున్నాము. ఈ సమస్యను వాయిదా వేయడమా, లేదా అని ఎంతో ఆలో చించి సంజీవరెడ్డిగారు ఈ committee ని వేశారు. ఆ committee october చివరకు report యిచ్చింది. నవంబరు, డిశంబరు, జనవరి, ఫిబ్రవరి జరిగిపోయి మార్చిలో ఉన్నాము. అంటే 5 నెలలు జరిగిపోయినా మంత్రివర్గానికి పరిశీలించేందుకు అవకాశం కూడా లేకుండా పోయింది. ఇంకా చదవను కూడా చదవలేదా ? పరిశీలించడానికి typed matter చదవవచ్చునుగదా ! అందువల్ల దానిని పరిశీలించడానికి కూడా మంత్రి వర్గానికి అవకాశం లేకుండా పోయింది.

Ceiling పెట్టాలని Planing Commission చెప్పుతున్నది. ఒక ceiling పెట్టి పెద్ద పెద్ద భూస్వాముల ఆస్తులను పరిమితముచేసి, అవన్నీ తీసుకొని పేద ప్రజానీకానికి పంచాలని ఉన్నది. కాని, యీ ceiling పెట్టేలోపల అందరు అమ్ముకొంటున్నారు. ఎన్నో ఎకరాలు అమ్మివేసి, చివరకు 20, 30 ఎకరాలకు ceiling తగ్గించుకొని తీసు కుంటారేమో, చివరకు ఇదంతా ఏమి జరుగపోతుందో తెలియదు. ఏదో కుంబకోణం క్రింద తయారవుతుందనేటటువంటి అనుమానము కలుగు తున్నది. అందువల్ల Land Reforms వెంటనే చేయవలసిన అవసర మున్నది.

తరువాత Village officers విషయములో, estate గ్రామాలలో ఉండేటటువంటి Vllage officers కున్నూ రైత్వారీ గ్రామాలలో ఉండేటటు వంటి Village officers కున్నూ సరిసమానమైన జీతాలు చేస్తామని లోగడ బడ్జెట్ సమావేశములో చంద్రమౌళిగారు వాగ్దానం చేశారు. కాని, అది ఇందులో ఎక్కడా కన్పడలేదు. మద్రాసు ప్రభుత్వము ఇస్తామని ప్రకటించింది. అసలు దానికిగాను ఖర్చులో ఎంత తేడా ఉంటుందనే విషయం గూడా పేర్కొనకుండా ప్రక్కన కూర్చొని ఉన్న మంత్రిగారు ఇచ్చి నటువంటి వాగ్దానాన్ని అయినా సరే దృష్టిలో పెట్టుకోకుండా ఉండడం చాలా విచారకరంగా ఉన్నది. బహుశా ఈ విషయము సభ్యులందరూ మరచి పోయినారని అనుకుంటున్నారేమో! ఇది చాలా పొరబాటు. అందువల్ల Village officers యొక్క జీతాల విషయము ఈ బడ్జెట్‌లో వెంటనే include చేయవలసిన అవసరమున్నదని నేను మనవి చేస్తున్నాను.

మరొక విషయము చెప్పి ముగిస్తాను. పోనీ ఈ బడ్జెటులో ఏమైనా పొదుపు చేశారా అంటే అదేమీ కనపడదు. P. W. D. లో చాలా wastage ఉన్నదని అందరికి తెలుసును. ప్రతి రోజు సంజీవరెడ్డిగారు ఈ విషయము గురించి చెప్పుతూనే ఉన్నారు. కాని ఫలితమేది! Budget వచ్చేటప్పటికి, waste చేసేటటువంటి, corruption ప్రోత్సహించేటటు

[SRI PILLALAMARRI VENKATESWARLU

వంటి విధానానికే నన్ను వోటు చేయమని కోరుతున్నారు. దీనిని check చేయడానికి వారి proposals ఏమైనా ఉన్నాయా అంటే ఏమీలేవు. అదే విధంగా యీ wasteful budget జరుగుతూ వున్నది. పెద్ద, పెద్ద వుద్యోగస్తులు జీతాలన్నీ ఆలోచించి తగ్గించాలంటే అదేమీ పట్టించుకోలేదు. ఖర్చులు చూచినట్లైతే ప్రతి సంవత్సరం గవర్నరుకోసం, ఆయన residence కోసం లక్ష, పదివేలు ఖర్చు పెడుతున్నారు. లక్ష, పదివేలు అంటే అంత తేలికగా వున్నట్లున్నది ప్రభుత్వానికి. ప్రతి సంవత్సరం ఆయన residence కోసం ఇంత డబ్బు ఏమి చేస్తారు? ఈ డబ్బుకు విలువ లేకుండా పోయిందేమో తెలియదు. ఇటువంటి కొన్ని కొన్ని దుబారా ఖర్చులు తగ్గించుకోవచ్చు. ఇక పరిశ్రమల విషయంలో మనకు ఏలాటి చెప్పుకోదగ్గ పరిశ్రమ కేంద్ర ప్రభుత్వము యివ్వనందుకు మన అసమ్మతిని తెలియజేయవలసిన అవసరమున్నది. మన దేశములో ఇక్కడ ఎరువులు ఖర్చు అవుతూవుండే Fertilizers Factory తీసుకుపోయి మద్రాసులో పెడుతారంటే, అసలు మన ఆంధ్రదేశాన్ని ఇంత తేలికగా, ఇంత చౌకగా కేంద్ర ప్రభుత్వము చూస్తున్నదని మనము అనుకోవలసియుంటుంది. ఏ పెద్ద పరిశ్రమగాని, medium పరిశ్రమగాని కేంద్ర ప్రభుత్వము మన దేశములో పెట్టకపోవడం చాలా గర్హించవలసినటువంటి విషయము. ఇది కేవలము పొరబాటు. చూడకుంటే, ప్రతివాళ్ళు, కాంగ్రెసు వాళ్ళుగాని, ఎవరుగాని తీవ్రమైనటువంటి అసమ్మతిని తెలియజేయకపోయినట్లైతే కేంద్ర ప్రభుత్వము ఎప్పుడూ మన నెత్తిమిద కూర్చొని సవారీ చేస్తుంది. మన దేశంలో తయారయ్యే పొగాకు మొదలైన వాటిమీద Excise duty ద్వారా 20, 25 కోట్లు తీసుకొంటూ మనకు ఒక దమ్మిడీగూడా ఇవ్వడంలేదు. ఏదో 10, 15 కోట్లు అప్పుగా ఇస్తున్నామని చెప్పి, మననెత్తిమిద చెయ్యిబెట్టి తీసుకుపోతున్నారేగాని మనకు ఒక దమ్మిడీ సహాయం గూడా వారినుంచి రావడంలేదు. మనకు ఒక భారీ పరిశ్రమగూడా లేకుండాపోతున్నది. ఎంతసేపటికి మనము ధాన్యం తయారుచేసి, ఇతరులకు సప్లైచేసి, బుట్టలు చాపలు, నవారు అల్లుకొనే స్థితిలో మనలను అట్టేపెట్టడానికి చూస్తున్నారేగాని మరేమీలేదు. దీని యొక్క పన్నులు విధానంగూడ పెద్ద కోటీశ్వరులకు వుపయోగపడేటటువంటి పద్ధతిలో వుంటున్నది. ఇదంతా మనము దృష్టిలో పెట్టుకొని భారీ పరిశ్రమలు ఆంధ్ర దేశములో పెట్టడానికి మనమందరము కృషి చేయాలని కోరుతూ, ఇంతటితో శెలవు తీసుకొంటున్నాను.

MR. SPEAKER :— గౌరవ సభ్యులకు ఒక మనవి చేస్తున్నాను ఈ వేళ అధమం 20 మందైనా మాట్లాడాలనుకుంటున్నారు కనుక యికమీదట సభ్యులు తమ ఉపన్యాసాలను 15 నిమిషములు పరిమితము చేసుకొంటే బాగుంటుంది. వెంకటేశ్వర్లు గారు ప్రారంభోపన్యాసము చేశారు. కాబట్టి వారికి అరగంట అవకాశము యివ్వబడింది.

Sri P. NARASIMHAPPA RAO :— అధ్యక్షా, నిన్న మన ముఖ్యమంత్రిగారు బడ్జెటు ఉపన్యాసము చదువుతూవుండగా, అందులోని వారి కళ, కవిత్వము అంతా విని చాలా ఆనందించాము. Land Reforms రాబోయే సంవత్సరములో పెడుతామని చెప్పారు. అది వస్తుందని యింకా ఎక్కువగా ఆనందించాము. కాని నిన్న ఆ Budget speech విన్నతరువాత ఆంధ్రదేశములో చాలా ఆందోళన కలిగిందని చెప్పక తప్పదు. వారు వ్యక్తిగతంగా చెప్పారు అనవచ్చును. కాని యిప్పుడు వ్యక్తిగతంగా వారు పెద్ద భూస్వాములనే వాడుక వున్నది. కమ్యూనిష్టు నాయకులు నాగిరెడ్డిగారు కూడ ఒక భూస్వామి అని వాడుక వున్నది. ప్రజాసోషలిష్టుపార్టీకి చెందిన విజయనగరం రాజావారుకూడ ఒక పెద్ద నాయకుడని వాడుక వున్నది. ఈ ముగ్గురు నాయకులు కలిసి యీ బిల్లు పెట్టకుండా చేస్తున్నారేమో అని అందరికి ఒక ఆందోళన వున్నదని మనవి చేస్తున్నాను. ఈ సారి బడ్జెటు పుస్తకము యిదివరకటికంటే చాలా పెద్దదిగా కన్పిస్తున్నది. పని తక్కువ అయినా పుస్తకము మాత్రము చాలా పెద్దదిగా పెరిగిపోతున్నదని మనవి చేస్తున్నాను. మొదట బ్రిటిషువాళ్ల కాలములో Budget ఏవిధంగా తయారు చేస్తూవుండిరో అదేమోస్తరుగా యిప్పుడు యీ Budget లో కూడ కేవలము అంకెలు కన్పిస్తున్నాయి గాని మరేమిలేదు. నేను దాన్ని ఎంత పరిశీలించినా అందులో నాకేమి కన్పించలేదు. పోనీ పెద్దవాళ్ళు ఏమైనా చెప్పగలుగుతారేమోనని వారిని అడిగితే, మాకుకూడ అలాగే వున్నదని వారుకూడ నాకేమి చెప్పలేకపోయినారు. కనుక బ్రిటిష్‌వారి కాలములో ఏవిధముగా దీన్ని తయారు చేస్తూవుండినారో అదేమోస్తరుగా యిప్పుడు దీన్నికూడ తయారు చేసినారని చెప్పవలసి యుంటుంది. ఆ విధానాన్ని మార్చుచేసి అది అందరికి తెలిసేటట్లుగా చేయవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను. ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాతనైనా మనము కొన్ని అలవాట్లను మార్చుకొని అందరికి తెలిసేటట్లుగా చేయాలిగాని ఆ బ్రిటిషువిధానాన్నే ఇంకా అనుసరించడం ఏమాత్రము సమంజసము కాదు. అప్పుడు బ్రిటిషువారి కాలములోవున్న సెక్రటరీలే యిప్పుడుకూడా వున్నారు. కాబట్టి వారు అదే విధానాన్ని యిప్పుడుకూడా అవలంబిస్తూ, అదేవిధంగా ఈ Budget ను తయారు చేస్తున్నారు. ఈ విధానములో మార్పు తీసుకురావలసిన అవసరమున్నది. మనకు క్రొత్తగా ఆంధ్రరాష్ట్రము వచ్చింది గనుక, ముఖ్యమంత్రిగారు చదివిన బడ్జెటు ఉపన్యాసములో తమ కళ, కవిత్వము యే విధముగా వున్నాయో, అదేవిధముగా ఈ బడ్జెటునుగూడా తయారు చేయవలసిందని ముఖ్యమంత్రిగారికి మనవి చేస్తున్నాను.

తరువాత దాంట్లో వెనుకబడిన జిల్లాల గురించి చెప్పుతూ, యీ వెనుకబడిన జిల్లాలలో స్కూళ్ళుగాని, ఆస్పత్రులుగాని, రోడ్లుగాని అడగటంలేదని చెప్పారు. కాని మేము వాటికొరకు కృషి చేస్తూనే వున్నాము. మా విశాఖపట్టణము, శ్రీకాకుళం జిల్లాలు. ఎక్కువ వెనుకబడిన జిల్లాలు వాటినిగురించి

అక్కడ రోడ్లులేవని, గుఱ్ఱము మీద మూటలు తీసుకొని వస్తున్నారని మాకు తగు వసతులు కల్పించండని ఎన్నోసార్లు కోరుతూ వచ్చాము. కాని వాటిని చూసేదిక్కే లేకుండావున్నది. District Board తీసివేసిన లగాయతు, అక్కడి ప్రజలకొరకై ఏమీ చేయుడములేదు. District Board Fund క్రింద ప్రజలనుంచి డబ్బు పుచ్చుకొంటున్నారుగాని, దానిలోనుంచి ఒక దమ్మిడీకూడా ఒక్కడుకూడా ఖర్చు పెట్టినట్లు చెప్పలేకుండా వున్నాను. ఈ District Boards తీసివేసి మూడు సంవత్సరాలైంది. అయినా ప్రజలనుంచి డబ్బు పుచ్చుకొంటున్నారు. కాని వారికొరకు ఖర్చు పెట్టడంలేదు. మీకు P. W. D. వున్నది. అది పనులు చేసిపెడుతుంది. అలాంటప్పుడు యివి ఎందుకు ? ఎందుకు మీరు వీటిని extend చేస్తున్నారు? ఆ staff ని పోషించడానికా, ఆ staff ను పోషించడం అనవసరము, దుబారా ఖర్చు అవుతుంది. ఈ District Boards ఏమి చేస్తున్నాయని ఆ staff ను పోషిస్తున్నారు? అదేవిధముగా రెవిన్యూబోర్డు మీకు ఏమి చేస్తుంది, అది మద్రాసులోవున్నది. కలెక్టరు నుంచి సంతకమై వస్తే ఆటపా కాగితంమీద వీళ్లు ఒక ముద్రవేసి, కలెక్టరు వ్రాసినదాన్నే approve చేసి secretariat నుంచి వచ్చిన దానిపైన ఒక ముద్రవేసి కలెక్టరుకు పంపిస్తారు. ఇది వారుచేసే పని. ఈ టపాపనితప్ప దానినుంచి మరేమీ ప్రయోజనము లేదు. అటువంటప్పుడు యీ రెవిన్యూబోర్డుక్రింద మీరు ఎంత ఖర్చుపెడుతున్నారు ? దానియొక్క అవసరమేమిటి ? వాళ్ళు స్వతహాగా ఆలోచించి ఒక కాగితమైనా మీకు పంపిస్తున్నారేమో చూడండి. కావలసి వుంటే మీరు కాగితాలు చూడండి, తెలుస్తుంది. దేనిపైన అయినాసరే District Collector ఏమి వ్రాస్తాడో ఆయన అవునంటే అవును, లేదంటే లేదు అని వ్రాస్తూ గవర్నమెంటుకు పంపడం, ఇక్కడ మినిష్టరుగాని, Chief Secretary గాని ఏమి order pass చేస్తే దాన్ని క్రిందకు పంపించడం తప్ప మరేమి చేసేది లేదు. ఇటువంటి టపా ఆఫీసుకు ఎందుకు మీరు అన్ని లక్షల రూపాయలు ఖర్చు పెడుతున్నారు ? ఈ డబ్బుతోనే ఆంధ్ర రాష్ట్రంలో యింకొకదానికి వినియోగించండి. ఈవిధంగా దుబారా ఖర్చులన్నీ తగ్గించండి. కావాలంటే మంత్రులయొక్క, M. L. A. ల. యొక్క జీతాలు తగ్గించండి. మా T. A. లు తగ్గించండి. వీరందరికి పెట్టే దుబారాఖర్చు అంతా తగ్గించండి. వీళ్ళకు ఎక్కడచూచినా phones వున్నాయి. వీటిని 24 గంటలు వుపయోగిస్తూ వుంటారు. వాటికయ్యే డబ్బుఅంతా ప్రభుత్వముది: ఇష్టమువచ్చినట్లు యీ phones వుపయోగిస్తూ వుంటారు. నా స్వంతపని వుంటే నా డబ్బుతో వాడుకోవాలిగాని, గవర్నమెంటు డబ్బుతో వాడుకోకూడదు. కాని అవిధంగా ఎవరూ చేయడం లేదు. ప్రతిదానికి ఎప్పుడూ phones లో పిలుస్తూవుండడం జరుగుతూంది టువంటి దుబారా ఖర్చుఅంతా తగ్గించుకోవచ్చు.

తరువాత, గత సంవత్సరం బడ్జెటులో శ్రీకాకుళం Collector office కు గాను 8 లక్షల రూపాయలు కేటాయించినట్లు వ్రాశారు. కాని అందులో దానికిగాను ఏమీ ఖర్చు పెట్టినట్లు లేదు. మద్రాసు ప్రభుత్వములో అప్పుడు మన Finance Minister, ఇతర Ministers కూడా వుండేవారు. అప్పుడు, భక్తవత్సలంగారు ఏమి చేసినారంటే, ఇదిగో యీ ఆంధ్ర జిల్లాకు యిన్ని కోట్ల రూపాయలు కేటాయించబడిందని అంకెలలో మాత్రము చూపించేవారు. పనిమాత్రము అక్కడ అరవదేశంలో చేసేవారు. ఆ విధంగా మనకేమో యీ దేశములో పనులేమీ కన్పించవు. ఒక దమ్మిడీ కూడ శ్రీకాకుళం Collector's Office కు మీరు ఖర్చుపెట్టినట్లు లేదు. అంకెలుమట్టుకు కన్పిస్తున్నాయి. అవి చూచి సంతోషించవలసిందే తప్ప మరేమి లేదు. గుడ్డివాడు అదేదో పెట్టుకొని సంతోషించినట్లు, మేము యీ బడ్జెటు పుస్తకాన్ని పెట్టుకొని అయ్యో దీంట్లో యీ అంకెలు వేశారని అందరికి చూపించి సంతోషించడంతప్ప పనులేమి కన్పించకుండా వున్నాయి.

మాకు శ్రీకాకుళం జిల్లా అని పేరు పెట్టారేగాని, అక్కడ జిల్లా haed quarters అని చెప్పినందులకు కలెక్టరు ఆఫీసును యింతవరకూ కట్టించలేదు. ఇదివరకు ఏవిధముగా వున్నదో, యిప్పుడుగూడా అదే విధముగా ఆ ఆఫీసును వుంచారు. ఈ సంవత్సరము అయినా దాన్నిగురించి పనిచేస్తారో లేదో తెలియడములేదు.

మాకు నారాయణపురం ఆనకట్ట అని ఒకటి ప్రారంభించారు. ఇంకొకటి సంకెలపెద్ది ఆనకట్ట అని వున్నది. అదిగూడా ప్రారంభించారు. ఈ సంకెలపెద్ది ఆనకట్టకు పునాదులు త్రవ్వటము ప్రారంభించి సుమారు మూడు సంవత్సరాలు అయినది. ఇంతవరకు అది బైటికి రాలేదు. ఏదో సామెత చెప్పినట్లు, ఓలె తక్కువ అయితే ఎవడో గుడ్డిదానిని పెళ్ళి ఆడినాడట. గుడ్డిది కాబట్టి కళ్ళు కనబడక దినమూ ఒక కుండను పగలకొట్టడము జరుగుతున్నదట. పెళ్ళిచేసుకొన్న ఖర్చుకన్నా ఎక్కువగా ఖర్చుకావడము జరిగిందట. అదేవిధముగా యీ ఆనకట్టలు కట్టించడానికి cheapest tenders యిచ్చినవారికి యిచ్చారు. ఈ cheap tender పెట్టినవారికి ఒకటివుంటే ఒకటి వుండదు. ఇందువల్ల పనులు కావడములో చాలా అలస్యము జరుగుచున్నది. ఇప్పటికే మూడు సంవత్సరాలు జరిగింది. ఇంతవరకు ఏ పనులుగూడా అక్కడ జరగలేదు. కాబట్టి మా జిల్లా విషయములో ప్రభుత్వము యింత శ్రద్ధ తీసుకుంటున్నదన్నమాట. ఇప్పటికి 8 లక్షల వరకు శాంక్షను చేశారన్నారుగాని, పని మాత్రము కనబడదు. ఇక పోతే నారాయణపురము ఆనకట్ట విషయములో కొన్ని లక్షలవరకు గ్రాంట్లు యిచ్చారు. అందులో ఎంత ఖర్చు అయిందోగూడ ప్రభుత్వానికి తెలిసియుండవచ్చు. కాని ఖర్చుకు తగినంత పని యేమి అక్కడ కనబడదు. ఏమండీ, పనులు యిట్లా జరుగుతున్నవేమి అని అడిగితే, మీకోసము, మీ

జిల్లాకోసమే గదండీ పనులు చేస్తున్నామని చెబుతారు. అది విని సంతోషించవలసిందేకాని, పనులా చురుకుగా జరుగుతున్నట్లు కన్పించదు. ఇప్పుడు జరిగేదానికంటే యింకా కొంచెము చురుకుగా పనులు జరిపించవలసిందిగా కోరుతున్నాను. ఇక నందికొండ ప్రాజెక్టు విషయము చూడండి. పనులు మాత్రము మహా చురుకుగా సాగిస్తున్నారు. ఎప్పుడో కేంద్ర ప్రభుత్వం 143 కోట్లు యిస్తుందని, యిప్పుడు మనకువున్న డబ్బు కాస్తా దానిమీద ఖర్చు చేస్తున్నారు. సుమారు 120 కోట్లు దీనిమీద ప్రస్తుతము ఖర్చు చేస్తున్నప్పటికినీ, ఆ ప్రాజెక్టు త్వరలో వస్తుందా, పెడుతుందా అనేది ప్రభుత్వం ఆలోచించడంలేదు. ఎప్పుడో, ఎన్నో సంవత్సరాలకు కాని తయారుకాని యీ పెద్ద ప్రాజెక్టుమీద ఖర్చుచేసేబదులు వెంటనే యీ రెండు సంవత్సరాలలోనూ తయారుఅయ్యే ప్రాజెక్టు, మా వంశధార ప్రాజెక్టు క్రింద కొద్ది సొమ్ము ఖర్చుచేస్తే, సుమారు 10 లక్షల రూపాయల ఆదాయము ప్రభుత్వానికి వస్తుందికదా! గుంటూరు జిల్లామీద తీసుకునే శ్రద్ధ, వెనుకబడిపోయిందని ప్రభుత్వమే ఒప్పుకొంటున్న మా జిల్లామీద యీమాత్రపు అభిమానము, శ్రద్ధ చూపిస్తే, త్వరలోనే ఎంతో ఆదాయము వస్తుందిగదా! గుంటూరుజిల్లావారు మాకన్న ఎంతోముందుకు పోయారుగదా! పైకిమాత్రము, అభిమానము కురిసిపోతున్నట్లు మా శ్రీకాకుళం జిల్లా సంగతే వస్తుందిగాని! ఆచరణలోకి వస్తే, అది అంతగా కనబడదు. కాబట్టి నందికొండమీద చూపించే శ్రద్ధ, మా వంశధారమీద ఎందుకు చూపించకూడదు? మా జిల్లాలో యింకొకటి నందివాడ ప్రాజెక్టు అని వున్నది. దానిక్రింద రెండు లక్షల ఎకరాలు చీపురుపల్లి తాలూకాలోనూ, పాలకొండ తాలూకాలోనూ ఉంది. ఈ రెండు తాలూకాలుగూడా యీ ప్రాజెక్టు క్రిందను వస్తాయి. ఈ ప్రాజెక్టు సంగతిగూడా అట్లాగే వున్నది. అక్కడ ప్రజలందరూ, ప్రభుత్వానికి డబ్బు లేకపోతే, ఎంత కావాలో చెప్పండి, అది అంతా మేము యిచ్చుకుంటాము, మాకు యీ ప్రాజెక్టు ముందు కట్టించండి అంటే, ప్రభుత్వము యేమి మాట్లాడదు. ఇక యిక్కడ తుంగభద్రక్రింద 43 కోట్లు దాకా ఖర్చు పెట్టారు. అంత ఖర్చుచేస్తే, ఒక కోటి చిల్లర ఆదాయం వస్తుందని అంటున్నారు అంత తక్కువ ఆదాయం వస్తే ప్రయోజనమేమిటి? దాన్ని ప్రయోజన పరుచుకోటానికి యింకా ఎనో సంవత్సరాలు పడుతుంది గదా! వెంటనే ప్రయోజనానికి వచ్చేది మా జిల్లాలో విడిచిపెట్టి, ఎప్పుడో ప్రయోజనపడే ప్రాజెక్టులను గురించి డబ్బు ఖర్చుపెట్టటానికి చూస్తే, అది యేమి సమంజసముగా లేదు. కాబట్టి ఊరకనే మాటలు చెప్పి మమ్ములను సంతోషపెట్టేబదులు, ఆచరణలో చూపించమని అంటున్నాను.

ఇకపోతే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విషయము ఒకటి వున్నది. దానిక్రింద జిల్లాలలో N. E. S. Blocks అని ఏర్పాటు చేశారు. వాటి క్రింద 7 లక్షల 50 వేల రూపాయలుదాకా యిస్తున్నారు. ఒక లక్ష రూపాయలదాకా staff కు జీతాల క్రిందనే ఖర్చు అవుతున్నది. అడవారు,

మగవారు ఎంతసేపటికి 24 గంటలూ కార్లలో, జీపులలోనూ Social Welfare Work అని చెప్పుకుంటూ తిరగడము, గ్రామములకు వాళ్లు వచ్చినప్పుడు, వాళ్ల ముఖాలు యీ పల్లెలలోనివాళ్ళు చూడడము కనపడు తున్నది కాని, వారు చేస్తున్నపని యేమీ కనపడడములేదు. పెట్రోలు క్రిందనే ఒక లక్ష రూపాయలదాకా ఖర్చు కావడము కనబడుతున్నది. పనిచూస్తేమాత్రము శూన్యం. అంతకంటే యేమి కనబడదు. ఈ 7 లక్షల 50 వేలలో ఒక లక్ష సిబ్బంది జీతాలకు, ఒక లక్ష పెట్రోలు వగైరాలకు buildings క్రింద ఖర్చు చేస్తున్నారు. పోతే 4 లక్షలు కేంద్ర ప్రభుత్వము loan గా యిస్తున్నారనుకోండి. పోతే మిగతా 50 వేల రూపాయల కోసము ఎందుకు యిదిఅంతా? Land Acquisition చేయాలంటే, Tahsildar దగ్గరకు పంపుతున్నారు. ఇక తహశీల్‌దార్ల సంఖ్య చూస్తే, అపరిమితముగా ఉన్నారు. పోరంబోకు తహశీల్‌దారని, Loans Tahsildar అని యీ విధముగా తలచిన చోటులో ఒక తహశీల్‌దారును ప్రభుత్వము ఏర్పాటు చేసింది. ఎందుకు యింతమంది తహశీల్‌దార్లు? ప్రభుత్వము సిబ్బందిని ఎక్కువ చేసిననూ Block Development Officers ను వేసినారు, మరల ఏ పనికి పోవలసివచ్చినా, ఆ తహశీల్‌దార్ల వద్దకే పోవలసి వుంటున్నది. ఇంతమంది ఉన్నప్పటికినీ, యీ Block Development Officers అక్కడికి వెళ్ళితే, వాళ్ళను చూచేవారే లేరు. తీరా అక్కడికి రావలసింది తహశీల్‌దారే. ఇటువంటి సందర్భములో, ఆ పని అంతా ఆ తహశీల్‌దార్లకే ఎందుకు అప్పచెప్పకూడదు? వాళ్లు ప్రజల బుర్రలమీద కొట్టి పని చేయించగలరుగదా! ఈ Developmen Officers వెళ్ళితే వారిమాట లక్ష్యపెట్టేవారే లేరు తహశీలుదార్లనే వేస్తే, యీ పని ఎంతో చురుకుగా జరుగుతుంది. ఈ Development Officers కు, యింకా యితర సిబ్బందికీ, వాళ్ళకు పెట్రోలు వగైరాలక్రింద చేసే ఖర్చు అంతాగూడా దుబారా అని అంటున్నాను ఇలాంటి విధముగా దుబారా ఖర్చుచేసే బదులు, ఆ లక్ష రూపాయలు ప్రజలకు కూలి క్రింద ఖర్చు చేయండి. మరొక లక్ష రూపాయలు ప్రజలే యిస్తారు. పని గూడా చురుకుగా జరుగుతుంది. ఎటుచూచినా, రెవిన్యూ డిపార్టుమెంటువారు లేనిదే అక్కడ ఒక్కపని గూడా జరగదని నేను చెప్పగలను. ఎవరిని పలకరించబోయినా, తహశ్శీల్‌దారు రావాలంటారు. ఆఖరుకు రెవిన్యూ ఇన్స్పెక్టరును వేసినా, ఎంతో పని చేయించగలడు. కనుక యీ సిబ్బంది యీ ఖర్చు అంతా వృథాయేనని అంటున్నాను. ప్రభుత్వము యీ విషయము అంతా గమనిస్తారని అనుకుంటున్నాను.

ఇక పోతే మాకు శ్రీకాకుళం జిల్లా అని పేరు పెట్టి, విడదీసి యిప్పటికి సుమారు 5, 6 సంవత్సరాలు అయింది. ఇంతకాలము అయినప్పటికినీ పేరుకు శ్రీకాకుళం జిల్లా అని అంటున్నారే కాని, అక్కడ కలెక్టరు ఆఫీసు సరియైనది లేదు సరేకదా, జిలా కోర్టు అయినా ఏర్పాటుచేయులేదు.

జిల్లా కోర్టుకు విశాఖపట్టణమునకు, నూరు మైళ్ళ దూరము వెళ్ళాలి, ఇక D. S. P. ఆఫీసు చూస్తే, విజయనగరము అన్నారు. ఇవి అన్నీ వేరే వేరే చోట్లలో పెట్టి ప్రజలకు యిబ్బంది, అనవసరపు ఖర్చులు కలిగించే బదులు, అన్నీ ఒకేచోట పెట్టకూడదా? ఖర్చులు కూడా చాలా మటుకు కలిసివస్తాయి కదా! ఈ ఆఫీసులన్నీ మా శ్రీకాకుళంలోనే ఏర్పాటు చేయవచ్చును గదా! అక్కడ స్థలము లేదా, నీరు లేదా, యింకా కావలసిన amenities యేవి లేకుండా ఉన్నవి? ఈ బడ్జటులో యీ ఏర్పాట్లు అన్నీ జరుగుతున్నాయని ఆశించాము. కాని యిందులో అవి ఏవీ కనబడలేదు. పోనీ వచ్చే బడ్జటులోనైనా చేయిస్తారని నమ్ముతున్నాను. D. S. P. ఆఫీసు విషయము చూస్తే, Police Demand క్రింద చూపించారనుకున్నాను. వెదికితే ఎక్కడా కూడా కనబడదు. గత సంవత్సరము నేను మా జిల్లాలోని నందివాడ ప్రాజెక్టు సంగతిని గురించి మాట్లాడుతూ, దానిక్రింద ఏదైనా సొమ్ము ఖర్చు చేస్తారా అని అడిగాను. కాని దానికి జవాబు లేదు. పోనీ యీ సంవత్సరము బడ్జటులోనైనా at least, token grant గా నైనా ఒక వంద రూపాయలు అయినా చూపించ లేదు. మా జిల్లా చాలా వెనుకబడి ఉన్నదని ప్రభుత్వమే ఒప్పుకుంటున్నది. ఆ జిల్లా విషయములో యీ మాత్రపు కొద్ది శ్రద్ధ అయినా చూపించి ఆ జిల్లా ముందుకు రావటానికి అవకాశం ప్రభుత్వం కలుగజేస్తుందని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS:—అధ్యక్షా, ఈ నాడు ఈ బడ్జట్ పైన జరుగుతున్న చర్చలలో నాకు గూడా పాల్గొనే అవకాశము కలిగించి నందులకు మీకు నా ధన్యవాదాలను అర్పిస్తున్నాను. ముఖ్యంగా యీ బడ్జటును ప్రవేశపెట్టి చర్చించేనాటికి మనము విశాలాంధ్రలోకి పోవటానికి అవకాశాలు ఏర్పడుతున్నాయి. అయితే విశాలాంధ్ర విషయములో ముఖ్యంగా తెలంగాణా ప్రాంతము, యిప్పుడు ఉన్న ఆంధ్ర ప్రాంతము కలిసినంత మాత్రాననే మనము ఆనందించడమునకు వీలులేదు. ఆ విధంగా సంతోషించేటట్లైతే, అది చాలా పొరబాటు చేస్తున్నారనే అనుకోవలసి వస్తుంది. ఈ సందర్భములో నేను ముఖ్యముగా చెప్పవలసినది ఒక విషయము వున్నది. మనకు యిదివరకు తెలుగు భాగాలుగా వున్నవి, ఉత్తరమున ఉన్నవి ఒరిస్సా రాష్ట్రములో కలిసిపోయినవాటిని మనము తిరిగి తెచ్చుకొనవలసిన కృషి ఎంతో ఉన్నది. అవి తెచ్చుకొన్నప్పుడే మనము విశాలాంధ్ర సాధించడములో మనయొక్క నిజాయితీని రుజువు చేసుకోగలుగుతాము. అవి కాకుండా విశాలాంధ్రను సాధించాము అని చెప్పుకోవడములో ఏవిధంగాను మనకు విలువలేదని చెప్పవలసివున్నది. అవి సాధించుకోవటానికి మనమందరము కలిసి ఒక్కుమ్మడిగా ఆలోచించుకొని ప్రయత్నించాలి. ఇదేవిధముగా దక్షిణ ప్రాంతములో అటుమద్రాసు రాష్ట్రములో, యిటు మైసూరు రాష్ట్ర

ములో తెలుగు ప్రాంతాలు ఎన్నో ఉన్నవి. కొన్ని కలిపివేశారు. ఈ విధముగా తెలుగు ప్రాంతాలు ఎక్కడ ఉన్నా సరే అవి అన్నీ గూడ మన తెలుగు రాష్ట్రములోనికి తెచ్చుకోటానికి, అందరము కలిసి కృషి చేయాలి. ముఖ్యంగా మనకు ఉండిన తెలుగు ప్రాంతాలు గంజాము జిల్లాలోను కోరాపుట్టి జిల్లాలోను చేర్చబడ్డవి. పూర్వము మనము మద్రాసు రాష్ట్రముతో కలిసి ఉన్నప్పుడు. ఒరిస్సా రాష్ట్రము యేర్పాటు అయ్యే సమయములో, ఆంధ్రరాష్ట్ర ప్రసక్తి లేనందున, ఆ తెలుగు ప్రాంతాల కొరకు మనము పోరాడలేక పోయాము. ఇప్పుడు మనకు ప్రత్యేకంగా తెలుగు భాషా రాష్ట్రము ఏర్పడ్డది గనుక, మననుంచి విడిపోయిన తెలుగు ప్రాంతాలను మరల మన రాష్ట్రములోనికి తెచ్చుకోగలిగినప్పుడే మనయొక్క నిజాయితీని రుజువు చేసుకోటానికి వీలు అవుతుంది. ఇవి సాధించినప్పుడే, మన విశాలాంధ్ర రాష్ట్రమునకు సంపూర్ణత కలుగుతుందని అంటున్నాను. అందుకుగాను మనమందరము సర్వవిధాలా ప్రయత్నించాలి.

రెండవది మనము యీ సంవత్సరపు బడ్జటును గురించి చర్చించుచున్నాము రాబోయే ఏప్రెల్ నెలనుంచి మనము ద్వితీయ పంచవర్ష ప్రణాళికను ప్రారంభించపోతున్నాము. ఈ ప్రణాళికయొక్క ఆశయాలలోనివి, ముఖ్యంగా గ్రామాలను అభివృద్ధిచేయాలని ఒకటి వున్నది. అవి అభివృద్ధి చెయడమే కాకుండా, వాటియొక్క రాబడిని గూడా పెంచుకోవాలని కూడా ఉన్నది. అయితే యీ బడ్జటు తయారుచేసేటప్పుడు మాత్రము ప్రభుత్వము గమనించని ప్రధాన విషయాలు రెండు ఉన్నవి అని అంటున్నాను. ఇప్పుడు మన బడ్జటు ప్రకారము వచ్చే రాబడి, అయ్యేటటువంటి ఖర్చు ఎంతో, రాబడికి తగినట్లుగా ఖర్చు అవుతున్నదా లేదా అనే విచక్షణ లేకుండా తయారు చేశారు. ఈ విషయము ఆలోచించినట్లు కన్పించదు. ప్రస్తుతము మన రాష్ట్రాన్ని రెండు భాగాలుగా విభజించాలి. అందులో మొదటిది బాగా develop అయిన ప్రాంతాలుగాను రెండవది develop కాని ప్రాంతాలుగాను యీ విధముగా రెండు భాగాలు చేయాలి. అంటే haves and have nots అనేవిగా విభజించి ఎక్కువగా develop కాని ప్రాంతాలలో యీ అభివృద్ధి ప్రణాళికలను ముందుగా అమలు జరపాలని అంటున్నాను. అటువంటి ప్రాతాలకే ముందు first priority and preference యివ్వాలని మనవి చేస్తున్నాను. అన్ని చోట్ల గూడా సరి సమానంగా develop అయ్యేటట్లుగా ప్రభుత్వము చూడాలని సూచన చేస్తున్నాను. ఈ బడ్జటు చర్చలలో సభ్యులు చేసిన సూచనలను ప్రభుత్వము ఆలోచించి, వాటిని ఎంతవరకు ఆచరణ సాధ్యమో చూచి, అవి ఆచరణలోకి తెస్తారని ఆశిస్తున్నాను. ప్రభుత్వము సభ్యులు చేసిన సూచనలను ఏవైతే ఆమోదించుతారో తెలియజేస్తే, సభ్యులు చాలా సంతోషిస్తారు. ప్రభుత్వాన్ని అభినందిస్తారు కూడా. ఆ విధముగా చేసినప్పుడే, సభ్యులలో యింకా చాలమంది చర్చలలో పాల్గొనటానికి అవ

కాశాలు కలుగుతాయని అంటున్నాను, గత బడ్జటు సందర్భములో నేను అనేక సూచనలు చేశాను. ప్రస్తుతములో మన రాష్ట్రమునకు కావలసిన అభివృద్ధి కార్యక్రమాలు ఏమిటో మనకు తెలుస్తున్నప్పటికినీ, వెనుకబడిన ప్రాంతాలను ముందుగ యీ ప్రభుత్వము అభివృద్ధి చేయలేదు, అనే అసంతృప్తి మాత్రము సభ్యులలోనూ, ప్రజలలోనూ మెండుగా వున్నదని నమ్మాలి. నిన్ననే మన ఆర్థిక మంత్రిగారు మాట్లాడుతూ రాష్ట్రములో ప్రతి గ్రామానికి రోడ్లు వేయమని, ఎక్కడబడితే అక్కడ స్కూలు పెట్టమని అడిగే రోజులు పోయినవని అన్నారు. అటువంటి రోజులు పోలేదు. యింకా వున్నాయనే నేను చెప్పాను. అభివృద్ధి కాని ప్రాంతాలు మన రాష్ట్రములో కొంత వరకు చాలా వున్నవి. అయితే అభివృద్ధి అయిన ప్రాంతాల అభివృద్ధి తగ్గించి, కాని ప్రాంతాలు గూడా అభివృద్ధి అయేదాకా ఆపాలని మనవిచేస్తున్నాను. దానికి నిదర్శనముగా పాత పట్టణము తాలూకా విషయమును గురించి చెబుతున్నాను. పాత పట్టణము తాలూకా జమీందారీ ఏరియాలో వున్నది. అక్కడ నేటివరకు ఒక Hospital గాని, Post office గాని ఏదీ గూడా లేదు. ఇటువంటి కనీస సౌకర్యాలు లేకుండా ఆ తాలూకా అభివృద్ధి కావాలంటే ఏ విధముగా అవుతుంది ? ఇంతవరకు యీ కనీస సౌకర్యాలయినా అక్కడ ఏర్పాటు చేయలేదు. వాటిని గురించి నేను యిదివరకు ఎన్నోసార్లు చెబుతూనే వున్నాను.

Minor Irrigation చెరువులు కనీసం రెండువేల చెరువులు అక్కడున్నవి. ఆ రెండువేల చెరువులూ repair చెయ్యండని రెండు సంవత్సరాలనుంచి చెబుతూయున్నాను. ఇంతవరకూ ప్రభుత్వం శ్రద్ధ తీసుకోకపోవడంవల్ల చాలా యిబ్బంది పడుతున్నారు రైతులు. కొన్ని లక్షలు ఖర్చుపెట్టి ఆ చెరువులు repair చేస్తే రెండు లక్షలమంది ప్రజలు ఆనందించే పరిస్థితి ఏర్పడుతుంది. Budget తయారు చేసేటప్పుడు రాష్ట్రంలో వెనుకబడిన భాగాలేవో నిర్ణయించి ఆ అభివృద్ధిలేకుండా ఉండే భాగాలను అభివృద్ధిచేయడానికి మనంఎందుకు తలపెట్టకూడదు? ఆప్రాంతాలమీద ధనం హెచ్చుగా ఖర్చుపెట్టిన తరువాత రెండు, మూడు ఏండ్లలో ఆ ప్రాంతాలన్నీ కూడా మిగిలిన ప్రాంతాలతో సమాన స్థాయికి రాగలుగుతాయి. అభివృద్ధిచెందిన ప్రాంతాలలో Tar road లు, Cement road లు వేసే కార్యకలాపాలను కొంచం తగ్గించుకుందాం. ఇప్పుడు Tar roadలు Cement road లు లేకపోతే ప్రమాదం లేదు. కాని ఏమాత్రం రోడ్లు లేకుండా అనేక బాధలు పడుతూవున్న రైతాంగానికి సామాన్యమైన రోడ్లయినా వేసేవరకూ, కొంత కాలమైనా ఈ లక్షలు, కోట్లు ఖర్చుపెడుతున్న యీ Tar roadలను, Cement రోడ్లనూ తగ్గించినంత మాత్రములో దేశానికి ఏమీ నష్టములేదని నేను భావిస్తూయున్నాను. అదేవిధంగా ఈ budget లో మనకు మూడుకోట్ల రూపాయల పైచిలుకు deficit వచ్చింది.

అంతమాత్రంచేత విచారించవలసిన అవసరంలేదు. మన ప్రాంతం అభివృద్ధి ఐన తరువాత మన రాబడికూడా పెరుగుతుంది. అందుచేత ఈ పరిస్థితులలో 5, 6 కోట్ల రూపాయిలు లోటు వచ్చినా ఏమీ ప్రమాదంలేదు. ఇప్పుడు Bihar లో 29 కోట్ల రూపాయిల deficit budget present చేశారు. ఎందుకంటే దేశం అభివృద్ధిచెందుతూయున్న ఈ రోజులలో, దేశాన్ని ప్రణాళికలద్వారా ముందుకు తీసుకుపోతూయున్న ఈ రోజులలో deficit లేకుండా surplus budget సామాన్యంగారాదు. ఇటువంటి deficit budget వల్ల వచ్చేనష్టమేమీ అంతగాలేదు. ఈ budget ని గురించి మరొక విషయం మాత్రం మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఖర్చు విషయం మనం జాగ్రత్తగా చూచుకోవాలి. ఖర్చు కొంతవరకూ తగ్గించుకోవలసిన అవసరం ఉంది. దాని విషయమై ఒకటి మనవిచేస్తున్నాను. మొన్నమొన్ననే భూమిపై surcharge వేశాం. surcharge వసూలుచేయడానికి additional staff అనవసరమని నా ఉద్దేశ్యం. ఇప్పుడున్న Revenue staff తోనే మనం అది వసూలుచేయవచ్చును. Revenue department ఇప్పుడు బ్రహ్మాండముగా పెరిగి పోతోంది. Revenue department లో ఏరోజు కారోజు క్రొత్త క్రొత్తగా ఉద్యోగాలు సృష్టించుకుంటున్నారు. ఈ విషయంలో ప్రభుత్వం సరియైన చర్య తీసుకోవాలని మనవి చేస్తున్నాను. ఏ Deputy Tahsildar ఉద్యోగాలైనకొన్ని తగ్గితే పది petition లు తీసుకువచ్చి Loans Tahsildars అని క్రొత్త post లు సృష్టిస్తారు. అతికష్టంమీద పన్నులు వసూలు చేస్తూ ఉన్న ఈ రోజులలో హెచ్చుగా అనేకమైన ఉద్యోగాలు సృష్టించుకోవలసిన అవసరంలేదు. నేను మనం మదరాసు Assemblyలో ఉన్న కాలంనుంచీకూడా ప్రభుత్వానికి ప్రజలకూ ఒక సన్నిహితమైన సంబంధం ఏర్పాటుకావాలని చెబుతూవచ్చాను. ఈ నాడు దేశంలో ఒక విమర్శ జరుగుతోంది. ఆ విమర్శంతా నిజంకాదు, కాని నిజంకాదని చెప్పడానికి మనం ఒక ఏర్పాటు చేసుకోవాలి. District Public Relations Officer అని జిల్లాకు ఒక Officer ను వెయ్యాలి. ప్రజలు తమ కష్టసుఖాలను ఆ Public Relations Officer కు తెలియజేస్తే, వారు ఆ యా department లకు ఆ విషయాలు తెలియజేసి జవాబులు తెప్పించి ప్రజలకు తెలియజేసినప్పుడు లేక వారిచ్చిన petition లపైన ఒక నెలకో రెండు నెలలకో జవాబువస్తే ప్రజలు చాలా సంతోషిస్తారు. దీనికి ఏవిధమైన అభ్యంతరం ఉండకూడదు. దానికయ్యే ఖర్చు విషయంలో నేను ఒక సూచన చేస్తున్నాను. ఒక్కొక్క petition కు Stamp duty పావలా, లేక బేడ పెట్టండి. మీకు దానికి అయ్యే ఖర్చు వస్తుంది. ఆ ఉద్యోగాలు మాత్రం ఏ కలెక్టర్ల చేతులలోనో, మరెవరి చేతులలోనో పెట్టవద్దని నేను మనవి చేస్తున్నాను. ఏవరైనా ఒక మంత్రి కింద direct గా ఈ officer లు staff ఉండాలి. ఒక petition పెట్టిన వెంటనే ఆ Petition యొక్క ఉద్దేశ్యాలు, దానికి సంబంధించిన

department లు తెలుసుకోవాలి. జిల్లాలో అనేకమంది జిల్లా ఆఫీసర్లు ఉంటారు. కలెక్టరు వారందరనూ నెలకొకసారి సమావేశ పరచి ఏమి చేయాలో చెప్పాలి. ఈ విధంగానే తాలూకా level లో తహశీల్దారు కూడా చేయవచ్చును. అక్కడ విషయాలన్నీ చర్చిస్తే పనులు త్వరగా జరుగుటకు సావకాశం ఉంటుంది. ఇంక Minor irrigation విషయంలో Budget లో తక్కువ మొత్తం మాత్రమే కేటాయించ బడింది. ఇప్పుడు పెద్ద పెద్ద project లు కడుతూ ఉన్నాం, నందికొండ ప్రాజెక్టు, ఇంకో ప్రాజెక్టు కోసమో కోట్లకొలది ధనాన్ని ఖర్చుపెడుతున్నాం, వాటి ఫలితం ఏ 20 సంవత్సరాలకో కాని కనిపించదు. అవి దేశానికి చాలా ఉపయోగకరమైనవే, వాటి వల్లమనం సామాన్యమైన చెరువులను మరామత్తు విషయమై అశ్రద్ధచేయకూడదు. విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలు జమీందారి area లు. అక్కడ 30, 40 సంవత్సరాలనుంచి అభివృద్ధి చేయకుండా ఉండిపోయిన చెరువులున్నాయి, వాటి repair ల విషయమై ప్రత్యేకంగా మొత్తాలను కేటాయించి ఆ గ్రామస్తులకే ఆ పని చూపించి, ఈ పని మీరు వెంటనే చేసుకోండి అంటే ఏ 4, 5 వందల తోటే లేక ఒక వెయ్యిరూపాయల ఖర్చుతో ఆ చెరువు అభివృద్ధి ఔతుంది. అక్కడున్న ప్రజానీకమంతా ఆనందిస్తారు. వ్యవసాయానికి అనుకూలంగా ఉంటుంది. అటువంటి విషయాలలో ప్రభుత్వం ప్రత్యేకమైనశ్రద్ధ వహించి ఈ చెరువులన్నీ repair చెయాలి. తరువాత మా పాతపట్నం తాలూకాలో గొట్టిపల్లి రిజర్వాయరు investigation పూర్తి ఐంది. రెండో పంచవర్ష ప్రణాళికలోకూడా వేశారు. ఆ తాలూకాలో ఏ పనికూడా జరగలేదు. ఆ విషయం ప్రభుత్వం గమనించి ఆ scheme విషయంలో శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను. వీట్లన్నింటికే 3, 4 కోట్ల రూపాయలు దేశంలో అధికంగా మనం సంపాదించుకోవాలి. మనం ఎల్లప్పుడూ deficit తోనే ఉండాలని నా ఉద్దేశ్యం కాదు. మనకు డబ్బు రావడానికి కావలసినన్ని అవకాశాలున్నవి. ఆ విషయమై ఒక కమిటీవేసి విచారిస్తే మనకు సంవత్సరానికి 4, 5 కోట్ల రూపాయిలు వస్తాయనే విశ్వాసం నాకున్నది. ఇప్పుడు పట్టాభి రామారావుగారి కమిటీవేశారు. ఆ కమిటీ వేగంగా ఆలోచించి సరియైన నిర్ణయాలు చేసినప్పుడే మనకు ఆదాయం అధికం రాగలదనే విశ్వాసం నాకున్నది. నాతో కొందరు వర్తకులు చెప్పారు. ప్రభుత్వం సరియైన విధంగాచేస్తే చాలాడబ్బు వస్తుందని. మా జిల్లాలో 20 లక్షల రూపాయలు వ్యాపారం జరుగుతోంది. కాని Sales tax రెండు లక్షలు వసూలవుతున్నది. ఈ Bus transport విషయములో ప్రభుత్వానికి ఒక సూచన ఇవ్వదలచుకున్నాను. Bus transport nationalise చేయ్యడానికి ప్రభుత్వానికి ఇప్పుడు డబ్బు లేకపోవచ్చును. అందుచేత జిల్లా ఒక unit గా తీసుకుని ప్రభుత్వం 51% shares కొని, Bus owners కు 49% shares ఇచ్చి వీరు వారు కలసి ఒక కంపెనీపెట్టి ప్రభుత్వ యాజమాన్యం క్రింద Bus proprietor అనుభవంతో bus లు నడిపితే చాలా డబ్బు వస్తుంది

ఇప్పుడున్న బస్సులే తీసుకుని ఆ owners కి ఇవ్వవలసిన డబ్బు పది సంవత్సరాల Bonds రూపములో ఇస్తామని చెప్పవచ్చు. Mines ఉన్నవి. మా జిల్లాలో Manganese దొరుకుతుంది. ఇంకా కొన్నిచోట్ల iron mines ఉన్నవి. వాటివల్ల వచ్చేరాబడి వ్యక్తులు ఎందుకు పొందాలి? అవి త్రవ్వి ఇతర దేశాలకు పంపడం జరుగుతోంది కాని ఇక్కడేమి పరిశ్రమలుపెట్టి finished goods manufacture చెయ్యడం లేదు. దానివల్ల లక్షలు కోట్ల రూపాయలు ఆదాయం వస్తుంది. వాళ్ళు లాభాలు పొందుతున్నారు. అటువంటివి ప్రభుత్వం ఎందుకు స్వాధీనం చేసుకోకూడదు? రైతులమీద sur charge వేశాం. రైతులమీద పన్ను వేయకూడదని నేననను. పన్నులు వేయవచ్చునుగాని అవి సక్రమంగా వసూలుచేసే విధానం మనం చూసుకోవాలి రైతుల ఆస్తి జప్తుచేసి వసూలుచేసారే, ఈ Sales tax విషయములో ప్రభుత్వం ఎందుకు శ్రద్ధ తీసుకోకూడదు. Minor irrigation works అభివృద్ధి చెయ్యాలి. వెనుకబడిన ప్రాంతాలకు road లు వెయ్యాలి. రెండో పంచవర్ష ప్రణాళిక విషయమై నేను ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. Local Development works Second Five Year Plan లో డిల్లీ ప్రభుత్వం అంగీకరించకపోయినా మన ప్రభుత్వం ధైర్యంవహించి అవకాశం కల్పించినందులకు గోపాలరెడ్డి గారిని నేను అభినందిస్తున్నాను. ఈ విషయములో N. E. S. లోగాని, Community Block లలోగాని జరిగేపనికన్న ఎక్కువ పని సక్రమంగా జరుగుతోంది.

"ఈనాడు National Extension Schemes లోగాని, Community Block లోగాని ఎక్కువగా పనులు జరగలేదు. Local Development Works లోనే ఎక్కువ సక్రమముగా పనులు జరుగుచున్నవి అని ధైర్యముగా చెప్పగలను. ప్రజల సహకారంతో ఏ 1/4 లేక 1/2 డబ్బు ఇచ్చి సరిఅయిన పనులు చేస్తున్నారు. పాతపట్నం తాలూకాలో లక్ష డెబ్బయివేలు మేము ఖర్చుచేసి L.D. Works చేసుకున్నాము. సరైన buildings, roads కూడా వేయించకల్గినాము. National Extension schemes దేశం అంతటకు cover అగుతుంది. ఈ అయిదు సంవత్సరములు ఒక్కొక్క భాగం వెనుక ఉండిపోకుండా ఈ మొత్తాన్ని L.D. Works క్రింద ఎక్కువ ఖర్చు పెట్టాలి. ప్రజలలో ఈనాడు నూతన ఉత్సాహము వచ్చింది. నాదేశము నారాజ్యము బాగుచేసుకోవలెను అనేవారిని నిరుత్సాహపరచకుండా కావలసిన మొత్తాన్ని ఇవ్వాలి యీనాడు మళ్ళీ కొంత మొత్తాన్ని అధికంగా ఇచ్చినా ఫరవా లేదు. సప్లిమెంటరీ బడ్జట్టు వచ్చినప్పుడు ఈ house అమోదిస్తుంది అని నాకువిశ్వాసం వుంది. ఈ L.D. Works క్రింద ఎక్కువ మొత్తాలను ఖర్చు పెట్టి ప్రజలలోవున్న ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని ఉపయోగించుకొని దేశాన్ని అనతికాలంలో అభివృద్ధి చేసుకునేదానికి అవకాశం వుంది.

"ఇది ఆంధ్రరాష్ట్రానికి ఆఖరు బడ్జట్టు కావచ్చును. విశాలాంధ్ర రానున్న సమయము, మనము హైదరాబాదుకు పోతున్నాము. వెళ్ళకముందే వెనుక బడిన ప్రాంతాలగురించి ప్రభుత్వం శ్రద్ధవహించవలెను.

"దేశములో Beggar problem చాలా ప్రమాదముగా ఉన్నవిషయము ప్రభుత్వం గమనించాలి".

MR. SPEAKER :— "టైము అయిపోయింది."

Sri L. LAXMANA DAS:-- "జిల్లాలలో తాలూకాలలో పనులు కల్పించవచ్చును. ఈనాడు ప్రాజెక్టులవద్దకు శరీరబలం వున్నవారిని తీసుకొని వెళ్లి వారిచేత పని చేయించవచ్చును. లేనివారికి కోమెలలరాబడితో భోజనం పెట్టించవచ్చును. ఈనాడు Beggars వల్ల దేశములో అంటు రోగాలు అభివృద్ధి అగుచున్నవి. వాటిని అరికట్టవలెను అని కోరుచున్నాను. నా కీ అవకాశం ఇచ్చినందులకు అధ్యక్షులవారిని అభినందిస్తున్నాను"

At this stage temporary Chairman
SRI P. Narasimhappa Rao occupied the chair

SRI P. SRIRAMULU :— "అధ్యక్షా, సోదర సభ్యులో విశ్వేశ్వర రావుగారు చెప్పినట్లుగా ప్రస్తుతము తయారు చేయబడిన బడ్జటు ఏ విధముగా చూచినా ఒక అడుగుకూడా ముందుకు పోలేదు. వారు చెప్పిన విషయాలతో గాని, ప్రతిపక్ష నాయకులు చెప్పినట్లుగా వారు పత్రికలో ఇచ్చిన ప్రకారము మనము రొట్టె అడిగితే ప్రభుత్వం రాయి ఇచ్చిందని చెప్పడములో నేను ఏకీభవించడం లేకపోయినప్పటికి తాత్కాలిక అధ్యక్షు లయినవారు చెప్పినట్లు ఒక విషయములో నేను ఏకీభవిస్తున్నాను. యీ బడ్జట్టు తయారు చేసిన విధానములు పూర్వం వున్నట్టు గారడీ విధానమే. ఇప్పటికీ అదేరకముగా continue కావడము చాలా శోచనియమైన విషయము. ఇది కేవలము తెలిసి తెలియనట్లు అంకెల విధానముతో కూడుకొని వుండడము కాకుండా direct గా, నేరుగా సభ్యులకు ఏ ఏ జిల్లాలలో ఏ ఏ పనులు చేస్తున్నారో వివరముగా, పద్దులవారీగా తెలుపలేదు. Indirectగా గంప తిరుగుడుగా కాకుండా తెలిసే విధానంలో బడ్జెటు తయారుచేస్తే కొంత విపులంగా తెలియజేస్తే కొంత ఉపయోగకరముగా వుంటుందేమో అని నా చిన్న సూచన. తరువాత ముఖ్యముగా ఆర్థికమంత్రి, ముఖ్యమంత్రిగారు చేసిన ప్రసంగములో హర్షించతగిన విషయం ఒకటి వున్నది. మన ప్రస్తుత జాతీయ ఆశయము సోషలిస్టు సమాజ నిర్మాణమునకు మనము కంకణం కట్టుకున్నాము. దానికి చిహ్నముగా వున్నవారికి లేనివారికి తేడా లేకుండా చెయ్యడం మన ఆశయము అని చెప్పేరు. అది చాలా హర్షింపతగ్గ విషయము. దానికి సూచనగా ఎన్నాళ్లగానో రాష్ట్ర ప్రభుత్వాలలోను, కేంద్ర ప్రభుత్వములోను జరుగుతున్న

అలజడి సూచకంగాగాని, ఫలితంగాగానీయండి భూసంస్కరణలను ముందుగా తీసుకురావాలననే అందోళన వున్నది. కాని ఈ సంస్కరణ అనేది ఒక్క భూమిపైననేగాక దేశములో వున్నట్టి అన్ని వర్గాలకు చెందిన సంపదను సంస్కరించవలసిన అవసరము వున్నది. ఒక వర్గానికి ఒకేవిధమైన దెబ్బ కొట్టి తక్కిన వర్గాలను వివిధమైన భోగలాలసులుగా విహరం చెయ్యడానికి అనువుగా ఉండే సంపదలు అన్నీ కరుడుకట్టి వుండవలసినదేనా అని నేను ప్రశ్నించుచున్నాను. భూసంస్కరణలు చెయ్యవలసినదే. ఒక ఆసామీ దగ్గర ఆయన కుటుంబ పోషణ అవసరానికి మించిన భూమి ఎంత వున్నాకూడా దానిని తగ్గించి నిజముగా లేనట్టివారికి, నిరుపేదలుగా వున్నట్టివారికి పంచి సంస్కరించడము చాలా అవసరమైన విషయము. అది కాదని చెప్పడం సాహసం. ఏసభ్యుడు, ఏ వ్యక్తికూడా చెయ్యడు. అయితే దానితోపాటు వివిధ రంగాలలో వ్యాపారంచేస్తూపట్టణాలలో భవనాలమీదలకొలదివేలఅద్దెలు, అనేక విధమైన పెద్ద మొత్తాలు సంపాదించేటువంటి ఇతర వర్గాలకు, వారికి తేడాలు చూపించకుండా చెయ్యాలి. రైతుల మాదిరిగా వివిధ సంపదలు వున్నవారి విషయములో బస్తీలలో వ్యాపారంలోను, ఇతర అద్దెల విషయము లోను బ్యాంకులలో వడ్డీ వ్యాపారంచేసే విషయములోను అన్నివిధములైన వర్గాలవారి సంపదను సంస్కరించి ఉన్నవారికి, లేనివారికి తేడా లేకుండా తగ్గించే విధానము, ఆ రూపేణా అమలు పెట్టడానికి ప్రయత్నము చెయ్యవల సినదని ప్రభుత్వానికి మీద్వారా నేను మనవి చేస్తున్నాను.

"ఆర్థికమంత్రిగారు చేసిన ప్రసంగములో ధాన్యాల ధరల స్థిరీకరణకొంత వరకు జరిగిందని చెప్పారు. అది కేవలము ధాన్యం విషయం మాత్రమే ఒక విధముగాఒకనిరయము ఒకరేటు అనినిర్ణయంచేసినారు. అంతకంటెమిన్నగా వున్నరైతుల స్థితిగతులు కొంత బాగుపడినట్లు వారుచెప్పేరు. నిజమే. ధాన్యం విషయంలో ఇక్కడ అసెంబ్లీలో కానీయండి, ప్రజలుచేసిన ఆందోళన ఫలి తముగా ఒక విధమైన నిర్ణయం చేసినమాట వాస్తవమే. అందుచేత ధాన్యా నికి సంబంధించినంతవరకు అంత పెద్దగా ప్రభుత్వం మీద grievance వున్నదని చెప్పడానికి వీలులేదు. దానితోపాటు వాణిజ్య పంటల విషయం కూడా ఆలోచించాలి. ఈ సంవత్సరం పసుపు ధర సగానికి సగం పడిపోయింది. పంటే తగ్గిపోయింది. వాణిజ్య పంటలు ఇదివరకుకన్న ఇప్పుడు మిన్నగా వున్నవి అని చెప్పడంలో సత్యం లేదు. చాలా దెబ్బ తిన్న వని, ధాన్యంతోపాటు వాణిజ్య పంటలు చెరకు, పసుపు ధరల నిర్ణయం చెయ్యవలెను. ఈ ప్రభుత్వానికి హక్కు లేకపోతే వెంటనే దీని విషయంలో కూడా కేంద్ర ప్రభుత్వానికి సిఫారసు చెయ్యవలసిన అవసరం వున్నది.

"రెండవ విషయం. రెండవ ప్లాను తయారు చేసినపుడు గ్రామస్థాయిలో తయారగునని పల్లెలవారికి అనేకఆశలు కల్పించినాము. అదిఏమిటంటే మీరు ఏపని అయినాసరే అభివృద్ధి కార్యక్రమాలు అమలుపరచుకొనే విషయములో

మీరు కనుక అర్థం ఖర్చుయిస్తే ప్రభుత్వం తప్పకుండా సహాయం చేస్తుందని ఒకవిధమైన హామీలు ఇచ్చినాము. ప్రభుత్వంకూడా అటువంటి statmentలు చేసినది. మన దురదృష్టవశాత్తు పంచవర్ష ప్రణాళిక తయారు చేసినపుడు 300 కోట్లు అన్నది 225 కోట్లుగామారి ఫైనలుగా చూసినప్పటికి 116 కోట్లు మాత్రము మనకు కేంద్ర ప్రభుత్వం ఇచ్చిందని ప్రభుత్వం ఈనాడు చెబుతున్నారు. గాని ఈ 116 కోట్లతో గ్రామాలకు కావలసినట్టి కోరికలు తీరక పోవచ్చునుకాని ఆశించినదానిలో 50% అయినా ఫలించేటట్లు చెయ్యవలసిన బాధ్యత ప్రభుత్వంమీద వున్నది. అందుకుగాను ఈ సంవత్సరం నా మిత్రులు లక్ష్మణదాసుగారు చెప్పినట్లు ఈ L.D. Works విషయంలో 1956-57 లో continue అగుతవో లేదో తెలియదు. ప్రణాళికల మంత్రి ఖచ్చితముగా continue అగుతవని వాగ్దానం చెయ్యకపోవడం సంభవించింది. కేంద్ర ప్రభుత్వం ఉత్తర్వులు పంపకపోతే రాష్ట్రప్రభుత్వం తప్పకుండా శ్రద్ధవహించి వచ్చే సంవత్సరం కూడా L.D Works కు grants ఇవ్వవలెను. ఈ ప్రణాళికలుఅమలు జరుపడములో కేంద్రప్రభుత్వానికి వ్రాసి ఉత్తర్వులు తెప్పించ వలసిన ఆవశ్యకత ఉన్నదని మనవి చేస్తున్నాను.

"ఇక ఈ రహదారుల విషయంలో ఆంధ్రరాష్ట్రంలో డెల్టా ప్రాంతాలలో ఉన్నటువంటి యిబ్బందులు, అవస్థలు ప్రభుత్వంలో యీనాడున్నటువంటి ముఖ్యమంత్రిగారికిగాని, P. W. D. మంత్రిగారికిగాని, ఇతర మంత్రులకు గానీ తెలియనటువంటి విషయాలు కావు. పూర్వం యెప్పుడో డెల్టా ప్రాంతాలుగా ఏర్పడి నీటి సౌకర్యాలు యివ్వబడినవి అనే కారణంతో ముందు బడ్డ ప్రాంతాలుగా దురదృష్టవశాత్తు కొన్ని జిల్లాలు పేర్కొనబడుతున్నాయి. ఆ పేరుతో యీనాడు రహదారుల విషయంలోను, వంతెనల నిర్మాణ విషయంలోను ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత ఒక విధమైనటువంటి చిన్నచూపు చూపబడుతుందని నేను చెప్పడానికి సాహసిస్తున్నందుకు ప్రభుత్వం మన్నించవలెనని కోరుతున్నాను. ప్రత్యేకంగా మా ప్రాంతాలలో గుంటూరుజిల్లాలోనే తీసుకొంటే అనేక డెల్టా ప్రాంతాలలో తిరిగినప్పుడు గంటలో చేయవలసినటువంటి ప్రయాణం 4,5 గంటలవరకూ సాగడం వెళ్ళేటటువంటి vehicles విరిగిపోయేటటువంటి పరిస్థితులు ఉన్నవి. ఈనాడు ప్రధాన మైనటువంటి గ్రామాలను కలిపేటటువంటి రహదారులను ఉచ్ఛదశలోకి తీసుకొచ్చి up-grade చెయ్యటానికి వీల్లేని పరిస్థితులలో ప్రభుత్వం ఉంచడం చాలా శోచనీయంగా ఉన్నది. మా నియోజకవర్గాల్లో మేము యేగ్రామం పోయినప్పటికి "మాకు ఈ రోడ్డు ఇంత అధ్వాన్నంగా ఉంటే మీరు ఏంచర్య తీసుకొంటున్నారని" ప్రజలు మొట్టమొదట ప్రశ్న వేస్తున్నప్పుడు మేం యేంచెయ్యటానికి వీలులేక నిస్సహాయులమై ఉన్నటువంటి విషయం ప్రభుత్వందృష్టికి తీసుకొనిరావలసిన అవసరం ఉంది".

[5th March 1956

THE HON. DR. B. GOPALA REDDI :— "జిల్లా బోర్డులకు డబ్బులేదు. వారు చెయ్యకుండా ఉన్నారని గౌరవసభ్యులే చెప్తున్నారు".

SRI P. SREERAMULU :— "ముఖ్యమంత్రిగారు సెలవుయిచ్చినట్లుగా జిల్లాబోర్డులకు డబ్బులేదని ప్రభుత్వమునకు మేము చెప్పతున్న మాట వాస్తవం. జిల్లాబోర్డుకు డబ్బు లేదన్నంతమాత్రాన ప్రజలుగానీ, గ్రామాల్లో నివసించేటటువంటివారుగాని యేమాత్రం తృప్తిపడరు. "రైతాంగంమీద కేవలం వ్యవసాయమే కృషిగా పెట్టుకున్నటువంటి ఈ వర్గాలమీద ప్రభుత్వ ఆర్థిక స్తోమతుకు కావలసినటువంటి అవసరమైన పన్నులు వగైరాలు వేస్తున్నారు. కాని రహదారుల విషయంలో అసౌకర్యాలు తొలగించలేదు. అలాంటి పరిస్థితుల్లో మామీద యీ వసూళ్లు చెయ్యటం అక్రమమని" ప్రజలుచేసే ఘోషలుకూడా మేము వినవలసివస్తున్నది. మా ద్వారా వారియొక్క ఘోషలు వినవలసినటువంటి భాధ్యత ప్రభుత్వానికి కూడా ఉన్నదని చెప్పి నేను సవినయంగా మనవిచేస్తున్నాను. రెండవ విషయం విద్యావిషయం. ఈ విద్యావిషయంలో ప్రాథమిక పాఠశాలలు, ప్రాథమిక విద్యావిషయములో ప్రభుత్వం చేసినటువంటి సంస్కరణలకి నేను అభినందిస్తున్నాను. అయితే దీనితోపాటు ఒక విధమైనటువంటి నూతన సంస్కరణ ఈ సంవత్సరంలో పెట్టారు. అదేమిటంటే ఒకటి, రెండు, మూడవ ఫారంవరకు మాత్రం 1956-57 సంవత్సరంలో III Form లో ప్రైవేటు చదువులో తరిఫీదు అయిన విద్యార్థిని నేరుగా admit చేసుకోవడానికి వీలులేదని ప్రభుత్వం ఉత్తర్వులిచ్చింది. ఈ ఉత్తరువులు ఎప్పుడు యిచ్చింది? admissions అన్నీ పూర్తిఅయిన తరువాత సంవత్సర మధ్యలో ఈ ప్రభుత్వం ఉత్తర్వులు యిచ్చింది. ఈ సంవత్సరానికి తల్లిదండ్రాదులు ఎంతో ఖర్చుపెట్టి ప్రత్యేకంగా యిబ్బందిపడి III Form లో admit చేయించుకొందామని తర్ఫీదు చేయించుకొన్న విద్యార్థులకు ఈ 1956-57 సంవత్సరంలో ఈ సదుపాయాన్ని తప్పకుండా యివ్వవలసిన అవసరం వుంది. ప్రభుత్వం యీ విషయంలో తాము పట్టినట్టి కుందేలుకు మూడే కాళ్ళని చెప్పి వాదించకుండా యీ అవసరాన్ని గుర్తించి, న్యాయస్థానాలకు తల్లితండ్రులను వెళ్ళేటటువంటి అవుసరం తీసుకురాకుండా, ఉదారమైనటువంటి చూపుతో ప్రత్యేకంగా యీ సంవత్సరానికి మాత్రం అటువంటి అవకాశం యివ్వవలెనని చెప్పి నేను సవినయంగా మనవి చేస్తున్నాను. తరువాత విద్యావిషయంలో మూడవ ఫారం వరకుకూడా హిందీని నిర్బంధంగా చదవాలని వారు సూచించడం చాలా హర్షించదగిన విషయం. దీనితోపాటు నేను యింకొక సూచనకూడా చేస్తున్నాను. ఈ సకలార్థ ఉన్నత పాఠశాలలన్ని సంవత్సరానికి ఏ ఒక పాఠశాలలో ప్రవేశపెట్టుతున్నారు. అది ఎంతమాత్రం చాలదని ఇప్పుడు ఉన్నటువంటి ఆర్థిక స్తోమతుకు లోబడి సకలార్థ ఉన్నత పాఠశాలలి

సంవత్సరానికి కనీసం యింకా ఒకటి, రెండు జిల్లాలలో వృద్ధి చేయ వలసినటువంటి అవసరం ఉంది అనీ అది విచారించవలసిన విషయం అని నేను ప్రభుత్వానికి, మనవి చేస్తున్నాను. నేను చేసినటువంటి యీ చిన్న సూచనలను ప్రభుత్వం తప్పకుండా సోదర భావంతో పరిశీలించగదలని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తూ ఉన్నాను"

SRI N. C. SESHADRI :— "అధ్యక్షా ! ఈ సంవత్సరం ముఖ్య మంత్రిగారు మనముందర పెట్టినట్టి Budget చూస్తే అంత ఉత్సాహ జనకంగా లేకపోయినప్పటికి నిరుత్సాహంగామాత్రం లేదని చెప్పవచ్చు. ఎందుకంటే మనం ఋదివరలో పోయిన సంవత్సరంనుంచి యిప్పటివరకూ వేసుకొన్న పన్నులద్వారా సుమారు రెండుకోట్ల 16 లక్షల రూపాయలు మనకు ఆదాయం వచ్చినప్పటికీ మనకు పోయిన సంవత్సరంకంటె యీ Budget లోటు ఏ కొద్ది మాత్రమో మనము పూడ్చుకోగలిగినాము. అంతే కాకుండా 1957-58 సంవత్సరంనాటికి Budget ప్రతిపాదించే కాలంనాటికి మనం యెక్కువగా యీ లోటు పూడ్చుకోవటానికిగూడా అవకాశం ఉండదేమో అని నేను భావిస్తున్నాను. అయితే పోయిన సంవత్సరం Budget కి యీ సంవత్సరం Budget కీ ఒక్క విషయంలోమాత్రం కొంత మెరుగు కనిపిస్తుంది. పోయిన సంవత్సరం మొదలు పెట్టినప్పటి నుంచికూడా మనం అన్ని పన్నుల Budget లు మొదలుపెట్టినాము. అయితే యీతూరి అటువంటి పన్నులేమి లేకుండా ఉండడం ఒకవిధంగా రైతులకి కొంత హర్షదాయకంగా ఉంటుంది. అంటె ఇంకముందేమీ పన్నులు వేసే సూచనలులేవు కాబట్టి ముఖ్యమంత్రిగార్ని నేను అభినందిస్తున్నాను. తర్వాత వారు తమ speech లో రెండు ముఖ్యమైన విషయములను గురించి పేర్కొన్నారు. ఈ సంవత్సరంలో రెండు ముఖ్యమైన సంఘటనలు జరిగినాయనిన్నీ మొదటిదేదో రెండవ పంచవర్ష ప్రణాళిక యీ సంవత్సరం మొదలు పెట్టుతున్నామని తర్వాత యీ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం చేసినటువంటి సిఫార్సులను అమలుపరచడం యివి రెండు చాలా ముఖ్య మైన విషయాలని వారు చెప్పతూ వచ్చినారు. అయితే మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు యీ రెండు విషయాల్లోకూడా మనకు చాలా అన్యాయం జరిగిందని చెప్పక తప్పదు. ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక తయారు చేసేటప్పటికి గ్రామ స్థాయినుంచి, గ్రామంలో కావలసినటువంటి సౌకర్యాలంతాకూడా మీరు సగం యిచ్చినట్లయితే మేము సగంయిచ్చి గ్రామ సీమలను అభివృద్ధి చేస్తామని వారికి ఆశ చూపించి పెద్ద భారీఎత్తున అన్ని ప్రయత్నాలూ చేసినారు. సుమారు 5 వందల కోట్ల రూపాయలకు మన felt needs తయారు అయినాయి. కానీ అది ఆఖరుకు కేంద్ర ప్రభుత్వం నుంచి మనకు వచ్చేటప్పటికి ఏ 116 కోట్లకు మాత్రం నిలిచి పోయింది. దీనివల్ల గ్రామ సీమల్లో చాలా నిరుత్సాహం యేర్పడింది. తరువాత పునర్ వ్యవస్థీకరణకు సంబంధించినంతవరకు ముఖ్యమంత్రి

గారు మన ఇతర రాష్ట్రాలలో తెలుగు మాట్లాడేవారిని గురించి కొద్దిగా ప్రస్తావన చేసినారు. అయితే ఆ ప్రస్తావనలో బళ్ళారిలో వుండేటటువంటి 3 లక్షల ఆంధ్రులనుగురించి ఏమాత్రంగూడా వారు చెప్పకుండా పోవటం చాలా సోచనీయమైన విషయం అని నేను భావిస్తున్నాను. ఇతర రాష్ట్రాలలో దాదాపు 25 30 లక్షలదాకా ఉన్నప్పటికీ, ఆ ప్రదేశాలన్నీ మన రాష్ట్రంలో చేర్చేట్టుగా మన అసెంబ్లీలో తీర్మానం చేసినప్పటికీ తీరా రేపు S. R. C. బిల్లు మనకు వచ్చేసరికి ఇతర రాష్ట్రాల్లో వుండేటటువంటి ఆంధ్రప్రాంతాలు మనరాష్ట్రంలోచేరుతాయా, లేదా? అనే ఒక గొప్పసందేహం ఏర్పడుతుంది. మనం విశాలాంధ్ర, విశాలాంధ్ర అనేటటువంటి issue ను బట్టుకొని ఒక విశాలాంధ్రకోసమే మనం కృషిచేస్తు, ఇతర రాష్ట్రాల్లో వుండేటటువంటి 25 లక్షల ఆంధ్రులయొక్క కోరికలను మనం తృణీకరిస్తున్నట్లు నేను భావిస్తున్నాను. కాబట్టి ఈ విషయంలో ప్రభుత్వం తగినంత శ్రద్ధ తీసుకోలేదు అని చెప్పటానికికూడా సాహసిస్తున్నాను. అవతల చిన్న చిన్న Elementary Schools చిన్న చిన్న రోడ్లు ఇవి అన్నీ అడిగే కాలాలు పోయినాయని వారి speech లో చెప్పినారు. వాళ్లు అడిగే కాలాలు పోయినాయో లేదోగానీ."

THE HON. DR. B. GOPALA REDDI:— "దాంతో తృప్తి పడటంకాదు. ఇంకా పెద్దవి అడుగుతున్నారు అని చెప్పినానే గానీ అడిగేకాలం పోయిందనికాదు."

SRI N. C. SESHADRI:— "School కట్టించమనో, Hospital కట్టించమనో, రోడ్లు వేయించమనో అడిగేరోజులు పోయాయన్నారు. అడిగే రోజులు పోనీ పోకపోనీ ప్రభుత్వం డబ్బు యిచ్చేరోజుమాత్రం పోయిందని నేను భావిస్తున్నాను. మన గ్రామాలలో పాఠశాలలు, ఆసుపత్రులు ఏర్పాటు చేయవలసివుంది. గ్రామాలకు విద్యుచ్ఛక్తి ఎక్కువగా సరఫరా చేయాలి. తరువాత ఇందులో మొదటిసారిగా క్రమ పద్ధతిని పన్ను వసూలు చేయడాన్ని మనం ప్రవేశపెట్టినాము. దీనివల్ల సోషలిస్టు సమాజ వ్యవస్థాపనకు మనం మొదటి మెట్టుగా దీన్ని తీసుకొన్నామని చెప్పినారు. అయితే ఇది మొదటి మెట్టుగామాత్రం ఉండజాలదని నేను భావిస్తున్నాను. ఎందుకంటే మనం త్వరలోనే భూసంస్కరణలు అమలు జరుపబోతున్నాము. భూసంస్కరణలు వచ్చినట్లయితే ఈ Graded surcharge అనేటటువంటి దానికి అర్థంలేకుండా పోతుంది. ఎప్పుడైతే holdings తక్కువ అయి పోతాయో అప్పుడు ఈ Graded surcharge అనే విషయమే ఉండదు. అందరుకూడా యేదో కొద్ది పరిమితిగల భూస్వాములుగా వుండిపోతారు. దీనిని మనం ప్రవేశపెట్టినాము కాబట్టి Socialist సమాజ వ్యవస్థాపనకు ఇది మొదటి సోపానమని మనం గర్వించదగిన విషయంకూడా కాదేమో అని నేను భావిస్తున్నాను.

"వ్యాపార పంటలను గురించి సూచన ప్రాయంగా tax వచ్చేటట్లు ప్రస్తావించారు, ఒకవైపు నీటిపారుదల సౌకర్యాలు కలిగించి Betterment tax Water cess వేస్తే వ్యాపార పంటలు పండించుకొనే వారినైనా వదులు తారు అంటే వారిపైకూడా పన్ను వేసేట్లుతోస్తున్నది. అది అన్యాయం. దీనికి శాసన సభలో రైతుల తరపున ఉండేవారెవరు ఒప్పుకోజాలరని నేను భావిస్తున్నాను. ఈ విషయములో ముఖ్యమంత్రిగారు వ్యాపారపంటలపై పన్ను విధానంలో దీర్ఘంగా యోచించి ముందుకు పోవాలని వారిని కోరుతున్నాను. మన State లో resourcesలేవు.పన్నులు ఏవిధంగాపెంచుకోవాలనిచెబుతున్నారు. నా మిత్రుడు లక్ష్మణదాసుగారు కొన్ని సూచనలు చేసినారు. వాటితోనేను ఏకీభవిస్తున్నాను. Bus routes విషయములో పెట్రోలు, డీసెలు రేట్లు increase చేసే సందర్భములో కొన్ని ముఖ్యమైన సూచనలు చేశారు. వాటిని nationalise చేస్తే కావలసినంత ఆదాయం వస్తుంది. దానివల్ల మన అభివృద్ధి కార్యక్రమాలు సక్రమంగా జరుపమని బడ్జెటు లోటు పూడ్చు కొనడానికి అవకాశాలు ఉంటాయని నేను భావిస్తున్నాను. Lorry permits విషయంలో చాలామంది permits కు applicationsపెట్టుకున్న ఒకొక్క route కు ఒక్క lorry కి మాత్రమే permit ఇవ్వడంవల్ల competition తక్కువఅయి దానివల్ల అధిక ఆదాయం పొందుతారు. Competition లేకుండా permits అడిగినట్లు యిస్తె మనకు lorry permits ద్వారాకొంత వరుమానం వచ్చే సూచన ఉన్నది. అని నేను భావిస్తున్నాను. మరొక విషయం ఏమిటంటే నెల్లూరుజిల్లా, మైసూరుస్టేటు లోనుంచి కంతుల ఎద్దుల వాళ్ళు వచ్చి ఎద్దుల వ్యాపారం చేసి పోతుంటారు. వారు విపరీతమైన లాభాలు సంపాదిస్తుంటారు. సుమారు రూ 600 లు వెల కలిగిన ఎద్దులను రూ 1200 లు కు అమ్ముతున్నారు. వారిమీద ఎందుకు tax వేయరని ప్రభుత్వంవారిని ప్రశ్నిస్తున్నాను. Money lenders చట్టాన్ని గురించి ఇది వరలో 1, 2 సూచనలు చేశారు. కాని వడ్డీ వ్యాపారస్తులు registration చేసుకొని tax కట్టాలా లేదా అనేది యిదమిద్ధమైన నిర్ణయానికిరాలేదు ఆ విషయములోకూడా ప్రభుత్వం సత్వరమైన చర్యలను తీసుకొని money-lenders మీద ఒక tax వేయడానికి పూనుకోవాలని నేను భావిస్తున్నాను. Sales tax leakage విషయములో ప్రభుత్వంవారు ఒక కమిటీ ఏర్పాటు చేశారు. వారి రిపోర్టు వస్తుంది. దానిపై leakage అరికట్టడానికి కొంత వరకు సాధ్యం అవుతుంది. ఈ leakage అరికట్టడానికిముందు Single point taxation మన రాష్ట్రంలో పెట్టకుంటే దానితో revenue జాస్తిగా రావడానికి అవకాశం వున్నది. ముఖ్యంగా Sales tax evasion ఎందుకు జరుగుతున్నదంటే 1000, 2000, 3000 turn over వుండేవాళ్లు నాలు గైదుమంది పేర్లు చూపించి, పదివేల పైగా turn over చూపించేవారికి comute చేయడంవల్ల Sales tax evasion చేస్తున్నారు దానికి ముఖ్యమైనమార్గం Single point taxation ఒకటే Mysore State లోఉన్న

controlled markets పెట్టినట్లయితే వ్యాపార సంస్థలోని సరుకుఅంతా market స్థలంలోనే అమ్మాలి. ఇతరచోట్ల అమ్మకూడదని అమలుచేస్తే ఈ Sales tax విధానం బాగుపడుతుందని నేను భావిస్తున్నాను. రహదారుల విషయానికివస్తే figures చాలాపెద్దగా కనిపిస్తున్నవికాని లెక్కతీసుకుంటే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలలో అయిదు సంవత్సరాలు కలిసినా ఒక్క తాలూకాకు లెక్కవేస్తే Local Boards చేతుల్లో వుండే రోడ్లు 15 మైళ్లు approach రోడ్లు ఒక మైలు ఉన్నాయి. అంటే సంవత్సరానికి తాలూకాకు 2 ఫర్లాంగులు approach road ఉంటుంది అన్నమాట. దానినిబట్టి figures పెద్దవిగావున్నా actual benefit ఏమి ఉండదని నేను భావిస్తున్నాను. రహదారులకు కేటాయించే డబ్బు చాలాతక్కువ. ఈవిషయములో ఎక్కువడబ్బు కేంద్రమునుంచి సంపాదించుకొనడానికి ప్రయత్నం చేస్తారని భావిస్తున్నాను. Elementary education విషయములో కొన్నిసూచనలు Budget Speech లో ఉన్నాయి. ఇందుకు ముఖ్యమంత్రిగారిని అభినందిస్తున్నాను. Period of training ఒక సంవత్సరమైనందున రెండు లాభాలున్నాయి. ఆర్థికంగా కొంతడబ్బు మిగలడమేకాకుండా courses త్వరగా complete కావడం జరుగుతుంది. రెండు సంవత్సరాల course అసంగతంగా వున్నది. ఒకసంవత్సరములో విద్యా విధానంచెప్పే అవకాశం ఉన్నది కాబట్టి యీ విషయంలో వారిని అభినందిస్తూ సెలవు తీసుకుంటున్నాను."

* SRI B. G. M. A. NARASINGA RAO:—అధ్యక్షా! ముఖ్యమంత్రిగారిని యీ Budget ప్రవేశపెట్టినందుకు అభినందిస్తున్నాను. యీ బడ్జెట్ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోని మొదటి సంవత్సరం తాలూకు బడ్జెట్. దానిని విడిగా చూపేదానికన్న ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఒక భాగంగాచూస్తే ద్వితీయ పంచవర్షప్రణాళిక లక్ష్యాలకు యీ బడ్జెట్ ఎంతవరకు తోడ్పడుతుందో అందులోని విషయాలు ద్వితీయ పంచవర్షప్రణాళికలో చేయ తగ్గ పనులకు అనుగుణంగా ఉన్నవా అనేది చూడతగ్గవిషయం. Deficit Budget present చేశాము అన్నారు. చాలా విచారకరమైన విషయం. యీ బడ్జెట్ అసంతృప్తికరంగా ఉన్నదని అనలేముకాని పన్నులు హెచ్చుగా వేయవలసిన అవసరం ఉన్నదని ప్రతివారికి తెలియజేస్తున్న విషయం మనం గుర్తించుకోవాలి. పన్నులు వేయవలసిన అవసరం వున్నదనికూడా మనం గుర్తుంచవలసిన సమయం ఆసన్నమైనది. మన ముఖ్యమంత్రిగారు యీ బడ్జెట్‌తయారుచేసిన విధానంలో పూర్తిగా స్పష్టంగాలేకపోవడం విచారకరం. పన్నులు కావలసిందే; పన్నులువద్దు అనేవారుఅభివృద్ధి విరోధకులు; పన్నులు ఎవరిపైవేయాలన్నదే ప్రభుత్వం చూడవలసిన విషయం. వద్దుఅనడం క్షేమం జనంకాదు. Taxation must be on those people who could bear it.

SRI B. G. M. A. NARASINGA RAO]

"పన్నులు బరువు మోతమోసేవారిమీద వేయాలని పన్నులువేసే విధానములో స్పష్టీకరించి ఉన్నారు. భరించేవారిమీద వేయవలసిన అవసరం ఎంతఅయిన వున్నదని మనవి చేస్తున్నాను. పన్నులభారం ఎక్కువ రైతాంగం మీదపడుతుంది. యీ పన్నులవల్ల ప్రభుత్వం యెక్కువ సౌకర్యాలు పొందని మనుష్యులే ఎక్కువ చెల్లించవలసి వస్తున్నదని అనుమానంగా ఉన్నది. పట్టణాల్లో నివసించే ప్రజలకు ఎక్కువ ఆదాయం ఖర్చుపెట్టడం జరుగుతుంది. గ్రామములో ప్రజలనుంచి ఎక్కువ పన్నులు వసూలుకావడం గ్రామంలో ప్రజలకు సౌకర్యాలు అందకపోవడం జరుగుతుంది, మీరు budget తయారు చేసే విధానములో మార్పురావాలని మనవిచేస్తున్నాను.

"ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో భారీఎత్తున పరిశ్రమలను స్థాపించి నిరుద్యోగ సమస్యను నివారించడమే ప్రధానముగా నిర్వచించారు. అంతే కాకుండా జాతీయ జీవనప్రమాణాన్ని ద్విగుణీకృతం చేస్తామని, కార్మికులకు ఎక్కువ ఉద్యోగవసతులు కల్పిస్తామని కూడా చెప్పారు. అవన్ని దృష్టిలో పెట్టుకొని యీ బడ్జటు ఎంత ఉత్సాహకరంగా ఉంటుందిఅని అనుకొన్నాము. కాని ఇటువంటి వేమీ యీ ద్వితీయ ప్రణాళిక మొదటిసంవత్సరం బడ్జటులో కన్పించ లేదు అందుకు నేను విచారిస్తున్నాను.

"ముఖ్య మంత్రిగారు దీంట్లోచాలా అభివృద్ధి కరమైన విషయము చెప్పి వున్నారు కాని labour విషయం ఏమీ దీంట్లో పేర్కొనబడలేదు. అందుకు నేను విచారిస్తున్నాను.

"ద్వితీయ ప్రణాళిక కాలంలో ప్రజలను ఉత్తేజపరచి వారిచే వారుచేయదగు పనులు చేయించవలసిన అవసరము ఎంతైనా ఉన్నది. అందుచేత ఉత్తేజకరమైన కార్యక్రమాలను ప్రజలముందుకు తీసుకరావాలని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

"ప్రజలమీద అన్నిరకములైన క్రొత్త పన్నులు విధిస్తున్నారు. ప్రజలకు సౌకర్యాలు కల్పిస్తామని, పనులు కల్పిస్తామని చెప్పి ప్రభుత్వం పన్నులు వేయడానికి తయారైతే ప్రజలు తప్పకుండా ప్రభుత్వాన్ని సమర్థిస్తారు. అందువల్ల ప్రజలకు పనులు కల్పించే నిమిత్తం ఎటువంటి పన్నులు అయినాసరే వేయడానికి వెనుదీయవద్దని నేను ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. పన్నులు వద్దనే నినాదం అభివృద్ధి నిరోధకులు చేయవలసిన నివాదమేకాని, కార్యదర్శులు, పనులు కావలసినవాళ్లు, దేశహితాభిలాషులుచేయదగ్గపనికాదని నా నమ్మకము.

"జాతీయఆదాయము ద్విగుణీకృతము చేసేందుకు పనులు చేస్తున్నారు. అట్లా చేసేందుకు ఎక్కువగా మైనరు ఇరిగేషను స్కీములు దోహదకారి కాగలవు. గ్రామీణ పరిశ్రమలుకూడా నెలకొల్పవలసిన అవసరము ఉన్నది. ఎప్పుడూ పట్టణాలను అభివృద్ధి పరచేందుకు పరిశ్రమలను కేంద్రీకరించడం

అలవాటయిపోయింది. ఆ కేంద్రీకరణ తగ్గించి decentralisation పద్ధతితో గ్రామీణ అవసరాలను తీర్చేందుకు ఆ పరిసర ప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పడం ఎంతో అవసరం అవుతుంది. అందువల్ల దీనిని ప్రభుత్వదృష్టికి తీసుకురావలసిన అవసరము ఎంతైనా ఉన్నది. గ్రామంలో నిరుద్యోగం బాగా ప్రబలిపోయి, పనిపాట్లు దొరకక పోవడము, తిండి దొరకకపోవడంవల్ల గ్రామ ప్రజలు పట్టణాలకు వలసలు పోతున్నారు. దీనిని అరికట్టవలసిన అవసరం ఎంతైనా వున్నది. అందుచేత గ్రామ ప్రజలు సుఖజీవనం చేసేందుకు గ్రామాల్లో వారి అవసరమును తీర్చేందుకు వారికి ఉద్యోగవృత్తి కల్గించేందుకు ప్రభుత్వం పనిచేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

"మన దేశంలో ముఖ్యమైన కలప పరిశ్రమలు నెలకొల్పవలసిన అవసరము చాలా ఉన్నది. ఇప్పుడు మనం విదేశాలనుండి చాలా సరకులు దిగుమతి చేసుకుంటున్నాము. జాతీయ అవసరములకు, జాతీయ ఉత్పత్తి చాలడములేదు. మన దేశంలో చాలారకములైన ముడివస్తువులు లభ్యమవుతాయి. మన దేశం సబ్బుల ఉత్పత్తి, పేపర్ల ఉత్పత్తి, వస్త్రముల ఉత్పత్తి ఇంకా ఎన్నో మనము చేయగలిగినవి ఉన్నాయి. ఉప్పు పరిశ్రమ మనకు విశేషంగా ఉన్నది. దీనినుంచి కాస్టిక్‌సోడా, సోడాయాష్, క్లోరిన్, డి. డి. టి. గమాక్సిన్ మొదలైన రసాయనిక పరిశ్రమలుకూడా నెలకొల్పడానికి అవకాశాలు ఉన్నాయి. కానివీటివిషయంలో ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకోక పోవడం చాలా విచారకరమైన విషయము. పారిశ్రామికంగా మనము చాలా వెనుకబడి ఉన్నాము. మనలో నిరుద్యోగ సమస్య బాగా ప్రబలిపోయింది. దీనిని పరిష్కారము చేయలేకుండా ఉన్నాము. అందుచేత ప్రభుత్వంవారు వెంటనే మనం వ్యవసాయరంగంలో ఎంత కృషి అయితే చేశారో, అంత కృషిని, పారిశ్రామికరంగంలో చేస్తేగాని, ప్రజల అవసరాలను తీర్చలేమని మనకు భయంగా ఉన్నది.

"మనకు విద్యావంతులైన నిరుద్యోగులు చాలా హెచ్చుగా ఉన్నారు. హైస్కూళ్లనుంచి, కాలేజీలనుంచి, బి. ఎ. లు, బి. యస్ సి. లు తయారై వస్తున్నారు. పోలీ టెక్నిక్ ల నుంచి టెక్నీషియన్లు, ఇంజనీర్లు తయారై వస్తున్నారు. వారు కాలేజీలనుంచి బయటకు వచ్చినతరువాత ఎక్కడా ఉద్యోగములు దొరకక చాలా నిరుత్సాహవంతులై బాధపడుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో మనం పూర్తిగా ఇట్లు సుశిక్షితులైన వారిని ఉపయోగించుకోవలసిన అవసరం ఎంతైనా వున్నది. ప్రభుత్వం ఉద్యోగావకాశాలను ఎక్కువ చేయవలసిన అవసరం ఎక్కువగా ఉన్నది. ఏ విధమైన సౌకర్యాలులేని ప్రదేశాలు చాలా ఉన్నాయి. వీటన్నింటిలోను చిన్నచిన్న మైనరు ఇరిగేషను ప్రాజెక్టులు ఏర్పరచి వారికి పనులు చూపించి సహాయపడవలసిన అవసరం ఎంతైనా వున్నది. వారికి వేరొకఉపాధి లేనందువల్ల చిన్నచిన్న చెరువుల మరమ్మతు, వాగుల మరమ్మతు, ఆనకట్టలు కట్టించడం

SRI B. G. M. A. NARASINGA RAO]

ఇటువంటి చిన్న కార్యక్రమాలు చేయాలి. విశాఖపట్టణంలో మధువాడ ఫిర్కాలో వున్న తుమ్మురుగెడ్డ స్కీము చాలాకాలం క్రింద investigation జరిగిందిగాని పని ఇప్పటి వరకు ప్రారంభించలేదు. కణితి ఫిర్కాలో నడు పూరు గ్రామంలో అనంతసాగరం అనే చెరువు చాలాకాలంనుంచి మరమ్మతు కాలేదు. ఇటువంటివన్నిచేస్తే ప్రజలకు కొంతవరకు పని కల్పించిన వారవుతారు. వారికి సౌకర్యాలుకూడా ఏర్పరచిన వారవుతారు.

"N. E. S. బ్లాకులు చాలా కృషి చేస్తున్నాయి. చాలా అభివృద్ధి కరంగా పనిచేస్తున్నాయి. వాటివల్ల ప్రజలుకూడా చాలా వుత్సాహకరంగా వున్నారు. ప్రభుత్వం ఎంతపెట్టుబడి పెట్టుతుందో దానికి సరియైన డబ్బు ప్రజలవల్ల లభ్యముకావడం మనం చూస్తూనేవున్నాము. పనులు చాలా చురుగ్గా సాగుతున్నాయి. యీ బ్లాకులు యివ్వడములో అనేక అవకతవకలు జరిగినాయి. కొన్ని జిల్లాలలో, తాలూకాలో కొన్నికొన్ని ఫిర్కాలే వదలివేయ బడ్డినాయి. కొన్నికొన్ని తాలూకాలలో ఎక్కువగా పెట్టడం జరిగింది. ఈ విధంగా అవన్నికూడా హాచ్‌పాచ్ అవడం చాలాశోచనీయమైన విషయం. ఇటువంటి బ్లాకులువున్న ఏరియా అంతాకూడా compact contiguous గా వుండడం చాలా మంచిదని చెప్పి నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. విశాఖపట్టణము తాలూకాలో వదిలివేయబడ్డ కణితి ఫిర్కానుకూడా, మధుర వాడ బ్లాకులోగాని పరవాడ బ్లాకులోగాని చేర్చి యీ బ్లాకు స్కీము వచ్చే సంవత్సరమునుంచి వేయించవలసిందని కోరుతున్నాం.

"ప్రభుత్వ వ్యవహారాల విషయం చూచినట్లయితే, ఒక వుత్తరం వారికి వ్రాసినట్లయితే జవాబు అతి జాప్యము కావడము, ఏపనికోసము అయితే దానిని వ్రాసినామో, ఆ జవాబు వచ్చేలోపుగా ఆ పని అయిపోవడంకూడా జరుగుతున్నది. ఇది చాలా విచారకరమైన విషయము. యిప్పటికికూడా ఈ top heavy administration, inordinate delay అనేది మనం చూస్తూనే ఉన్నాము. మొదట ప్రభుత్వం దగ్గరనుంచి రివెన్యూబోర్డుకు, రివెన్యూబోర్డు దగ్గరనుంచి కలెక్టర్లకు, కలెక్టర్ల దగ్గరనుంచి, R. D. O. ల దగ్గరకు, అక్కడనుంచి Taluk officer కు, అక్కడనుంచి, రివెన్యూ ఇనస్పెక్టరువద్దకు, ఈ చానలున్నదట. ఒక కాగితము ప్రయాణముచేసి వచ్చేప్పుడు కొన్ని నెలలు, సంవత్సరములుకూడా పట్టడం మనం చూస్తూనే ఉన్నాము. ఇన్ని సంవత్సరములనుంచి ఇటువంటి ఇబ్బందులన్నీ పడుతూ కూడా వీటిని తొలగించటానికి ప్రభుత్వం ఎటువంటి చర్యలు తీసుకోకపోవ డము చాలా శోచనీయము. వీటిమీద చర్యలు తీసుకున్నట్లయితే అధిక ధన లాభమేకాకుండా, ప్రజలకుబాగా సౌకర్యములు కలుగుతాయనిచెప్పి మనవి చేస్తున్నాను.

[SRI B. G. M. A. NARASINGA RAO

"మద్రాసు ప్రభుత్వము తయారుచేసిన బడ్జటును మొన్న మనం అంత రముకూడా చూచియేఉన్నాము. పనివాళ్లకు, N. G. O. లకు వారు కొన్ని సౌకర్యాలు కల్పించారు. మనకు ప్రతి సమస్యమీద ఏదో ప్రతివారూ చెబుతూనే ఉండడము, వినతి పత్రాలు సమర్పించడము, అందోళనలు సాగించడమేగాని, జరిగేపనిమాత్రము మనకు ఏమీకన్పించడములేదు. ఈ N. G. O. ల యొక్క పరిస్థితి చాలా విచారకరమైనది. హృదయ విదారకరమైనది. వారి పరిస్థితిని గమనించేందుకు ప్రభుత్వం ఎంతైనా కృషిచేయవలసి వున్నది. మీరు ఇటువంటి పరిస్థితులలో ఎటువంటి కార్యదీక్షతతో పని చేస్తున్నారో మనం గమనించినట్లయితే వారి విషయంలో ఇంకా ఎక్కువగా శ్రద్ధ తీసుకొని వెంటనే సహాయము చేయవలసిన అవసరము స్పష్టమవుతుంది. కనుక యీ N. G. O's. తాలూకు పరిస్థితిని చక్క పరిచేందుకు ప్రభుత్వము వెంటనే ఒక Pay Commission నియమించి, వారి జీతాలు ఏ విధంగా సవరించగలమో, ఏ విధంగా వారి పరిస్థితిని బాగుపరచగలమో ఆలోచించవలసివున్నది. అథమము Central Pay Commission పద్ధతిలో గాకుండా, ఇప్పుడువున్న పద్ధతిమార్చి, బాగుపరచడానికి సర్వీసు సెక్షనులనుకూడా ఇతోధికంగా అభివృద్ధిపరచడానికి ఏ విధంగా చర్య తీసుకోగలమో విచారించడానికి ప్రభుత్వం వెంటనే ఒక కమిటీని నియమించమని కోరుతున్నాను.

"కార్మికుల విషయంలో మనం ద్వితీయ ప్రణాళిక కాలంనాటికి 25% ఎక్కువ చేస్తామని చెప్పినాము. అంటే సంవత్సరమునకు 5% real income wage increase చేస్తామని చెప్పాము. కాని అటువంటి సూచనలు ఏమీ చేయలేదు. అటువంటివి చేయాలంటే National Wage Boards, Provincial Wage Boards పెట్టవలసిన అవుసరము వున్నది. పెద్ద పరిశ్రమలవల్ల ప్రతి వుద్యోగస్తునికి age increase చేయవలసిన అవసరము ఉన్నది. Wage Council Boards కూడా పెట్టవలసిన అవసరము వున్నది. అందువల్ల వెంటనే ప్రభుత్వం చర్యతీసుకొని National Wage Boards ఏర్పాటుచేసేవారికి సౌకర్యములు కలుగ చేయవలసిన అవసరము వున్నది. Minimum Wages Act ఇంతవరకు agricultural labour కి వర్తింపచేయలేదు. 16 గ్రామములలో మాత్రం అమలు జరిపారు. అదియును వుపయోగకరముగ అమలు జరుపలేదు. అమలు జరుపక పోవడమే కాకుండా అది సాకుగా తీసుకొని మిగతా గ్రామములలో అమలు చేయవలసిన అవసరములేదని ప్రభుత్వం చెప్పడం మరీ శోచనీయమైన విషయము. అందుచేత ఈ Minimum Wages Act ప్రతి గ్రామంలోకూడా ఈ agricultural labour కు వర్తింపజేసి. అమలు జరిపినట్లయితే చాలా బాగుంటుందనిచెప్పి నా తాలూకు విన్నపము. Fair Wages Act 1948 వ సంవత్సరములో యజమానుల, కార్మికుల సమావేశములో ప్రభుత్వంవారు

SRI B. G. M. A. NARASINGA RAO]

వారు కలిసి కూర్చొని చేసుకొన్న ఒప్పందములో కార్మికులకు న్యాయమైన వేతనములు ఇస్తామన్నారు. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో ఏ విధమైన అలజడులు కార్మికుల పక్షానగాని, ప్రభుత్వ పక్షానగాని రాకూడదని శాంతి నెలకొల్పుకునేందుకు ఒక సంధి చేసుకున్నారు. ఆ సంధి సూత్రము ప్రకారంగా కార్మికులకు న్యాయమైన వేతనాలు ఇస్తామని చెప్పే ఉన్నది. అది 1948 వ సంవత్సరములో జరిగితే ఇప్పుడు 1956 వ సంవత్సరము జరుగుతున్నది. ఇప్పటివరకు కూడా ఆ minimum wages అమలు జరుపలేదు. ఆ fair wages ఎక్కడ ఉన్నవోకూడా కన్పించడములేదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అయినా సరే వాటిని అమలు జరుపాలని కోరుతున్నాను.

"Employees State Insurance Scheme క్రింద లాభముపొందిన వారు చాలామంది ఉన్నారు. ఆ లాభము పట్టణాలలోవున్న కార్మికులకు కూడా కలుగలేదు, కలుగ నేరదు. అనేక ఇబ్బందులన్నీ కలుగుతున్నాయి. దీనిని అమలు జరుపమని వారందరూ మొరపెట్టుకున్నారు. అనేక వినతి పత్రాలు సమర్పించారు. దీనిమీద ఘర్షణలుకూడా జరిగాయి. హిందూస్థాన్ షిప్పు కార్మికులు సమ్మెచేసే పరిస్థితులు ఏర్పడినవి. అటువంటి పరిస్థితి నివారించేందుకు ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకొని యీ State Insurance Act ను కార్మికుల కుటుంబాలకుకూడా వర్తింపజేసేందుకు ప్రయత్నిం చేసినట్లయితే యీ సౌకర్యం యావన్మందికి కూడా కలుగుతుంది. కార్మికులు సుఖపడతారు.

"విశాలాంధ్ర వస్తే అక్కడి పరిస్థితులకు అనుకూలంగా వుండేట్లు యీ బడ్జెటు తయారు చేశారు. అక్కడకు వెళ్లిన తరువాత ఇరువురము కలసి ఏకోన్ముఖంగా మనకు కావలసిన పాలసీలను రూపొందించుకొనేందుకు అవకాశం వుంటుంది, యిప్పటికి యీ బడ్జెటు తయారు చేసినట్లు కన్పిస్తున్నది. అన్ని విధములాకూడా, సర్వతోముఖంగా, అన్ని రంగాలలో కొంత అభివృద్ధి తీసుకు రాగలిగినందుకు ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారిని అభినందిస్తూ యింతటితో విరమిస్తున్నాను."

SRI S. VEMAYYA:—"అధ్యక్షా! ఆర్థిక మంత్రిగారు మనకు అందచేసినటువంటి బడ్జట్ ఆశాజనకంగా లేదని భాదపడుతున్నాను. ఇంతేగాక బడ్జెట్‌లో క్రొత్తగా తీసుకొనివచ్చే పథకాలేమీ లేవని నేను తెలియజేస్తున్నాను. గత సంవత్సరాలలో, నాకు తెలిసినటువంటి మేరకు, తయారు చేయబడినటువంటి బడ్జట్‌లకన్న యిది చాలా అసమర్థతతో తయారుచేసినట్లుగా నేను భావిస్తున్నాను. ఒక్క ఉదాహరణ చెప్పాలంటే ఏ బడ్జట్‌లోనూ లేనటువంటి పెద్ద errata ఒకటి యిచ్చారు. అందులో చాల తప్పులు కనిపిస్తున్నాయి. అందుచేత యింకా కొంచెం విపులంగా అందరికి అర్థమయ్యేటట్లుగా, ఈ బడ్జట్ మెమొరాండంకూడా విపులంగా వుండేటట్లు

చేయించగోర్తాను. ఆర్థిక మంత్రిగా అనుభవం వున్నటువంటి శ్రీ గోపాలరెడ్డి గారు మిగతా సభ్యులందరకుకూడ అర్ధమయ్యేటట్లు వివరాలతో అందజేయ లేదని నేను చాల బాధపడుతున్నాను. ఇకముందు వచ్చేబడ్జట్ లలోనైనా యీలోపం తీర్చాలని నేను మనవి చేస్తున్నాను. ఆంధ్రప్రభుత్వం తీసుకు వచ్చిన land reforms ను గురించి నేను ఒకమాట మాత్రం చెప్పవలసి వుంది. Land reforms అని చెపుతూ దానికో కమిటీ కావాలంటారు. ఇప్పటికి అనేకమైన రిపోర్టులున్నాయి. కుమారప్ప కమిటీ, కాంగ్రెస్ అగ్రే రియన్ కమిటీల రిపోర్టులున్నాయి. ఈ కమిటీల సూచనలను అధారంగా తీసుకొని ఒక తీర్మానానికి రాకుండా కమిటీల తరువాత కమిటీలు వేసు కుంటూ వుండడంతప్ప ఒక నిర్ణయానికివచ్చి sincere గా ఒక విధానాన్ని అవలంబించకపోతున్నందుకు నేను విచారిస్తున్నాను. కాని ఈ land reforms ఎన్నాళ్ళలో తీసుకువస్తారని నేను మంత్రిగారిని ప్రశ్నిస్తున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI:— సాధ్యమైనంత త్వరలో యీ land reforms తీసుకు వస్తాము.

SRI S. VEMAYYA:—సాధ్యమైనంత త్వరలో అంటె ఎన్నాళ్ళ లోగా land reforms తీసుకువస్తారు ? చాలా సంవత్సరాలు పట్టవచ్చును. అందుచేత land reforms తీసుకొని వచ్చేటప్పుడు ఆలస్యం అవుతుంది కాబట్టి కనీసం దీనిని తీసుకువచ్చేందుకు ఎంత ఆలస్యాన్ని పురస్కరించు కొని ఒక minimum land holdings నిర్ణయంగాని, transactions గాని జరగకుండా వుండడానికిగాను కట్టుదిట్టంగా ఒక ordinance యెందుకు pass చేయలేదని నేను మంత్రిగారిని అడుగుతున్నాను. మనం composite State లో వున్నప్పుడు Fair Rent Bill అని, కౌలుదారీ రక్షణ చట్టమని చేశాము. Land reforms వచ్చే లోపున మనం ఆంధ్రరాష్ట్రంలో కూడా అటువంటి కౌలుదార్ల రక్షణ విధానం చేయడానికి ఏమి అడ్డం వచ్చింది? ఈ కౌలుదారీ విధానంలోకూడా భూములనుంచి తొలగించడం అనేకచోట్ల చూస్తున్నాము. Intermediaries ను తొలగించి భూమి సాగుచేసేటటువంటి వాళ్ళరక్షణ కల్పించడముకోసం ప్రభుత్వం వెంటనే ఒక ordinance తీసుకు రావాలని నేను కోరుతున్నాను. National income అభివృద్ధికి ముఖ్యంగా land reforms, bank deposit, personal properties యింకా అటు వంటి వాటిల్లోకూడా ceiling తీసుకురావడానికి ప్రభుత్వం ఏమైనా పథకాలు వేశారా అని నేను అడుగుతున్నాను. ఉన్నటువంటి బంగారంపై ఒక సీలింగు పెట్టి 10 సవరనులకంటె ఎక్కువ ఒక family కి వుండకూడదని అన్నట్లయితే మన ఆదాయాన్ని పెంచుకోడానికి వీలవుతుంది, అని నేను మనవిచేస్తు న్నాను. అలాంటి కౌలుదార్లబిల్లు లేక పోయినప్పటికీ, land reforms రావడానికి ఆలస్యమైనప్పటికినీ, భూములను అక్కడ సాగుచేసుకుంటున్న

శివాయిజమాదార్లను భూమినుండి తొలగించకుండా, ఆక్షేపణలేని భూములకు కూడా తాత్కాలికంగానైనా సరే పట్టాలివ్వడానికి ప్రభుత్వం ఏమీచర్యలు తీసుకోలేదు. మీదుమిక్కిలి ప్రాజెక్టు అనే పేరుతో పట్టాలివ్వకూడదని చెప్పి తాత్కాలిక పట్టాకూడ నిలపమనిచెప్పి ఉత్తరువులు జారీ చేయడం అంతసబబుగాలేదని, దానిని వెంటనే సవరించి గవర్నమెంటు భూములను పేదలు సాగుచేసుకొనేందుకు తగు ఉత్తరువులు పంపించాలని నేను కోరుతున్నాను. గవర్నమెంటు భూములుగా వుండినట్టి భూములను వందలాది ఎకరములుగల రైతులు ఆక్రమించివున్నారు. వాళ్ళను వెంటనే తొలగించి పేదలు సాగుచేసుకొనేందుకు అవకాశం కలుగజేయమని కోరుచున్నాను. కాని ప్రభుత్వం దానికోసం ఏమీచర్య తీసుకోలేదు. కనుక వెంటనే చర్య తీసుకోమని నేను మనవి చేస్తున్నాను. వ్యవసాయ విషయం తీసుకొన్నప్పుడు వ్యవసాయ రంగంలో Indian Government వాళ్లు యిచ్చినటువంటి కొన్ని విషయాలు చూచినట్లయితే జాతీయాదాయం కంటెను తక్కువగా వుందని, Southern India లో మరీ తక్కువగా ఉందని మంత్రిగార్కి తెలుసు. దానిని గురించి ఎటువంటి పథకాలుకూడా మన బడ్జట్‌లో లేవు. Under-employment అనే దానిని తీసివేయడానికి కొన్ని పథకాలు తీసుకొనివస్తున్నారు. తరువాత single teacher school అని పెట్టారు. Single teacher school అని చెప్పి దాన్ని అభివృద్ధి చేయాలనే ఉద్దేశ్యంతో తీసికొన్నప్పుడు అక్కడవున్నటువంటి మిగిలినస్కూలు teachers ని తొలగించే ప్రమాదం వుంది. అందువల్ల ఎక్కడైతే ఒక school open చేస్తారో అక్కడ ఒక teacher కి retrenchment effect అయ్యే ప్రమాదం వుంది. కాబట్టి యిదిమాత్రం educational unemployment తొలగించడానికి దోహదం యివ్వదని నేను మనవి చేస్తున్నాను. వ్యవసాయరంగంలో వుండే కూలీలు ముఖ్యంగా హరిజనులు. వారికై కనీస వేతనాలు చట్టం తీసుకవస్తున్నామని చెప్పడం పదేపదే జరుగుతోంది. కనీసవేతనాల బిల్లు యిదిగో వస్తుంది అని చెపుతూ రెండు సంవత్సరాలుగా హామీయివ్వడంగూడా జరిగింది. అది సంతృప్తికరంగా లేదు. ఈ కనీస వేతనాల చట్టంను వెంటనే అమలుపరచాలని నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. అనేకచోట్ల వ్యవసాయకూలీలచేత వెట్టిచాకిరిచేయించుకోవడం యీనాటికికూడా జరుగుతోంది. మా నెల్లూరుజిల్లాలో యిప్పటికీ "నాగు" పద్ధతి అమలుజరుగుతోంది. ఈ "నాగు" పద్ధతిని తొలగించడానికి ప్రభుత్వం ఏమైనా చర్యలు తీసుకుందా అని నేను ప్రశ్నిస్తున్నాను. నాకు అనుభవంవున్న మా నెల్లూరు జిల్లాలో యీ రోజుకుకూడ ఈ "నాగు" పద్ధతిమీద 50% interest వుంటుంది. ఒక్కొక్కచోట 50% 60% యివ్వవలసిన బాధకూడావుంది. దాన్నిగురించి ప్రభుత్వం ఏమీచర్యలు తీసుకోలేదు.ఇంక weights and measuresలో చూచినట్లయితేకూడా అనేక గ్రామాల్లో, అనేకచోట్ల పిచ్చముంతలు,కుంచాలవాడుక పద్ధతి విజృంభించడమే

జరుగుతుంది. ఇది అనేక సంవత్సరాలనుంచి వున్నప్పటికికూడా దాన్ని అరికట్టడానికి ప్రభుత్వం చర్యలు ఏమీ తీసుకోలేదు. దీని విషయంలో ఏమైనా ఉత్తర్వులు పంపించి వెంటనే దర్యాప్తుచేస్తుందా అని నేను ప్రభుత్వాన్ని అడుగుతున్నాను.

గత budget లో కన్నా యీ సంవత్సరం budget లో హరిజన uplift క్రింద allotment తగ్గించాలని మంత్రిగారికి తెలియజేస్తున్నాను. ఉదహరణకు page 644 లో 1954-55 సంవత్సరంలో 64 లక్షలు వున్నట్లయితే యీ సంవత్సరం 51 లక్షలు, అనగా 16 లక్షలు తగ్గించారు. మిగతా వివరాలు యింకా తెలియకపోయినప్పటికిని ఇది అనేకచోట్ల హరిజనులను యిబ్బంది పెడుతున్నారని మంత్రిగారికి తెలియజేస్తున్నాను. ముఖ్యంగా హరిజనులకు కావలసినటువంటి అనేక విషయాలలో ప్రభుత్వం తీసుకొనేటటువంటి విధానం సక్రమంగా వినియోగపడటం లేదు. సక్రమంగా వినియోగపడకపోవడానికి కారణం యేమిటి అన్నట్లయితే ఉద్యోగస్తులలో వున్నదని చెప్పి యీ సంవత్సరం యిచ్చినటువంటి budget allotment లో యెక్కువ భాగం ఉద్యోగస్తుల జీతాల మినహాయింపుల క్రింద పోతున్నదని మనవి చేస్తున్నాను. ఇచ్చినటువంటి allotment లో 50% కూడా హరిజనులకు చెందకుండా పోవడం విచారాన్ని కలిగిస్తున్నది. లోగడ 1947-48 సంవత్సరాలలో శ్రీ ప్రకాశం పంతులుగారు హరిజన uplift fund క్రింద కోటి రూపాయలతో start చేశారు. దానిని అట్లే ఇళ్ల స్థలాలకు rural reconstruction వగైరాలకు fund replace చేస్తూ రావాలనేవిధానంతో start చేశారు. Fund అయిపోయింది. దానిని replace చేయకుండా discontinue చేయడం కూడా జరిగింది. లోగడ ప్రభుత్వం పది లక్షలైనా fund గా పెట్టడం సబబుగా వుంటుందని చెప్పి budget లో 10 లక్షలు హరిజన fund క్రింద కేటాయించారు. గాని యిప్పటి ప్రభుత్వం హరిజన uplift క్రింద ఆ fund ను contribute చేయడం గానీ, దానిని ఒక fund గా పెట్టడమనే విధానాన్నికూడా అవలంభించలేదు. ఇప్పుడు హరిజనుల యిళ్ళ స్థలాల కేటాయింపుకు యీ సంవత్సరం మార్చిలో కొంత staff ను disband చేస్తున్నారని తెలుస్తున్నది. దానిని మరల India Government లో నైనా కొంత సబ్సిడీ తీసుకవచ్చి యీ పని కొనసాగించాలని మనవిచేస్తున్నాను. Rural water supply లో కూడా అనేకచోట్ల నీటి వసతి తృప్తికరంగా లేకుండా ఉండడము సంభవిస్తోంది. దానికిగాను ప్రజలనుండి contribution తీసుకోవాలని అడగడంకూడా అంత బాగా లేదు. అనేక మెట్ట ప్రాంతాలలోను, డెల్టా ప్రాంతాలలోను contributions యిచ్చి బావులు త్రవ్వించుకోడానికి వీలులేదు కాబట్టి యీ rural water supply యింకా యెక్కువ మొత్తం కేటాయించవలసివుంది. దాని మీద యెక్కువ contribution సేకరించకుండానే యీ బావులు త్రవ్విం

విధానాన్ని ప్రభుత్వం అవలంభించాలని కోరుతున్నాను. Land Acqusition Act సవరించమని, ఇళ్ల స్థలాలు త్వరత్వరగా మంజూరు చేయాలని పదేపదే చెప్పినప్పటికి ప్రభుత్వం యింకా ఆలస్యం చేయడం బాగుండలేదు. దానిని త్వరగా తీసుకవచ్చినట్లయితే యిప్పుడు అనేకచోట్ల యిళ్ల స్థలాలు యివ్వడానికి వీలౌతుంది కాబట్టి త్వరగా ఆలోచించి చట్టాన్ని సవరించాలని మనవిచేస్తున్నాను. Non-gazetted ఉద్యోగస్తుల విషయమై యిదివరకు అనేక విషయాలు వివరంగా మనవిచేశాను. దానిలో యిచ్చినటువంటి సూచనలు చూచినట్లయితే Non-gazetted ఉద్యోగులలో కనీసం lower grade వారికైనా జీతాలు హెచ్చుచేసే విషయమై ఆలోచించాలని మనవి చేస్తున్నాను. Madras Government Lower Division Clerks ను Veterinary department లో కొందరకు జీతాలు పెచ్చుచేసినట్లు మనకు కనబడుతోంది. కాని మన ప్రభుత్వమువారు కనీసం Peons cadre లో నైన కొంతమంది ఉద్యోగుల జీతాలు పెంచే విధానాన్ని అవలంభించలేదు. దానికికూడా వెంటనే చర్య తీసుకోవాలని మనవి చేస్తున్నాను. Non gazetted ఉద్యోగులలో ముఖ్యంగా peons, watchers, highways మేస్త్రీలు, కూలీలు మొదలగువాళ్లను టెంపరరిగా వుంచుకున్నారేకాని వాళ్ళ ఉద్యోగము మాత్రం permanent గా వుంచడం లేదు. వాళ్ళ జీతాలు work charged క్రిందగాని contingencies క్రింద గాని యివ్వబడుచున్నవి. Sriharikota లో yanadies వున్నారు. ప్రభుత్వము Labour Act అని చెప్పి కనీస వేతనాల చట్టము తెస్తున్నామని చెప్పతోంది. Forest department క్రింద వుండే కూలీలకు కొన్ని దినాలలో కనీసం రోజు కూలీ ఆరు అణాలకంటే జాస్తి రావడం లేదు. వారికి యిచ్చేటటువంటి కూలి అదనంగా వుండేదానికి ప్రభుత్వం ప్రయత్నించాలని మనవి చేస్తున్నాను. Non-gazetted ఉద్యోగస్తులలో కొంతమందిని Co-operative Inspector లుగా, Health Inspector లుగా వస్తున్నారని State wide గా transfer చేస్తున్నారు. జీతాలు పెంచమన్నప్పుడు జీతాలకు డబ్బు లేదని సాకు చెప్పతున్నారు. కనీసము వారికి వుంటున్నటువంటి యిబ్బందులు తీర్చడానికైనా ప్రభుత్వం యెందుకు ముందుకు రావడంలేదో నాకు అర్థంకావడం లేదు. Accumulation of leave నాలుగు మాసాలు చేశారు. కొంతవరకు సంతోషమే. సెలవును 5, 6 మాసాలు కూడబెట్టుకుంటారని కూడబెట్టుకోనీయకుండా చేయడం సబబు కాదు. సెలవులను వుపయోగించుకొన్నవాళ్లు అదృష్టవంతులు. ఉపయోగించుకోకుండా service చేస్తున్నవారి సెలవు కుళ్ళిపోయిందని చెప్పడం అంత బాగా లేదు. హెచ్చుచేసేదానికోసం ఒక్కసారిగా వుపయోగించుకొనేదాని కోసం కూడబెట్టుకొనేటటువంటి వుద్యోగస్తులు వుంటారు. అప్పుడు ప్రభుత్వానికి యేమి ఇబ్బంది వుండదు. కాబట్టి అటువంటి యిబ్బంది లేనటువంటి పనులుగూడా ప్రభుత్వం ముందుకు వచ్చి చేయనందుకు నేను విచా

రిస్తున్నాను. కనుక Leave Rules liberaliseచేయమని ప్రభుత్వాన్ని కోరుచున్నాను. Dearness allowances కూడా కేంద్రప్రభుత్వంవారు pay తో merge చేశారు. దానిని అనుసరించి ప్రభుత్వంవారు కొద్దిగానైనా ముందుకు వచ్చి Dearness allowance, pay తో merge చేసినట్లయితే ప్రభుత్వవిధానం బాగా జరగడానికి గాని ప్రభుత్వ కార్యకలాపాలు అభివృద్ధి జరగడానికి గానిఆస్కారముంటుంది. ఉద్యోగులు సహకరిస్తారు. ఈపద్ధతినియెందుకు అవలంభించలేకపోతున్నారో నా కర్థం కావడంలేదు. చిన్న వుద్యోగస్థుల విషయం తీసుకొన్నప్పుడు peons మొదలైనటువంటివాళ్ళకు యిచ్చేటటువంటి Daily allowance యెక్కడైనా camp లకు వెళ్ళినపుడు రూ 0-12-0 యిస్తారు. ఎక్కడైనా భోజనం చెయ్యాలంటే రెండు మూర్లకు రెండు ముకాలు రూపాయలు కావాలి. అలాంటప్పుడు ముక్కాలు రూపాయమీదనే వుద్యోగం చెయ్యాలని చెప్పడం సబబుకాదు. Constables కు గాని watchers, peons వగైరాలకుDaily allownce 2 రూపాయలకంటె తక్కువలేకుండా ఉత్తర్వు చెయ్యాలని మనవిచేస్తున్నాను.

ఇక confidential files అనే పేరుతో seniority ని overlook చేసి అనేకమందికి promotions యివ్వడం ఉద్యోగులకు చాల అసంతృప్తి కలుగజేస్తున్నది. కేంద్ర ప్రభుత్వము seniority ని maintain చేస్తూ వాళ్ళకు ఉద్యోగాలు promotions యివ్వడం గమనిస్తున్నాము. కాని మన రాష్ట్ర ప్రభుత్వాలు యెక్కువగా confidential files మీద ఆధారపడి బాగా పనిచేసేవాళ్ళను overlook చేసి favouritism తోటివాళ్ళు promotions పొందడం జరుగుతోంది. ఈ విధానానికి వెంటనే స్వస్తిచెప్పి strict గా seniority ని maintain చేయాలని మనవిచేస్తున్నాను. confidential files ను తీసివేసి open-files పెట్టాలని కోరుచున్నాను. ఇటువంటి విధానం U. K., U S. A లలో వున్నట్లు తెలుస్తున్నది. ఈ పద్ధతిని ప్రభుత్వం యెందుకు అవలంభించకూడదు. Elementary education లో Aided schools ను ప్రభుత్వము Government schools క్రింద తీసుకోవడానికి ప్రయత్నము చేస్తున్నది. ఏ విధానాన్ని అవలంభిస్తారు? ఉపాధ్యాయులకు యెటువంటి scales యిస్తారు? Government scales యిస్తారా? దానియొక్క limit యేమిటి, జిల్లా unit పెడుతారో యేమిటో యిప్పటివరకు తెలియలేదు. Managers కు యే విధముగా compensation యిస్తారు? ఈ పద్ధతిలో retrenchment వున్నదని అనేకమంది వెల్లడి చేస్తున్నారు, పత్రికలు ప్రకటిస్తున్నాయి. దానినిగురించి ప్రభుత్వంయొక్క విధానం యేమిటో దీనిలో తెలియజేయలేదు, 10 సంవత్సరాలు పూర్తి అయితే తప్ప I form లోచేరడానికి వీలులేదని చెప్పి చెపుతున్నారు. ఎవరయినా bright వుండేటటువంటివాళ్లు ముందుకు పోకుండా అడ్డుపెట్టడం బాగా లేదని చెపుతున్నాను. దానిని గురించి నిర్దిష్టమైన order యివ్వాలని నేను అడుగుతున్నాను. Budget లో నూతన పథకాలు ప్రారంభించబోతున్నా

మనే సూచన చేయబడివున్నది కాని నూతన పథకాలు యేమీ కనబడలేదు. అందువల్ల యిది budget అభివృద్ధికి నిరోధకంగా కూడా కనబడుతున్నది. లోగడ training చదివేవాళ్ళకు stipends యివ్వడం చూస్తూవుండేవాళ్ళం. ఇప్పుడు stipends లేకుండా మీరు training చదువుకోవాలని చెప్పడం గాని stipends తీసేశామని చెప్పడంగాని బాగా లేదు. ముఖ్యంగా Scheduled Caste కూడా 50% stipends లోగడ తీసేవారు. ఇప్పుడు యెంత తీసేస్తారో అర్థం కావడంలేదు. ఈ stipends continue చేసే విధానం ముందుకు రావాలని నేను మీద్వారా ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. Elementary schools తీసుకున్నప్పుడు అక్కడ వున్నటువంటి Manager ల యొక్క సాధకబాధకాలు గమనించి వారికి యిబ్బంది లేకుండేటువంటి విధానాన్ని అవలంభించాలని చెబుతున్నాను. సంస్కృతం, హిందీ భాషలను compulsory చేయుడం సబబుగా లేదని మనవి చేస్తున్నాను.

* SRI T. N. VENKATASUBBA REDDI:—Sir, first of all, I think the many complaints that we get from many members that the Budget has not been prepared properly or that it should be in a different way comes from the fact, I think that many of us do not understand the Budget; and my only submission is that if the Government should examine, while conforming to the regulations laid down by the Controller, if any simpler way could be continued by which many of us could understand the Budget, and then I am sure all these complaints of various natures could be eliminated if we could only understand the Budget.

Secondly, Sir, I would like to point out, that the general discussion on the Budget is the one annual opportunity that we get to discuss subjects of all natures, make compliments and suggestions and all sorts of things. I think that it would be useful if at least to give a certain amount of satisfaction to the members, if as many of the members of the executive as possible are here in the House. It does a lot of good even if they come and just hear, whether they may be good suggestions or bad suggestions, but it would give a lot of satisfaction to the House if as far as possible they try to be in the House during the general discussion.

5th March 1956]

[SRI T. N. VENKATASUBBA REDDI

Coming to the Budget itself, I would like to vie with the other members, especially of the opposing political parties in making demands on the Government of all the needs that we put forward on behalf of the people. I am quite as exercised as they are how badly people are in need of various things like schools, roads, hospitals and various other facilities. I think, Sir, that the problem before us is not one of making demands but how we can implement them. When we see before us Budget after Budget which has a deficit in the revenue account, I fail to see how it is possible that we can make these demands on the Government before we can suggest the methods of achieving those demands. So I think, Sir, that our problem is one of trying to find the means, because I am sure that the Government is just as aware as all of us are of the needs of the people. But unfortunately they have got to be implemented and this can only be in relation to the finances that are available to the Government and now we see that there is no immediate prospect before us of meeting the existing demands on the existing finances of the Government. It is a pity that we do not appreciate that the Government has been able to maintain the existing services till now and that this has been possible with the assistance that we have received from the Centre. So I feel that it is out of place that we should, time in and time out, criticise that the Central Government is taking away this revenue from us or that revenue from us, not realising that it is our National Executive and that we are branches of a parent body, trying to administer parts of our National Life. It is a big and elaborate machinery by which we are trying to co-ordinate the various branches of administration for the general welfare of the people. So, if the Central Government takes the Excise Duty or the Customs Duty, we must realise that it is all for us and that it is being administered from there for the benefit of the nation and when we see how much we have been able to spend in spite of these deficits in these last three years, it is ample proof that our present administrative system is the right system for the welfare of the people and these complaints should be viewed with that perspective.

SRI T. N. VENKATASUBBA REDDY]

Now, coming to the problem Sir, I feel that we must somehow or other try to see that we balance our Budget in the revenue account. Now the only possible ways are two. One is to cut down our expenditure and the other to increase our revenues. I think that we ought to try and see how far we can cut down our expenditure and how far we can raise fresh revenues, because member after member has demanded various facilities for the people. I also feel that the people are in urgent need and we have got to meet them as soon as possible unless we take steps to find the means urgently, we may not be able to give any help to the people for a long time to come. On the one hand, in the matter of retrenchment, I think the Government should have a very careful watch, much more than what it is now, on the amounts that are spent in administration. If we go through the annual statistics, we find we are employing more and more personnel every year; if we see the report of the Public Service Commission also we find we are employing many officers every year. I think that we should keep a very close watch on the extra employments that we make. I may recall to you, Sir, what the Chief Minister said some time back, that it has been examined on various occasions whether any retrenchment is possible and it has been found that it is impossible. I agree with the Chief Minister that retrenchment is impossible as long as we do not have a contented service; and this contentment can only come when the services are sure that their labours, their industry, their honesty and their efficiency will be properly rewarded. This can be possible only when we devise a system by which their industry, honesty and hard work are recognised and rewarded. There are complaints from the general public and the services also that this is not properly done now. Unless the Government takes very active steps to try and see that merit is duly rewarded, I am afraid retrenchment in expenditure will be impossible because there will be no incentive for the members of the services to work harder and try to attempt so that a smaller number of people can do the same work for which a larger number of people are at present employed. The same thing also applies in the matter of increasing the salaries of the services. Obviously.

5th March 1956]
SRI T. N. VENKATASUBBA REDDI]

with the present numbers it is impossible to increase their remuneration, as has been said by many members, unless we cut down the numbers employed by the Government. This will be possible when we are able to cut down the numbers and when the smaller numbers can put in greater work. This is one suggestion that I would like to make.

Another suggestion is that under Contingencies and Other Charges, the amount involved seems to be very great. I know the Government is keeping a very careful watch, and even so I feel that it can be cut down to a very great extent if we try to analyse for what purposes the amount under Contingencies and Other Charges is expended; the total amount comes to nearly 2½ to 3 crores of rupees, and possibly more. I do hope that the Government will examine these very carefully and see that it is possible, by adopting all these measures, that we are able to retrench in some foreseeable near future. I feel we can reduce the expenditure to a certain extent. And on the other hand, I need not say that we will have to augment our revenues by some method or other and see that the elementary needs of the people are fulfilled in the foreseeable future.

Then, coming to the question of my own demands, I am careful in making them because they do not involve any new expenditure. I come from an area where the inhabitants are amongst small hillocks and valleys in several taluks of 3 or 4 districts of Rayalaseema and we subsist by the meagre rainfall that we get and irrigation facilities in the form of small ponds. We do not know when these little things were built, but unfortunately many of these dams on the small rivers have been breached and it has been the routine of the Revenue Department to say that they are either uneconomical or to give the lands on patta to others before the people who were affected by these breaches could make a complaint to the Government

[5th March 1956

SRI T. N. VENKATASUBBA REDDI]

and request them to repair these breached tanks. I has been said by many of the members, and I nee hardly repeat, that many villagers have had to mov to other places where such tanks exist. I know th Government have been allotting moneys to variou districts for closing these breaches and all this mone is allowed to lapse year after year back to the Gov ernment because the Revenue Department Officer have shown absolute indifference to the repair o these tanks. I would request that the Governmen should not view the repair of these tanks from th economically profitable aspect, but for providing som means for people living in those areas. From th development point of view in those areas, there i practically nothing that the Government can do ir the form of development, except giving cheap electri power to irrigate the lands. I am grateful to the Gov- ernment that they have done a great deal during th last few years and almost all the taluk headquarter are now supplied with electric energy. My only sub- mission, Sir, is that the Government should try to give priority to the taluks of Rayachoti, Kadiri, Proddatur, Hindupur, Vayalpad, Madanapalle, Rajampet, Cud- dapah and Sidhout which are in the hills and where there are innumerable wells which have just little water but the ryots are put to a great loss for baling out the water from great depths. I request the Gov- ernment to extend electric supply to these areas as soon as possible without reference to the economic aspect, because we know schemes can be prepared either to be remunerative or unremunerative. And I can assure the Government that the indirect benefits that the Government will be bestowing on the people will far outweigh any shortage in the return. With these words, I would like to once again point out that the Government have done the best it could do under the circumstances by trying to maintain the services even in such adverse conditions. I hope all of us will give our co-operation in seeing that we augment the that we are going to make now. Thank you, Sir. resources of the Government to fulfil all the demands

SRI A. YERUKU NAIDU:— అధ్యక్షా! సుమారు నాలుగు కోట్ల లోటుతో ముఖ్య మంత్రిగారు ప్రతిపాదించిన యీ బడ్జటు ఆశాజనక ముగా లేదని చెప్పటానికి సందేహములేదు. గత సంవత్సరముకన్నా యీ సంవత్సరము అదనపు పన్నుల మూలముగా రెండు కోట్ల పదునారు లక్షలు చూపించినప్పటికినీ గత సంవత్సరము లోటే యీ సంవత్సరము కూడా కన్పిస్తున్నది. అయితే లోటు బడ్జటు అనేది రాష్ట్రమునకు అభివృద్ధి దాయ కముగాదని తెలిసినప్పటికినీ పన్నులు యీ విధముగా వేయాలనో, ఖర్చులు యీ విధముగా చేయాలనోచూస్తే అప్పుడు యీ లోటు బడ్జటు ఆశాజనక ముగా కన్పిస్తుంది. అయితే పన్నులు వేసేవిధానములో land revenue surcharges వగైరాలు వేసేటట్లైతే, మనము అనుకుంటున్న socialisx సమాజానికి దారితీస్తుందని ముఖ్య మంత్రిగారు సెలవిచ్చారు. అయితే యీ surcharge వేయడములో uneconomic holdings అంటె చిన్న చిన్న పట్టాదార్లకు అసలు భూమి శిస్తే లేకుండా చేయాలని గత కాంగ్రెసు ప్రభు త్వము నిర్ణయించినప్పటికీ గూడ అటువంటి చిన్న holdings మీద కూడ యీ surcharge వేయడము అనేది సోషలిస్టు సమాజ స్థాపనకు ఏ విధ ముగా దారి తీయగలదో నాకు అర్థము కావడములేదు. తరువాత వ్యవ సాయము అభివృద్ధి పరచటానికిగాను, చెరుకు ఉత్పత్తి అధికముచేయటానికి సుమారు పన్నెండు వేల రూపాయలు కేటాయించారు. మన రాష్ట్రములో తిండి గింజలకు ధరలు తరుగుతున్న సమయములో, ప్రభుత్వము సుమారు ఆయిదారు చెరుకు ఫ్యాక్టరీలను ఏర్పాటుచేసి, డబ్బు వచ్చే వాణిజ్య పంట లకు ప్రభుత్వము సహాయము చేయటానికి వేసిన పథకమునకు అందరము సంతోషించతగ్గ విషయమే. అయితే పాత చెరుకు ఫ్యాక్టరీలు ఉన్నచోట చెరుకు విస్తారముగా పండించుతున్న బొబ్బిలి, సీతానగరము ఏరియాలోవున్న చెరుకు రైతుల కష్టములు చెప్పలేనంతవిగా ఉన్నవి. అక్కడ వారు చెరుకు హెచ్చుగా పండించడమువల్ల వారికన్నా యింకా దగ్గరగా ఉండే చెరుకు పంటదార్లకు ఎక్కువగా అవకాశములు కలిగిస్తున్నారు. మొదటి చెరుకు ఫ్యాక్టరీలు పుట్టినప్పటినుంచి సప్లయి చేస్తున్న రైతులను మినహాయింపు చేస్తూ దరిమిలా వారిని ప్రోత్సహిస్తున్న ఆ ఫ్యాక్టరీ యజమానులయొక్క అక్రమ ప్రయత్నాలను అరికట్టించి, ప్రత్యక్షము ఆ రైతులకు రక్షణ కలుగజేయ వలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత యీ నాలుగు కోట్ల రూపాయల లోటు బడ్జటునుచూస్తే కేంద్ర ప్రభుత్వమువారు నియమించిన దుబారా ఖర్చును అరికట్టే సంఘమును రాష్ట్ర ప్రభుత్వమే గనుక ఏర్పాటు చేసినట్లైతే, బడ్జటులో లోటు యింత ఉండదని నేను గట్టిగా చెప్పగలను. కారణము యేమిటంటే, ప్రభు త్వము యీ development schemes క్రింద కొన్ని పనులు చేయించి యున్నారు. అందులో ప్రజల సహకారము నాల్గవ వంతుఅని చూపిస్తున్నారు. ప్రజల సహకారము నాల్గవ వంతు అనగా, వారు ఆ works take up చేసి

చూపించినట్లైతే నూటికి 25 రూపాయలు మిగిలిన ప్రభుత్వము డబ్బు యివ్వ నక్కరలేకుండానే, వేసిన estimates లోనే నూటికి 25 రూపాయలు మిగులుతుందని తెలిసినవారు ప్రభుత్వము చేస్తున్న works లో నూటికి 25 రూపాయలు తగ్గటానికి అవకాశము ఉంటుందని చెప్పటానికి సందేహించ డము లేదు.

తరువాత స్కూల్సు విషయములో building grants తగ్గించినందుకు చాలా విచారించవలసి వచ్చినది. సాలూరులో హైస్కూలు భవన నిర్మాణ మును గురించి యిప్పటికి మూడు సంవత్సరములుగా estimates క్రింద నుంచి పైకి, పైనుంచి క్రిందికి తిరగడముతో సరిపోతున్నదిగాని, యింత వరకూ గూడ ఆ estimates finalise కాలేదు. దీనికే red-tapism అని చెప్పవలసివస్తున్నది. ఈ red-tapism కు కారణము క్రింద వున్న ఆఫీసరు ఒకసారి తప్పు ఏదైనా చేస్తే, పైవారు అది సవరించి, సరిదిద్ద లేదు. ఆ విధముగా కాకుండా పైవారు కింద వారిని, క్రింద వారు పై వారిని తప్పులు ఎంచుకుంటూ estimates మాత్రము యిక్కడికి, అక్కడికిపంపు కోవడము, ఆలస్యము జరుగడము కనబడుచున్నదిగాని; ఫలితము మాత్రము శూన్యము. ఈ జాప్యమునకు కారణము యేమిటో ప్రభుత్వము విచారించ వలసిందని సలహా యిస్తున్నాను.

తరువాత భూమి శిస్తు విధానములో చూస్తే, యింకా రాష్ట్రములలో unsurveyed గ్రామాలు అనేకమున్నవి. ప్రభుత్వము survey and settlement take up చేసి ఉన్నారు. ఈ work యింకా పూర్తి కాలేదు. కొన్ని చోట్లలో పట్టాలువున్న భూముల విషయములోకూడ encroachment book చేస్తూ, అక్కడ గ్రామాధికార్లు, రెవిన్యూ యిన్స్పెక్టర్లు యింకా ప్రభు త్వోద్యోగస్థులు అక్కడ రైతులను అనేక కష్టాలకు గురిచేస్తున్నారు. ఆ ఉద్యోగస్థులు యీ విధముగా చేయడము ఏ మాత్రమూ సమంజసముగా లేదు. ప్రభుత్వము యీ విషయము విచారించవలసిందిగా కోరుతున్నాను.

తరువాత ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద గ్రామ లెవెల్ దగ్గరనుంచి కూడ సుమారు అయిదుకోట్ల రూపాయలు విలువగల స్కీములు ప్రభుత్వము తయారు చేయించియున్నారు. అయితే యీ సంవత్సరపు బడ్జటులో 116 కోట్ల రూపాయలకు తగ్గే ఉన్నవి. ముఖ్యమంత్రిగారు చెప్పినట్లుగా నాగలి నుంచి tractor వరకూ, స్కూలునుంచి కాలేజీ వరకూ వెళ్లినట్లు, యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు సంబంధించినవి గ్రామ అవసరాలను ప్రభు త్వము మరచిపోకుండా రోడ్లు అయితేనేమి, హాస్పిటళ్లయితేనేమి, ముందు ప్రాధాన్యము యిచ్చి, తరువాత భారీ పరిశ్రమలకు అవకాశము యిస్తూ, గ్రామ అవసరాలను ముందు నెరవేర్చవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ విర మిస్తున్నాను.

SRI G. NARASIMHAMURTHI :— అధ్యక్షా ! ముఖ్య మంత్రిగారు తమబడ్జటు ఉపన్యాసములో గోదావరివరదబాధితులయొక్క కష్టములను గుర్తించినందులకు వారిని అభినందిస్తున్నాను. ముఖ్యంగా గోదావరి లంక రైతులకు కలిగిన తీరని నష్టములను గురించిగాని యింకనూ యీ సంవత్సరము కూడ వారికి కలిగిన నష్టములకు తగిన సదుపాయములు చేయవలసిఉన్నదని నేనుమీద్వారా ముఖ్యమంత్రి గారికి మనవి చేస్తున్నాను. ఎందుకంటే ప్రప్రథమములో వచ్చిన వరదలవల్ల వారికి కలిగిన నష్టము లేకాకుండా; వరదలు పోయిన తరువాత, అధిక వర్షాలవల్ల పండిన పంటలు యావత్తూకూడా యింటికి రాకుండా పోయినవి. ముఖ్యంగా గోదావరి లంక రైతులకు యీ సంవత్సరము రెండవ పంట పూర్తిగా పోయిన కారణముచేత యిక వారికి మిగిలినది ఒక్క పొగాకు పంటమీదనే ఆధారపడియున్నారు. అదికూడ పదును రాకుండా పోయింది. అందువల్ల నూటికి ఏ నాలుగు, మూడు ఎకరాలలోనో పొగాకు పంట వేసుకున్నారు. దీనిమీద ఆదాయము యింకా రెండు నెలలకుగాని రాదు. ఈ లోపలనే ప్రభుత్వానికి శిస్తులు రైతులు కట్టవలసియున్నది. శిస్తులు కట్టడానికి డబ్బు లేనందువల్ల వారు శిస్తులు కట్టలేక పోతున్నారు. గ్రామాధికార్లు, యీ శిస్తుల కొరకు రైతుల యొక్క నాగళ్లు, పశువులు, బండ్లు మొదలైన వ్యవసాయ పరికరాలు అన్నీ జప్తు చేయటానికి ప్రారంభించారు. ఈ విధముగా చేయడమువల్ల రైతులు వ్యవసాయముకూడ చేసుకోటానికి అవకాశములు లేకుండాపోయి దిక్కు మొక్కులేని స్థితిలోనికివచ్చి చాలా బాధపడుతున్నారు. కాబట్టి యీ విషయము ముఖ్య మంత్రిగారు, రెవిన్యూ మంత్రిగారు ఆ రైతుల కష్టాలను విచారించి, వారికి వెంటనే తగు సహాయము చేయవలసిందిగా కోరుతున్నాను. ప్రభుత్వము యీ విషయములో కొంత శ్రద్ధ వహిస్తారని ఆశిస్తున్నాను.

ముఖ్యంగా ఉద్యోగస్థులు పన్నుల వసూలు పద్ధతి పాత ధోరణిలోనే సాగిస్తూ ఈ లంక రైతులను చాలా బాధిస్తూ ఉన్నారు అని చెప్పడానికి నాకేమి సంశయంలేదు. అందువల్ల ఇప్పుడు ఆ విధానాన్ని మార్పుచేసి ఒక అనధికార సభ్యులతో కూడిన ఒక విచారణ సంఘాన్ని ఏర్పాటుచేసి లంక రైతులకు కల్గిన నష్టాన్ని తెలుసుకుని వారికి చేయదలచుకున్న సహాయం ఇవ్వవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ మధ్య ఈ జప్తులను గురించి నేనూ నాసలహ సభ్యుడు శ్రీ అప్పలస్వామిగారు రైతులయొక్క ఈ కష్టనిష్ఠూరాలను గురించి నివేదించాం. శిస్తులు April నెలలోగాని, May నెలలోగాని వసూలు చేసే పద్ధతి ఏర్పాటు చేయవలసిందని కోరాము. వారు ముఖ్య మంత్రిగారితో ఆలోచించి చేస్తామని సెలవిచ్చారు. అంతవరకూ తాత్కాలికంగా పశువులను, వ్యవసాయ పరికరాలను జప్తుచేయవద్దని కలెక్టర్లకు orders పంపిస్తామన్నారు, పంపించారు. లంక రైతుల తరఫున వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఇంక irrigation కు సంబం

ధించినంతవరకూ ధవళేశ్వరం ఆనకట్ట తలుపులు ఎత్తు చేయడం అత్యంత అవసరమని అందువల్ల తూర్పు గోదావరి జిల్లాకే కాకుండా పశ్చిమ గోదావరి జిల్లాలో కొన్ని లక్షల ఎకరాల భూమికి నీటి సదుపాయం లభిస్తుంది. ఇది అత్యంత అవసరం కాబట్టి ఈ ఆనకట్ట తలుపులు ఎత్తుచేయవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాను. గోదావరిపై ఇప్పూరువద్ద dam కట్టడానికి ఏవో ప్రయత్నాలు జరుగుచున్నవి అని అన్నారు. గాని దానికి కొన్ని సంవత్సరాలు పడుతుంది గనుక ఈ లోపున ధవళేశ్వరం ఆనకట్ట తలుపులు ఎత్తుచేయడం అత్యంత అవసరం. గత శాసన సభలో ఆనకట్ట తలుపులు ఎత్తుచేయడం అవసరమే కనుక ఆ విషయంలో తప్పకుండా ప్రభుత్వం తగు చర్య తీసు కుంటుందని ఉప ముఖ్య మంత్రిగారు చెప్పారు. అందుకు వారిని అభినం దిస్తున్నాను. రెండో పంట విషయంలో రైతులను అనేక ఇబ్బందులకు గురి చేస్తున్న రెండో పంట localization scheme ఎప్పుడో 1942 వ సంవత్స రములో pass చేసిన G O. ప్రకారం నీరిచ్చే పద్ధతివల్ల రైతులకు చాలా నష్టం కలుగుతోంది. 1941-42 వ సంవత్సరంలో రైతులయొక్క repre- sentation ఏమీ లేకుండా అప్పుడు ఉద్యోగస్థులు తమంతట తామే చేసిన ఏర్పాటది. అప్పుడు మననాయకులు Quit India పోరాటంలో జైళ్లలోవున్న సంవత్సరములో ఆ G. O. ఉద్యోగస్థులు తయారు చేశారు. అందువల్ల ఆ G. O. రైతులకు ఉపయోగపడునట్లు G. O. సవరించవలసిన అగత్యం ఉన్నది. ఇంక నదీప్రాంతలంకలను గురించి అత్యంత విషాదకరమైనటు వంటి విషయం ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. గోదావరి వరదలువచ్చి నప్పుడు లంకలు నదికోసివెయ్యడంవల్ల లంకలు నదీపాతమై భూమికనిపించ కుండా పోయినా ఆ లంక ఫలానారైతుది అని నిర్ధారణచేయుటకు దానికి 25 లగాయతు 30 రూపాయలవరకూ పన్ను చెల్లించమనడం అంత సమంజసం కాదు. అట్లు నిర్ధారణచేయుటకు వీలుగా ఎకరానికి పావలో, అర్ధ రూపాయో వసూలుచేస్తే చాలును. ఈవిషయం ఇదివఱకు ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో యున్నప్పుడు గోపాలరెడ్డిగారు మంత్రిగా యున్నప్పుడు మనవి చేశాం. ఆ G. O. ను సవరించి అంత హెచ్చు పన్ను వసూలు చేయకుండా ఎకరానికి పావలా లేక అర్థ రూపాయి వసూలుచేస్తే సబబుగా యుంటుంది. అమలా పురం తాలూకాలో, సముద్ర తీరంలో గోదావరి వరద వచ్చినప్పుడు అటు గోదావరి నుంచి, ఇటు సముద్రం పోటువల్ల అధిక వర్షాలవల్ల ఇవన్నీ ఏక కాలంలో జరుగడంచేత దాదాపు 25. 30 వేల ఎకరాల భూమిగల కోస్తా గ్రామాలు మునిగి పోతున్నాయి. అందులో ముఖ్యంగా నందంపూడి island అని చెప్పబడే 11 గ్రామాలు కొబ్బరి తోటలుగ లవి మునిగిపోయి, భూమి నిరుపయోగమైన పట్టు భూమివలె అయిపోయినది. అందువల్ల ఏనుగువల్లి లగాయతు ఎనుబోతుపల్లి వఱకూ ఏటిగట్టుపోసి వరద నివారణ కార్యక్రమం చేపట్టవలసిందని ప్రార్థిస్తున్నాను.

* SRI T. V. RAGHAVALU:— అధ్యక్షా! బడ్జటు అనేది ప్రభుత్వ విధానానికి ఒక ప్రతి బింబం. ఈ budget అర్థం చేసుకోవడం లోగాని లేక అభినందన పూర్వకంగా విమర్శించడంలోగాని శాస్త్రీయ దృష్టి ఉండడం అవసరం. శాస్త్రీయ దృష్టిలేని నాబోటివారు కేవలం పామరుల వలె అర్థం చేసుకోవడం విమర్శించడం ఒక పద్ధతిగా యున్నది. శాస్త్రీయంగా అర్థం చేసుకోడానికి సంబంధించిన ప్రాథమిక విషయం ఒకటి మనవి చేస్తు న్నాను. పిండి కొద్దీ రొట్టె అనే దృష్టిలో వ్యక్తి ఆదాయాన్నిబట్టి వ్యక్తి పోతూ వుంటాడు. దాన్నిబట్టి తన budget ఏర్పాటు చేసుకుంటాడు. కాని state ఏవిధంగా పోవాలంటే ప్రజా అవసరాలను గుర్తించి వాటిని సఫలీకృతం చేయడానికి, కావలసిన ప్రజాహిత కార్య కలాపాలకు సాధన సంపత్తి ఎంత కావాలి అనిచూస్తే ఖర్చు నికరంగా తెలుస్తుంది. ఆదాయం అంత స్పష్టంగా తెలియదు. ఇప్పుడు కొంతమంది అవసరం ఉన్నా అవసరం లేకపోయినా స్థానికమైన ఇబ్బందుల జాబితా, లోటు బడ్జటని తెలిసివుండి కూడా వెల్లడి చేశారు. మనవిధానం, మనలక్ష్యం మనం పదే పదే చెబుతూవచ్చాం. ఈ నాడున్న ఆర్థిక వ్యవస్థలో ఉన్నవారు లేనివారు అనే తారతమ్యం తగ్గించుటకు వీలుండే socialist సమాజ నిర్మాణము మనలక్ష్యం అని చెప్పుకుంటున్నాం. ఐతే ఆ లక్ష్యానికి అనుగుణంగా ప్రభుత్వ విధానం ఎంతవఱకూ దోహదంగా ఉన్నదనే దృష్టితోనే మనం ఈ బడ్జటు విమర్శించడం జరుగుతోంది. ఈ నాడు అన్ని రాష్ట్రాలలోనూ లోటు budget లే కనిపిస్తున్నాయి. పామర దృష్టితో చూస్తే అయ్యో ఇంత లోటు వస్తున్నదనే అని ఆదుర్దా ఉండడం న్యాయం కాదనుకుంటుంన్నాం. మనం శ్రేయోరాజ్యం స్థాపించాలనుకున్న ప్పుడు ప్రజాహిత కార్యకలాపాలకు ఎక్కువ డబ్బు కావాలి. పెండ్లయితే కాని పిచ్చి కుదురదు, పిచ్చి కుదిరితేకాని పెండ్లికాదు అనేది ఒక వింతరకమైన వాదం.

ఈ stipends continue చేసే విధానాన్ని ముందుకు తీసుకు రావాలని నేను మీ ద్వారా ప్రభుత్వాన్ని కోరుచున్నాను. Elementary schools తీసు కొన్నప్పుడు అక్కడ ఉన్నటువంటి manager ల యొక్క సాధకబాధ కాలు గమనించి ఉద్యోగాలుగాని, వాళ్లయొక్క material management వగైరాలు కూడా తీసుకొన్నప్పుడు వారికి ఇబ్బంది లేకుండేటటువంటి విధా నాన్ని అవలంబించాలనిచెప్పి నేను అడుగుతున్నాను. Sanskrit, Hindi compulsory చేయడం సబబుగా లేదని వారికి మనవి చేస్తున్నాను.

గాని సమాజములో మాత్రము ఆదృష్టితోపోగూడదు. ముందు వ్యయాన్ని గురించి నిర్ణయించుకున్న తరువాత కావలిస్తే పన్నుల రూపముతో రాబట్ట వచ్చును. అప్పులు చెయ్యవచ్చును. అయితే అప్పులు చేసే సందర్భములో కూడా రాబోయే తరం వానికి గుదిబండగా వారిని భాధించేదికాకుండా వారికి లాభదాయకముగా ఉండేటట్లు, దేశసంపద పెంచేటట్లు చెయ్యవలెను.

ఈనాడు లోటు బడ్జటు అయినా విచారించను. లోటు తగ్గిందని నేను ప్రత్యేకముగా ప్రధాన మంత్రిగారిని అభినందించ వలసినపనిలేదు, ప్రజ సొంత కార్యకలాపాలకు ఎక్కువ ప్రాముఖ్యము ఇస్తున్నప్పుడు అది సహజ లక్షణము, దాని గురించి నేను ఆశ్చర్యకంగాయుపడలేదు. ఈ బడ్జటును శ్రద్ధగా చదవినాను. పరిశీలించాను, గత ఆరు మాసాలలోవుండే రైల్వే గైడులోని అంకెలకు ఇప్పుడు గైడు అంకెలకు ఎంత మార్పుఉటుందో వర్తమాన సంవత్సరములో అంచనాలు వేయబడిన బడ్జటుకు యిప్పటి budget కు అంతే తారతమ్యంఉంది.

"ఇది కావ్యరచనకాదు. కమ్మని కవిత్వంకాదు" అని నేను వానిని విమర్శించడములేదు. సంఖ్యా వివరముతో నిండిన ప్రసంగంగాని, రచనగాని కొంచెము వినుగుదలగాఉన్నప్పటికిని ప్రభుత్వ విధానములో ప్రజా జీవితము ఎంత ప్రతిబింబించుతున్నది అనే దృష్టితోచూస్తే ఇదికొంచెం చప్పగావున్నదని ఉత్సాహకరముగా లేదని ఇప్పటికిని విచారపడుతున్నాను. అయితే కుటుంబ వ్యవహారములకు ప్రతి గృహిణికూడావచ్చే ఆదాయం చాలీ చాలని సంసారాలకు Adjust చేసుకోవడంలో order of priority ఇచ్చుకుంటూ ఎంతో ఒడుదుడుకులతోఉన్న సంసారాలను ఈదుకుంటూ వస్తుంది. ఈ ప్రభుత్వములో ఒక మహిళ కనుక Public finance portfolio holdచేస్తే చక్కటి budget ను అందచేసివుండే వారేమో అని అనుకుంటున్నాను.

రెండవ పంచవర్ష ప్రణాళికను గురించికుండా మన ఆర్థికశాస్త్రజ్ఞుల వారు శలవిచ్చారు. గడచిన ఒకటవ planలో ఇప్పటి వరకు సమాజములో అట్టడుగున ఉన్నట్టి హరిజనులు వహించిన ప్రాత్రఏమిటి హరిజనుల శ్రేయోభి వృద్ధికి ఎంత ఖర్చు అయినది అన్న విషయము గమనించాలి. ఈ పంచవర్ష plan ప్రధాన సూత్రము ఆయా ప్రజలు సగభాగము ఇచ్చుకొనవలెను, అనేcondition ఉంది అలాంటప్పుడు ఒక పూటకు ఉండి రెండవ పూటకులేని హరిజనులు ప్రణాళికలలో ఏ పాత్ర వహించడానికి వీలులేకుండా ఉన్నది. హరిజనుల అభ్యుదయానికి ఉపయోగపడని ప్రణాళిక ఏమిటో నాకు అర్ధంకాదు. ఆంగ్ల భాషలో ఒక సామెత ఉన్నది. "The strength of the chain is that of the weakest link" అంటే ఒకచైనుయొక్క బలం అంతకూడా చిన్న లింకులో ఎంత బలము ఉన్నదో అంత అని అర్థం. అట్లానే ఈ సమాజం అభివృది కావాలంటే హరిజనుల పురోభివృద్ధి ఎంత అయినదో దానినిబట్టి మనము కొలవడానికి వీలుఅగుతుంది.

రెండవ ప్లానులో అయినాసరే హరిజనులను ఉత్సాహపరచి ఉత్తేజపరచి వారిశ్రమశక్తి మూలముగా లేక కొద్దో గొప్పో ఇచ్చి వాటినికూడా లాక్కొనిరావడానికి అభ్యుదయకరమైన సూచనలు చేయవలసి ఉంటుందని నేను అనుకుంటున్నాను.

ఒక వైపున ప్లానింగు జరుగుతూఉంది మరొక వైపున నిరుద్యోగము ఎక్కువ అగుచున్నది. చదువుకొన్నవారి లోను, చదువులేనివారి లోను ఎక్కువ అగుచున్నది. ఇది చాలా శోచనీయమైన విషయము. ప్లానింగు జరుగుతున్న country లో unemployment జరుగుతున్నది. మన దేశములో ప్రజావసరాలు geometrcial progress ప్రజల ఆదాయం arithmetical proportion లో పెరగడములేదు. ప్రజల జనాభా ఎక్కువ అవుతున్నది. మన నిమిషానికి ఆరు మందిపుట్టే దేశములో ఖర్చుల గురించి మనము జాగ్రత్తగా చూడవలెను. ఇది మనము సాధించామని చెప్పలేము.

ఆంధ్రదేశములోవుండే ఖనిజసంపదను ప్రభుత్వం దృషిలో పెట్టుకొన్నట్లు లేదు. దానికి కృషిచెయ్యలేదు. ఏదో పరిశ్రమలగురించి చెబుతూ నాలుగు మిల్లులను పెట్టడానికి ప్రాతిపదికలు ఉన్నట్లు చెప్పేరు. ముఖ్యముగా నీటి పారుదలకు electricity కి ఈ budget లో ఎక్కువ ప్రాముఖ్యము ఇచ్చేరు: అది ముదావహం. అయితే agricultural produce ఎక్కువ చేస్తేనేగాని మనము commercial trades లో ముందుకు పోలేము అనే దృష్టితోవారు ప్రస్తావించి ఉండలేదేమో అని అనుకుంటున్నాను. నాకు ఇచ్చిన కాలం తక్కువ కనుక ఇంతటితో లోతులోకి వివరములలోకి పోకుండా నేను విరమించుచున్నాను.

SRI S. K. V. KRISHNAVATARAM :—అధ్యక్షా! మన ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి అయిన గోపాలరెడ్డిగారు ప్రతిపాదించిన Budget ప్రతిపాదనలను నేను సమర్థిస్తున్నాను. ఈ బడ్జటు మనయొక్క రాష్ట్రముయొక్క ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా రెండవ పంచవర్ష ప్రణాళిక బాధ్యతల దృష్ట్యాదానికి పరిమితమై ఈ budget proposals ముందుకు తీసుకొని రాబడినవి. ఈ బడ్జటు ప్రొపోజల్సు రెండవ పంచవర్ష ప్రణాళి కలో ఒక అంతర్ భాగము అయినట్లుగా దానియొక్క ప్రతి పాదనలనుబట్టి మన అందరికి విశదము అగుతూఉంది. కొంత ఈ బడ్జటు ప్రతిపాదనలను చెయ్యడములో 2 వ plan యొక్క కాంక్షలకులోబడి ఈ ప్రతిపాద నలు చెయ్యడమనేది జరిగింది. ఇది వాస్తవిక పరిస్థితులను తెలియ చేస్తుందా. ఆ కారణంచేత బడ్జటును అమోదించవలసి ఉన్నది. రెండవ plan సఫలీకృతము కావలెనంటే కొంత ఆర్థిక స్తోమతను మనము కలుగజేసుకొనవలెను. ఆ ఆర్థిక స్తోమతును కలుగజేసుకొనడానికి మనము ఎక్కువ పన్నులను ఇంకా భరించుకొని మనం రివెన్యూను వృద్ధిచేసుకొన వలసినఅవసరం ఎంతైనా ఉన్నది. ఆ విషయంకూడా మన ఆర్థిక మంత్రి గారు తమ బడ్జటు ఉపన్యాసములో చెప్పిఉన్నారు. ముందు తరాల వారి కొసము మనము కొంత sacrifice అయినా చెయ్యడానికి మనము సంసిద్ధ ముగా ఉండాలి అని వారు చెప్పారు. కాబట్టి ఈ పరిస్థితుల దృష్ట్యా

SRI S. K. V. KRISHNAVATARAM]

మనము ఈ బడ్జటును పరిశీలించవలసివుంది. అనవసరమైన విమర్శలు చేసినంత మాత్రమున ఎట్టి ప్రయోజనముకూడా లేదు. మనకు కావలసిన ముఖ్య అవసరాలను ప్రభుత్వ దృష్టికి తీసుకొనిరావలసిన బాధ్యత మన మీద వుంది. క్రమక్రమేణ ప్రభుత్వము మనము సూచించిన విషయాలను అన్నింటిని గమనించి వాటిని అమలుపెట్టడము నిమిత్తము ప్రభుత్వం తప్పకుండా ప్రయత్నం చెయ్యవచ్చును.

ఈ బడ్జటులో ప్రజారోగ్యమునకు, వైద్యానికి ఎక్కువ కేటాయించవలసినంత డబ్బు కేటాయించలేదు. మిత్రులు రాఘవులుగారు చెప్పినట్లు దేశములో జనాభా విపరీతముగా పెరిగి పోతున్నది. ఈ జనాభా పెరుగుదలను అరికట్టే నిమిత్తము కేంద్ర ప్రభుత్వంగాని, రాష్ట్ర ప్రభుత్వంగాని ఎక్కువ శ్రద్ధ తీసుకొనడములేదు. ఎక్కడో ఫ్యామిలీ ప్లానింగు క్లినిక్కులను కొన్నింటిని స్థాపిస్తామని ఆర్థిక మంత్రిగారుకూడా చెప్పారుగాని మన దేశమువారు ఈ జనాభాయొక్క పెరుగుదలను అరికట్టకపోతే మీరు ఎన్ని ఆర్థిక ప్రణాళికలువేసినాకూడా సఫలీకృతం కానేరవు. దానిని గురించి రాష్ట్రప్రభుత్వం ఎక్కువగా శ్రద్ధ తీసుకొనవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. దానిని గురించి ప్రజలలో ఎక్కువ ప్రచారముచేసి ఈ జనాభా తగ్గుదలను గురించి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొనవలసినదిగా నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. ఇదికాకుండా Leprosy/T. B. ఎక్కువగా పెరుగుతూవున్నవి.

ఇదీకాకుండా, లెప్రసీ తర్వాత ట్యూబర్‌క్లోసిస్ యివిఅన్నికూడా విపరీతంగా వ్యాధులుపెరిగిపోతున్నాయి. రాష్ట్రం మొత్తంమీద ఒక ట్యూబర్‌క్లోసిస్ నిమిత్తం ఒక సానిటోరియంవుంచవని చెప్పారు. ట్యూబర్‌క్లోసిస్ ఫండని జిల్లాలో చాలాచోట్లా లక్షలాది రూపాయలు ప్రోగుచేసి ఆమొత్తాన్ని జిల్లా కేంద్ర ఆస్పత్రులలో కొన్ని beds ను ప్రత్యేకించి కొన్ని wards ను ఈ T.B. cases నిమిత్తం ప్రత్యేకించవలసినదిగా నేను మనవిచేస్తున్నాను. అదిగాక లెప్రసీకూడా వ్యాపితమై బాధపడేటటువంటి జనాభాహెచ్చయి పోయింది. అందులో ప్రత్యేకంగా దక్షిణాదినుంచి యెక్కువమంది మన వైపుతరలివస్తున్నారు. దానిగురించి లెప్రసీక్లినిక్సు ఎక్కువపెట్టవలసిన అవసరం ఎంతఅయినాఉంది. తరువాత ప్రసూతి కేంద్రాలు రాష్ట్రంలో ఉన్నాయికానీ వాటికి సరియైన ఎక్విప్మెంటులేదు. సరియైన పద్ధతుల్లో అది నడవటంలేదు. సరియైన staff కూడా దానికిలేదు. ఆవిషయంలో కూడా శ్రద్ధచూపించాలి. తరువాత rural dispensaries ఉన్నాయి. కాని rural dispensaries లో ఉన్న డాక్టర్లకు చాలా తక్కువ subsidy ఇస్తున్నారు. మొత్తం 50, 60 రూపాయలకంటే ఎక్కువలేదు. అది కనీసం నూటపాతిక రూపాయలైనాసరే నూరు రూపాయలకుమించి వారి

[SRI S. K. V. KRISHNAVATARAM

వేతనాన్నిచెయ్యాలి. తరువాత రూరల్ డిస్పెన్సరీలలోవున్న మెడిసిన్సు, ఎక్విప్మెంటు, staff విషయంలో ఎక్కువ శ్రద్ధతీసుకోవాల్సిన అవసరం ఎంతైనావుంది. గత సంవత్సరంలో కొన్ని తాలూకా Headquarters లోవున్న Hospitals ని ప్రభుత్వం Provincialise చేస్తారనిచెప్పారు. కాని ఈ బడ్జెటు ఉపన్యాసంలో దానినిగురించి ఎట్టి విషయాలుకూడాలేవు. కాబట్టి అలాంటి ముఖ్యమైన తాలూకా కేంద్రాల్లోవున్న ఆస్పత్రులను ప్రభుత్వ స్వాధీనపరచుకొని సమర్థనీయంగా వాటిని నడపవలసినదిగా ప్రభుత్వాని నేను కోరుతున్నాను. ప్లానింగులో ఇంజనీర్సు తరువాత Veterinar Doctors పశుగణాభివృద్ధికిగాని, పశువైద్యానికిగాని చాలా ఎక్కువమంది అవుసరమైవుంది. ఒక బాపట్లలోయేదో Agricultural College పెట్టిన చోటనే దానినికూడాపెట్టాము అనిచెప్పుతున్నారు. అది ఎక్కడపెట్టేదికూడా ఇంకా స్థిరీకరణ చెయ్యలేదని చెప్పారు. పశ్చిమ గోదావరి జిల్లాలో Veterinary Hospital ను పెట్టవలసిందిగా నేను సూచిస్తున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI:—కడపటికి హైదరాబాదుకుపోతుందనుకొంటాను.

SRI S. K. V. KRISHNAVATHARAM:— హైదరాబాదుకు పోవడంఅనవసరం. హైదరాబాదులో యింకొకటి పెట్టుకోవచ్చు. హైదరాబాదులో ఎక్కువ industrial area ఉంది. తెలంగాణా areaలో industries develop చెయ్యడంఅవుసరం. Agricultural economy యిప్పటి ఆంధ్ర ప్రాంతంలో ఎక్కువ develop చెయ్యడంఎంతైనా అవుసరంవుంది. తదుపరియింకా Education పద్దులో మన Budget లో చాలా మంచిసూచనలుచేస్తారు. ప్రాథమిక విద్య వున్నతస్థాయిలోకి తీసుకొనివద్దామన్నవుద్దేశ్యంతో ప్రాథమికవిద్య గరపడానికి వేరే సెకండరీ గ్రేడు ప్యాసుఅయిన ఉపాధ్యాయుల్ని వేస్తామనిచెప్పివున్నారు. అదిచాలా మంచిమార్పు. కాని దానితోబాటు ప్రాథమిక విద్యగరపే ఉపాధ్యాయుల యొక్క జీతాలు సరియైన ఎక్కువస్థాయిలో పెట్టడం తర్వాత వాళ్లకు Provident fund, Pension gratuity మొదలుగాగల అన్ని సౌకర్యాలనుకూడా వారికిచెయ్యడం అవుసరం. మనదేశంయొక్క అభివృద్ధి అంతా కూడా ఉపాధ్యాయులమీదవుంది. వారిని అసంతృప్తిపరచడం అనేది ఎంతమాత్రం మంచిపనికాదు. తరువాత ఒకటి మాత్రం చెప్పదలచు కొన్నాను. II Form లో ప్రయివేటుగా చదువుకొనే వారిని డైయిరెక్టుగా చేర్చుకోమనే నిబంధన అమలుపరచడం కష్టాలకు దారితీస్తుంది. కాబట్టి ఈ సంవత్సరానికి కొంత పూర్కొని వచ్చే సంవత్సరంనుంచి అదిచేసినట్లయితేకొంత మంచిది అని విద్యామంత్రిగారయిన ప్రథాన మంత్రి గోపాలరెడ్డిగారికి మనవిచేస్తున్నాను. తర్వాత ఈ Public Works లో wastage అనేది ఎప్పటికప్పుడు చెబుతూవుంటున్నప్పటికి దానిగురించి సరయినటువంటి చర్యలు

SRI S. K. V. KRISHNAVATARAM]

తీవ్రంగా తీసుకుంటున్నట్లు తెలియదు. ప్రత్యేకంగా ప్లానింగు పీరియడ్‌లో మనం succeed అవాలి అంటే యీ Wastage ను అరికట్టవలసి ఉన్నది. ఎక్కువ Irrigation and Power Project లకు మనం ప్రాధాన్యం యిస్తున్నాము కాబట్టి మనం యీ Public works శాఖలో Wastage అవినీతిని తగ్గించడం చాలా అవసరం. తర్వాత forests పరిపాలనలో చాలా అక్రమాలు జరుగుతున్నాయి. గ్రామాదుల్లో Forest Guards పై చాలా complaints వచ్చుచున్నాయి. నా నియోజకవర్గంనుంచే ఒకచోట Forest Guard ఫారెస్టుసంతా యేకంగాకొట్టేసి పరిసర ప్రాంతాలలోని పట్టణాలకు రవాణా చేస్తున్నట్లు తెలుస్తోంది. దానిని అంతా చాలా గమనించవలసి ఉన్నది. తర్వాత ప్రభుత్వ ఉద్యోగుల్లో చాలామట్టుకు deterioration of efficiency in services చాలా వస్తూవుంది. దాన్ని గురించికూడా ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధతీసుకొని ప్రభుత్వ ఉద్యోగులు మంచి సమర్థనీయంగా పనిచేసేటట్లు చర్యలు తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. తరుపాత యిప్పుడు corruption drive అవసరం. ప్రభుత్వం శాఖల్లోకూడా లంచగొండితనం రోజురోజుకీ విపరీతంగా పెరిగిపోతూంది. స్వాతంత్ర్యం రాకముందుకంటే ఇప్పుడే లంచగొండితనం మన ప్రభుత్వం అధీనంలో నున్నప్పుడే ఎక్కువ అయిపోతున్నదని ప్రజలనుండి విమర్శ చాలా వస్తోంది. కాబట్టి ఈ లంచగొండితనాన్ని అరికట్టేందుకు, ఇతరత్రా జరిగే red tapism, nepotism, favouritism, corruption వీటినన్నిటినీ నిర్మూలన చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. తర్వాత మా ఏలూరి పట్టణానికి సంబంధించి డ్రైనేజి స్కీముకు స్టేటులో first priority యిచ్చామని చెబుతున్నారు. మంత్రి కళా వెంకట్రావు గారుకూడా ఇటీవలనే దాన్కి foundation వేస్తామని చెప్పారు. దానిని గురించికూడా చూస్తే యీ budget proposals లో యేమీగూడా కనబడటం లేదు. తర్వాత యెఱ్ఱకాలువ ప్రాజెక్టు అనేది నా నియోజిక వర్గంలో చాలా ముఖ్యమైంది ఈ సంవత్సరంలో flood వచ్చి, 4-5 తాలూకాలకు నష్టం కలిగింది. దాన్ని Flood and Irrigation Project క్రింద Flood Control Scheme and Irrigation Project క్రింద తీసుకోవాల్సిన అవసరం ఎంతైనాఉంది. లోగడ budget లో detailed investigation కు allotment ఉందిగానీ ఈ బడ్జెట్టులో దానికి provision ఉన్నట్లులేదు. అందువల్ల ముఖ్యంగా ఎఱ్ఱకాలువ ప్రాజెక్టు తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉందని, అది 4-5 తాలూకాలకు అది ఎంతో ఉపయోగపడుతుందని నేను మీకు మనవి చేస్తున్నాను. తర్వాత యింకా అనేకమైన విషయాలున్నాయి. ఆ విషయాలన్నింటిమీదకూడా Demands వారీగా వచ్చినప్పుడు మాట్లాట్టానికి అవకాశం ఉంది. కాబట్టి సూచనలన్నిటిలో చాలా భాగం అమలుచేయాలని కోరుతున్నాను.

SRI S. SEETHARAMAYYA:— అధ్యక్షా! వెనుకబడిన కొండజాతి ప్రజలను అభివృద్ధిలోకి తీసుకొనిరావడంకోసం ముఖ్యమంత్రి గారు ప్రవేశపెట్టినట్టి Budget లో 25 లక్షల 80 వేలు రూపాయలు మాత్రమే కేటాయించబడి వున్నది. ఈ మొత్తంచాలాతక్కువగా నున్నం దున నేను విచారాన్ని తెలియజేస్తున్నాను. ఈ Budget లో ప్రభుత్వం యిచ్చిన వివరాలకుపోతే ఉద్యోగస్తులకీ, బిల్డింగ్సుకీ ఇంకా తదితర ఖర్చులు యెక్కువగా ఖర్చు కనబడుతుంది. ప్రజలకు వినియోగించే ఖర్చు చాలా తక్కువగా కనిపిస్తున్నది. చదువుకోసం 9 లక్షల 10 వేలుకేటాయిస్తే hostels కీ విద్యార్థులకీ ఖర్చుపెట్టే డబ్బు 70 వేలు మాత్రమే వుంది. ఇంతడబ్బు అంతాకూడాను యేదో దుబారాగా అయినట్లు కనిపిస్తూంది. అయితే ఈ 70 వేలు ఖర్చుపెట్టినందువల్ల ఈ కొండజాతి విద్యార్థులెంతమంది చదువు తున్నారు. వీళ్ళు అభివృద్ధిలోకి రావటం అవకాశం లేదుగనుక, అదేకాకుండా మలేరియా నివారణకు 4 లక్షలు కేటాయిస్తే యింకా ఇతరఖర్చులకు 3 లక్షలు అవుతుంది. ఇంకా మిగిలేది ప్రజలకోసం ఒక లక్షే మిగిలేది. అందుచేత తినడాన్కి తిండిలేక కట్టుకోడాన్కి గుడ్డలులేక, నాగరికతలేక అనేక కష్టనష్టాలుకు గురి అవుతున్న కొండజాతి ప్రజలకు యెక్కువగా Budget కేటాయించవలసిన అవసరం ఎంతైనావుంది అని ముఖ్యమంత్రి గార్కి మనవి చేస్తున్నాను.

అంతేకాకుండా ఏజన్సీ ప్రాంతములో కొండజాతి ప్రజలను అభివృద్ధి లోకి తీసుకరావాలంటే మొదటిది విద్య. ఈ విద్యా సౌకర్యాలు ఎక్కువగా కల్పించిననాడే ఈ ఏజన్సీప్రాంతాలు అభివృద్ధిలోనికి వస్తాయని మనవి చేస్తున్నాను. హాస్టల్సును నిర్మించడంద్వారా, ఎలిమెంటరీ స్కూళ్లను పెట్టడంద్వారా, మధ్యాహ్నపు భోజనం ఏర్పాటుచేయడంద్వారా, స్కాలర్ షిప్పులు ఇవ్వడంద్వారా ఎక్కువమందిని చదివించవచ్చును. అంతే కాకుండా ఏజన్సీ ప్రాంతాల్లో నీటి సౌకర్యాలు, రహదారి సౌకర్యాలు కల్పించ వలసిన అవసరం ఉన్నది. రహదారుల సౌకర్యాలు కల్పించి బైట ప్రాంతానికి interior ప్రాంతానికి సంబంధాలు ఎప్పుడు ఏర్పడతాయో అప్పుడే develop అవడానికి అవకాశాలు ఉన్నవి. ఆర్థికంగా వెనుకబడిన కొండజాతి ప్రజలను వ్యవసాయకంగా అభివృద్ధిచేయడం ఎంతైనా అవుసరం ఉన్నది. వ్యవసాయం చేస్తున్నారంటే వాళ్ల యిష్టా ప్రకారం చేస్తున్నారు. మొక్క మొలిస్తేచాలు ఎంతైనా చల్లుతారు. పంట ఎంతైనా పండనివ్వండి. పద్ధతులు తెలియక డబ్బులేక వ్యవసాయాలు పాడు అవుతున్నాయి. చెరువులు ఆధారంలేక కేవలం వర్షాధారంతో పండిస్తున్నారు. కొండరెడ్లు ఆరు మాసాలు తిండిలేక దుంపలు తిని బ్రతుకుతున్నారు అనేది ప్రభుత్వం గుర్తించుకోవలసియున్నది. వాళ్లకు విత్తనాలు సప్లైచేయడంద్వారా, వ్యవ సాయపనిముట్లు సప్లైచేయడంద్వారా, పెద్దకాలువకు డాములు కట్టడంద్వారా వాల్తేరు, సీతపల్లి, పెదవాగు, సోగిలేరు, రాజమలగి మొదలైన పెద్దకాలువలకు dam కట్టించడంద్వారా అక్కడ ఉన్నటువంటి వ్యవసాయాన్ని అభివృది

లోనికి తీసుకరావచ్చును, అంతేకాకుండా forests లో సౌకర్యాలు ఎంతవరకు ఉన్నాయంటే ప్రభుత్వం unclassified కొండజాతులవారికి ఉచితంగా ఇస్తున్నాం అని పేరుకుగాని డబ్బుపెట్టి కొంటున్నారనేది మరచిపోకూడదని చెబుతున్నాను. Free permits తెచ్చుకోడానికి 15, 20 మైళ్ళ దూరంలో ఉన్నాయి range ఆఫీసులు, నాగలిపోయి తెచ్చుకోవాలంటే 20 మైళ్లువెళ్లి permit తీసుకరావడం చాలా కష్టంగా ఉన్నది. Free permits Range Offices ఇవ్వడానికి లేదు, ఇవ్వాలని rule తెచ్చారు. Range Officer 20 మైళ్ల దూరములోఉంటే D. T. O. దగ్గరకు ఎట్లా వెడతారు? Unclassiffied పట్టా ఇవ్వడానికి అధికారం Forester కు ఇస్తే కలప తెచ్చుకోవడానికి వీలు ఉంటుంది. Unreserved వాటినుంచి ఇండ్లకే కలప దొరకడంలేదు, వ్యవసాయ పనిముట్లకు సరిపోతుంది. Reserve forests కొట్టడం తప్పడంలేదు. కేసులు పెట్టడం తప్పడంలేదు, లంచం ఇచ్చి తప్పుకోవడం జరుగుతోంది, రిజర్వులోనుంచి unreserved అయినా కేటాయించాలి. వీటిని enumerate చేయించి ఇండ్లకు కలప అయినా ఇప్పించే ఏర్పాటు చేయవలసిఉన్నది. ప్రభుత్వం కర్రకూపులు స్వయముగా చేయిస్తున్నది. వాళ్లకు ఎంతవరకు డబ్బు సక్రమంగా ముట్టుతోందనేది ఆలోచించాలి, ఈ విషయంలో అన్యాయం జరుగుతోందని ఖచ్చితంగా చెబుతున్నాను. కొన్ని areas లో బట్వాడాచేస్తారు, కొన్నిచోట్ల చేయరు. ఏ గ్రామంలో ఏ రైతుఎంత కర్ర నరకాడనేదానికి లెక్కలు సేకరించడానికి Special Officer ను వేసి లెక్కలు తీసుకొంటే అన్యాయం జరుగకుండా ప్రజలకు న్యాయం జరుగుతుందని మనవిచేస్తున్నాను. వెట్టి, చాకిరి పద్ధతిని గురించి నేను వెళ్లినప్పుడల్లా మావాళ్లు చెబుతుంటారు. తిండిలేని బాధకన్న ఈ బాధ ఎక్కువగా ఉన్నది. మొన్ననే కూనవరం forester భద్రాచలం Special Officer గా వేస్తే ఒకణ్ని పట్టుకొని మూట మోయమన్నాడు. మోయనంటే నాలుగు తన్నాడు. ఇటువంటివి అనేకం జరుగుతున్నాయి. కూపుల్లో పనిచేస్తున్నారంటే డబ్బు ఇస్తారనికాదు; ప్రభుత్వానికి తప్పనిసరిగా వెట్టిచెయాలని, ఏదో డబ్బు ఇస్తున్నప్పటికి వారికి సక్రమంగా ముట్టడంలేదు. గ్రామాలకు వెళ్ళి పటేలునుపిలిచి చెబుతారు. నిర్బంధంగా పోవాలని చెబుతారు. వాళ్లలో చేసేవాళ్లు చేయని వాళ్లుకూడా ఉంటారు. ఈ పద్ధతిని రద్దుచేయాలంటే gang cooly పద్ధతి ప్రవేశపెడితే మంచిది. ముఠాదారీ విధానాన్ని ప్రత్యేకంగా రద్దు చేయవలసిన అవసరం ఉన్నది. ఈ సందర్భములో ముఖ్యమంత్రిగారికి ఒక విషయం గుర్తుకు తెస్తున్నాను. ఆకులకు సంబంధించిన విషయం. ఇదివరకు వంద ఆకులకు 0-0-3 ఇచ్చేవారు. అది చాలదని ఆందోళనచేయగా 0-0-6 చేసారు. కంట్రాక్టర్లు వెళ్లి కొలతలుఇచ్చి కట్టలు కట్టుకురావాలని చెబుతున్నారు. అందులో 200, 250 వరకుకూడా ఉండవచ్చును. ఏప్రెలు మాసంలో ఆకు కోత ప్రారంభం అవుతుంది. కనుక వెంటనే శ్రద్ధతీసుకొని orders పంపాలని కోరుతూ విరమిస్తున్నాను.

SRI S. RANGANATHA MUDALIAR: —Mr. Speaker, Sir, it is very unfortunate that we are faced with a deficit budget. For that reason we do not feel enthused about it and it reads prosaic and does not inspire us with hope or encouragement. But, all the same we are thankful to the Government for what they have been doing for us and what they intend to do for us. The references in the Hon. Chief Minister's speech to the formation of Visalandhra contains a whispering hint of want of a bold policy in regard to the handling of the question of unifying all the Telugu speaking areas into one greater Andhra State. Is it the desire to get Telangana and is it the eagerness to grasp it that made our Government forget its duty to the Andhras living in Bellary, Parlakimidi and Berhampur areas? Why the Government did not put up a fight for these areas with the same zeal and earnestness as they did in regard to getting Telangana is not understandable. Is it because they were afraid that if they pressed the claims in respect of these areas, they were not going to get Telangana, or is it the fear that they will lose what little they got? Why they did not press their claims requires a little clarification on the part of the Government. Once again, a delegation has gone to see Pandit Nehru and we do not know what the outcome of the meeting will be.

Again, there is the vexed question of border disputes to be settled. I request the Government to solve this problem as early as possible. It is not my opinion; so far as I am concerned I find that the Tamilian interests are being carefully safeguarded and will be safeguarded. But there is a feeling of uncertainty amongst the people in the border areas and this state of uncertainty must be ended either this way or that way. There is a feeling of frustration and therefore there is agitation in those areas. I request the Government to inform us whether they get more areas by settling this question or whether they fear they are going to lose some areas on account of that. The sooner the question is settled the better for us all concerned. I appeal to the Government to take up this border question as early as possible and settle it once for all.

SRI S. RANGANATHA MUDALIAR]

There is also, I find, some timidity with regard to its policy as to the name by which the new State might be called. We are told that the Goverment is willing for the new State being called by any name as may be decided by others—Hyderabad, Golconda or Usmanabad, anything but Andhra or Visalandhra. Because the present Nizam's name is Nawab Mir Osman Ali Khan, it may be that others like to immortalise him by calling the State as Usmanabad. I think that in regard to the name of this State, a bolder policy is called for. It must be Andhra or Visalandhra-Maha or greater Andhra; Visalandhra will be all right. In this respect we must assert ourselves and call the new State as Andhra. We should not give up the name 'Andhra' which has historical significance; we have been using it all along in the fight for Visalandhra and simply because one man is going to be satisfied; for sentimental reasons, we must not agree to call this State by any other name than Andhra or Visalandhra.

In the budget speech of the Hon. Chief Minister, we are told that the days of asking for elementary schools or village roads or rural dispensaries are gone. Does this statement imply that the country had the fill of elementary schools and that all the villages are provided with roads and rural dispensaries. I hope the Hon. Chief Minister will not turn his back upon these things and concentrate his attention only on Polytechnics, colleges and drainage schemes for urban areas. There are many villages which still require roads; there are many villages where medical facilities are wanting; and there are many villages where not all children of school-going age have been provided with schools. It is doubtful whether, even after the Second Five-Year Plan period, enough schools and dispensaries in the villages can be established and enough roads can be laid, as to cover the whole State.

With regard to the First Five-Year Plan, it is said in paragraph 12 of the budget speech 'that the plan made provision for irrigation schemes for the permanent improvement of scarcity areas'. But the Government has not defined 'what are scarcity areas?' It is

[SRI S. RANGANATHA MUDALIAR

necessary we should have a list of areas which Government considers as 'scarcity areas' so that we may know in selecting these areas for improvement, if any principle is followed. The principle should be that the scarcity areas should be selected for improvement in the order of the degree of scarcity. Why I say this is that I find unfortunately a tendency of late to confine for improvements only to limited areas in which members of the party in power are interested. There are certain areas which are treated with step-motherly affection and if there is no Minister or influential Member from any constituency, that constituency is forgotten completely.

THE HON. DR. B. GOPALA REDDI:—Which constituency you are referring to?

SRI S. RANGANATHA MUDALIAR:—My own constituency.

THE HON. DR. B. GOPALA REDDI:—Who is the step-mother here?

SRI S. RANGANATHA MUDALIAR:—At any rate, the treatment is step-motherly treatment.

As regards roads, it is stated that Government will take over the roads from the district boards gradually. This slow policy has already worked a great havoc on the district boards and after the advent of special officers the situation has become worse and roads are encroached upon, damaged, cut and mutilated. It is sad that the special officers look upon this with helplessness; when it is brought to their notice, they express their helplessness. It is not a question of helplessness; it is a question of indifference. These famine roads and other roads constructed under the Rural Reconstruction Schemes have to be taken over immediately by the Government. Otherwise the very trace of these roads will disappear in a very short time.

[5th March 1956

SRI S. RANGANATHA MUDALIAR]

The abolition of the elementary grade schools is viewed with great concern by the public. As a means of economy, it may or may not bring any savings to the Government. But beyond doubt it will throw out of employment many students belonging to the poorer classes who cannot study beyond E.S.L.C. standard. To restrict the payment of stipends to these poor boys—it is after all a nominal sum—and to give it to the secondary trainees, is to rob the poor Peter and pay the rich Paul.

Lastly, with regard to family planning about which my friend spoke eloquently, my submissive appeal is that the State should not take it up, as questions of religious scruples, conscientious objections and fundamental rights are involved. It is not intended only for the town people. My friend Mr.Krishnavatharam if he has too many children, he may by all means resort to that method. Who are we to tell the poor, "Bear two children and not more"? We must understand that among poorer classes the fecundity is large and the number of children is great; more children means a greater economic value for them. This family planning may bring cheap popularity to Government, but I think, having regard to our religious scruples and conscientious objections, we may consult the poor man whether he suffers from over production. Let us go and ask a poor man whether he needs it? He will certainly say 'No'.

THE HON. DR. B. GOPALA REDDI:—Consult 'she'.

SRI S. RANGANATHA MUDALIAR:—'She' has no voice, Sir. It will be long, long years, may be centuries, before that 'she' will have any voice in this matter. She too will say, "I will have my children, more children; because I want one child to look after my baby when I go to work; I want one child to look after cooking when I go to work." The man also will say that he wants assistance. After all by limiting the numbers, we will be limiting the strength of the State. We want soldiers and there may come a time when man-power will be needed more and more. For all

[SRI S. RANGANATHA MUDALIAR

these considerations, I suggest that the State may not take to this cheaply and glibly, and the matter must be referred to public opinion before anything can be done. I have seen in the budget speech that 10 family-planning clinics are proposed to be opened. I am happy they are not more and the Government will have to consider whether spending on these ten clinics will be necessery having regard to the financial position of the State. Thank you, Sir.

SRI P. VENKATA SUBBAYYA:— అధ్యక్షా! మహాశయా ఆర్థిక మంత్రిగారు ప్రవేశపెట్టిన 1956-57 లో బడ్జట్ సమర్థనీయమైనదని నేను బలపరస్తూ, మంత్రిగారిని అభినందిస్తున్నాను. ఏ బడ్జట్ అయినాసరే ఆదాయ వ్యయాలకు లోబడియుండక తప్పదు. ఆదాయలన్నీ అనుసరించి వ్యయంచేయాలేకాని యెక్కువ ఖర్చుచేయడానికి వీలుండదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం అనేకమైన అభివృద్ధి కార్యక్రమాలును చేసుకొనేటప్పుడు పెట్టుబడి పద్దులను పెంచకతప్పదు. ఇప్పుడు ప్రభుత్వం ప్రణాళిక రచనాకాలంలో అభివృద్ధి కార్యక్రమాలదృష్ట్యా అభివృద్ధిని సాధించడానికిగాను ఎక్కువ అప్పులు చేయవలసియుంటుంది. కేంద్ర ప్రభుత్వం నుంచి సుమారు 15 కోట్ల 91లక్షలు రూపాయలవరకు అప్పు తీసుకోదలచారు. ఇంకా ఆరుకోట్లరూపాయలు ప్రజల దగ్గరనుంచి తీసుకోడానికి సంకల్పించబడింది. 19 కోట్ల రూపాయలు పెట్టుబడి పద్దులపైన ఖర్చు పెట్టుటకు అంచనా వేయబడింది. ముఖ్యంగా విద్యుశ్చక్తి నీటిపారుదల స్కీములకు యెక్కువ ప్రాముఖ్యత యివ్వబడింది. అంతేగాకుండా విద్యా వైద్య సౌకర్యాలనుకూడా ప్రముఖమైన స్థాన మివ్వబడిందని నావుద్దేశ్యం ఈవిధంగా యిది లోటు బడ్జట్ అయినప్పటికీ మనం అప్పులమీద ఆధారపడి కొన్ని అభివృద్ధి ప్రణాళికలు అమలు పరచదలచుకొన్నప్పటికిని యిది చాలా సమర్థనీయమైనదనే నాఅభిప్రాయం. ఈ ప్రణాళిక కాలంలో మన రాష్ట్రమేకాదు ప్రతి రాష్ట్రబడ్జట్‌కూడా లోటుగానే వుండకతప్పదు. కేంద్ర ప్రభుత్వంకూడా లోటు బడ్జట్‌తోనే తనవ్యవహారాన్ని సాగించడానికి పూనుకొన్నది. 390 కోట్లరూపాయలలోటు బడ్జట్‌తో దేశముఖ్‌గారు తమ బడ్జట్‌ను ప్రవేశపెట్టారు. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో దానిని సమర్థనీయంగా సాగించుటకు దేశముఖ్‌గారుకూడా అప్పులపై ఆధారపడవలసివచ్చింది. అక్కడ సుమారు మూడు కోట్ల రూపాయలు ప్రజలనుంచి అప్పు తీసుకోడానికి సంకల్పించబడినది. Treasury Bills విడుదల చేయడానికి పూనుకొన్నారు. 70 కోట్ల రూపాయలు small savings నుంచి తీసుకోడానికిన్నీ 85 కోట్ల రూపాయలు యితర దేశాలనుంచి ఆర్థికసహాయం పొందడానికి సంకల్పించి తమ బడ్జట్‌ను సమగ్రంగా ప్రతిపాదించుకున్నారు. అలాగే యిక్కడమన బడ్జట్‌కూడా చాలాసమర్థనీయంగా ప్రతిపాదించబడిందని నేను అనుకుంటూ

న్నాను. మా నియోజకవర్గంలో అది చేయలేదు, యిది చేయలేదు, అని కోర్కెలను ఏకరువుపెట్టడం అవి ఎట్లా సాధించుకోడానికివున్నదనే దృష్టి మానుకోవడం చాలా శోచనీయంగా వున్నదని మనవి చేస్తున్నాను. మనబడ్జట్ లోట్ బడ్జట్ అయినా పర్వాలేదు. మనం కొన్ని అభివృద్ధి ప్రణాళికలను వేసుకోవడం జరిగింది. యీ ప్రణాళిక కాలం మొదటి సంవత్సరములో పెద్ద లాభం కలగకపోయిన వచ్చే 5, 6 సంవత్సరాలలో మనం సంపాదించే టటువంటి ఆదాయంతో యీ అప్పులను తీర్చుకోడానికి అవకాశంవుంటుంది. అందుచేత లోటు బడ్జట్ అయినప్పటికి ఆర్థిక శాఖా మాత్యులు అనుసరించి నది సముచితమైన మార్గము. అయితే యిప్పుడు కేంద్ర ప్రభుత్వంవారు 2 వ పంచవర్ష ప్రణాళికలో 4 వేల 8 వందల కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి 5 సంవ త్సరముల కార్యక్రమాన్ని కొనసాగించాలని అనుకున్నారు. అందులకు 12 వందల కోట్ల రూపాయలు Currency notes ముద్రించి deficit finance పద్ధతిని అమలులో పెట్టడానికి ఆలోచించారు. అపద్ధతి అమలు పెట్టినపుడు దేశంలో ధరలు హెచ్చు పెరగడం సంభవిస్తుంది. అందుచేత economy తారుమారై పోతుంది. ఆ ధరలను అరికట్టడానికి, సరియైన ధరలను keep up చేయడానికి ఆ డబ్బుఅంతాకూడా వాపసు తీసుకోవలసిన అవస రం ప్రభుత్వానికి వుంది. ఆ కారణంచేతనే కేంద్ర ప్రభుత్వం 34 కోట్ల రూపాయలు పన్నులువేసి ఆద్రవ్యాన్నంతా వాపసుతీసుకోడానికి సంకల్పించిది. అదే విధంగా మన రాష్ట్రంలోను మనం 6 కోట్ల రూపాయలు ప్రజలనుంచి అప్పు తీసుకోవాలని సంకల్పించాము. కనుక యీ అప్పులద్వారా ద్రవ్యా న్నంత వాపసు తీసుకొని సరియైన పద్ధతులతో ప్రజలకు పంచిపెట్టాలి. అంటే అభివృద్ధి పనులకై ఖర్చుపెట్టాలి. ఈ విధంగా చేసినట్లయితే మనకు ఆర్థిక స్థోమతు బాగానే వుంటుందని అనుకోవచ్చును కనుక యీ పంచవర్ష ప్రణాళికా కాలంలో మనం అప్పులపైన యితర ఆదాయాలపైన ఆధారపడ వలసియున్నది.

ఇప్పుడు బడ్జట్ విషయంలో ముఖ్యమంత్రిగారు సూచించిన కొన్నిముఖ్య మైన మార్పులకు నేను చాలా సంతోషిస్తున్నాను. విద్యా విషయములో చాలా నూతనమైన మార్పులనుకూడా తీసుకొనివచ్చారు. యిది చాలా ముదా వహమైనటువంటి విషయం. Elementary grade section సగంవరకు సెకండరీ గ్రేడు section చేయబడినది. Training section లో ఉన్నత విద్యార్థులకు ప్రవేశానికి అర్హతలు కల్పించబడినవి. ట్రెయినింగు కాల పరి మితి యేడాదికి తగ్గించబడింది. 8 ప్రభుత్వ సంస్థలలో 1956-57 సంవత్సర ములో యీ పద్ధతి ప్రవేశపెట్టబడింది. సకలార్థ సాధక పాఠశాలల స్థాపన, మాధ్యమిక పాఠశాలల్లో వృత్తి విద్యాబోధన చేయదలచారు. ఈ పథకాలకు 75 48 లక్షలు రూపాయలు కేటాయించబడింది. సంస్కృతబోధనకు అనుకూ లమైన సంస్కృత పండితులు వుండేచోట వాళ్ళకు advance increments

యిచ్చేపద్ధతి సంస్కృతాన్ని బోధించడానికి కూడా చాలా ప్రోత్సాహం కల్గిస్తుందని ఆశిస్తున్నాము తెలుగు పండితులకు సంస్కృతం నేర్చుకోడానికి గాను కొంత అవకాశం యివ్వబడింది. Advance increments కూడా యిచ్చే సూచన చేయబడింది. ఈ విధంగా యింకా విద్యా, వివేకాలు కల్గడానికిగాను యీ బడ్జటులోవున్న సూచనలు చేయబడినవి.

ముఖ్యంగా యీ Treasuries లో కొంత ద్రవ్యం దుర్వినియోగం కావడం కొన్ని పొరపాట్లు జరగడంవల్ల ద్రవ్యనష్టం కల్గడం మనం చూస్తున్నాము. ఇది Public Accounts కమిటీలోకూడ చాలామంది సభ్యుల దృష్టికి వచ్చింది. ఆ కారణంచేత ట్రెజరీలలో ఉన్నటువంటి Accountants, clerks, తరువాత Treasury Deputy Collectors వగైరా అందరూకూడా కొత్తగావచ్చినటువంటి వాళ్లగుటచేత, తర్ఫీదు లేకపోవుటచేత accounts సరిగాలేకపోవడం జరుగుతోంది. అందుచేత వాళ్ళందరిని రెవిన్యూశాఖకు సంబంధంలేని ఒక ప్రత్యేక శాఖగా పెట్టి, అనుభవం కలిగినటువంటివారినీ శిక్షణపొందినవారిని యీ శాఖలో నియమించి ప్రమోషన్‌కు వీలు కలిగించి ప్రోత్సాహం కలిగించినట్లయితే అక్కడ పనులు సవ్యంగా వుంటాయనే సూచన యీ బడ్జట్ ఉపన్యాసంలో 11 వ పేరాలో సూచింపబడింది. ఇవి చాలా సంతోషించదగ్గ విషయం. దీనివల్ల పొరపాట్లు జరుగకుండా accounts సవ్యంగా వ్రాసుకోడానికి చక్కగా పనిచేసుకోడానికి అవకాశం వుంటుంది.

ఇక సహకార department విషయంలో చూసుకున్నట్లయితే యీ సహకార సంస్థల అభివృద్ధికి అనేకమైనటువంటి ప్రణాళికలు వేసుకోవాలని 2 వ పంచవర్ష ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం కూడా ఆలోచిస్తున్నవి. ఇప్పుడు ఈ విషయంలో ఎక్కువ godowns కట్టాలని warehouses పెట్టాలని, marketing societies ఎక్కువ స్థాపించాలని సంకల్పించబడింది. ఈ marketing societies యిదివరకు కూడా ఉండినవి. Crop loan and sales society అనుపేర marketing societies వ్యవహరిస్తూవచ్చాయి. ప్రజలకు అనేకమైన సదుపాయాలు కలుగచేసి వాళ్ళ ముడి సరుకు తీసుకువచ్చి godowns పెట్టి దానిపైన అప్పులు యివ్వడము, ఆ అప్పులు రైతులకుపయోగించుకోవడము, జరుగుతూవచ్చినది. అనగా controlled credit scheme నుపెట్టి co-operative సంఘాలు, marketing societies చాలా సహాయం చేయడానికి పూనుకున్నవి. కాని అక్కడ వున్నటువంటి రైతులు, అధికారులు కూడ ఆ మంచి అవకాశాలను ఉపయోగించుకోకుండా దుర్వినియోగం చేయడంవల్ల అనేక బాకీలు రాకుండా పోవడం, godowns నిర్మించారేకాని అందులో స్టాకు సరిగా వుండకుండా పోవడం సంభవిస్తూ వచ్చింది. అందువలన మార్కెటింగు వ్యవస్థను వేరే చట్టబద్ధంచేసి, Land Mortgage

Banks ఎట్లా separate గా పరిపాలింపబడుతున్నయో అదేవిధంగా జరిపించాలి. Marketing Societies Act ను తీసుకురావాలి. ఈ సహకార సంఘాలకు సహకార శాఖాధిపతులు ఆధిపత్యం వహించకుండా management చేయడానికి యితరత్రా వాణిజ్యానుభవంగల పెద్దలను అందులోపెట్టి కార్యక్రమాన్ని సవ్యంగా నడుపుకున్నట్లయితే marketing societies దుర్వినియోగంకాకుండా లాభదాయకంగా ఉండడానికి అవకాశం యేర్పడుతుంది. ఈ విధంగా చేసినట్లయితే సహకార సంఘాలున్నటువంటిచోట్ల కష్టాలన్ని పోయి సవ్యంగా పనిచేయడానికి అవకాశం యేర్పడుతుంది.

సహకార సంఘాలలో (1) Limited Liability సంఘాలు (2) Unlimited Liability సంఘాలు అని ఉన్నవి. లిమిటెడ్ లయబిలిటీ సంఘాలు అనగా పరిమితి పూచీగల సంఘాలు. అణ్‌లిమిటెడ్ లయబిలిటీ అనగా పరిమితిలేని పూచీగల సంఘాలు పరిమితిలేని పూచీగల సంఘాలలో, ఒక బాకీదారు తన బాకీని చెల్లించకపోతే, యితర సభ్యుని యొద్దనుండియైనా అతని ఆస్తిపాస్తులు వేలము వేసి ఆ బాకీని రాబట్టవచ్చు. అందువల్ల ఈ co-operative సంఘాలలో విరివిగా honestగాఉండే రైతులు అందులో ప్రవేశించడానికి భయం కలగడం జరుగుతుంది. అందువల్ల సహకార సంఘాలు వ్యాపకంలోకిరాకుండా పోతున్నాయి. Limited Liability అనగా పరిమితి కలిగిన పూచిగల పెద్ద పెద్ద సహకార సంఘాలు ఏర్పాటు చేసి కట్టిన షేర్లకు ఐదింతల మొత్తానికి liability ని పరిమితం చేసే పక్షంలో ఎక్కువగా ఈ సంఘాలు అభివృద్ధి చేయడానికి అవకాశం ఉంటుంది.

మనం socialistic pattern of society ని ఏర్పాటు చేయాలని అంటున్నాము. కాంగ్రెసుకూడా ఆవిధముగానే తీర్మానం చేసినది. దానికిఅనుగుణ్యమైన సమాజంనిర్మించాలి. భిక్షగాళ్ళను Bus Standsలోను రైళ్లలోను లక్షలాదిగా చూస్తున్నాము, Able bodied people వీళ్ళలో ఎక్కువగా ఉన్నారు. వీళ్లంతాపనిచేయగలరు. శక్తిసామర్థ్యాలున్నాయి. చిన్నప్పటినుంచి అలవాటు పడిన కారణంచేత వాళ్ల పని పాటలు చేయడంలేదు. మూర్ఖత వహించి సోమరితనంగా అడుక్కుంటే పని జరిగిపోతోందిగదా అనే ధోరణిలో వాళ్లు ప్రవర్తిస్తున్నారు. ఇక్కడ కర్నూలులో ఒక విచిత్రమైన విషయం నా notice లోకి వచ్చింది. బిడ్డలగన్న తల్లి దగ్గరకుపోయి ఒక రూపాయి బాడుగకు బిడ్డను తీసుకొని వీధులలో అడుక్కొని సంపాదించిన సంపాదనలో ఒక రూపాయి బిడ్డతల్లికి ఇవ్వడం, మిగిలినది భిక్షమెత్తిన వ్యక్తి తీసుకొనటం జరుగుచున్నది. ఇల్లాంటిది అరికట్టడానికిగాను ప్రతి జిల్లాలోను 50 ఎకరాలplot తీసుకొనిCo-operative Beggar's Home అనిco-operative system క్రింద Beggars Home ను పెట్టాలి. Beggar's Home లో share ధనం అంతాకూడా Government మొదట advance

చేసి 5 సంవత్సరాల అనంతరం ఆ colony లో వ్యవసాయ వృత్తిచేత వచ్చి నటువంటి ఆదాయముతో 20 సంవత్సరాల లోపల అప్పులు తీర్చుకోవడానికి ఆస్కారం ఏర్పడుతుంది. మొట్ట మొదట పెట్టిన పెట్టుబడికి ఏమి నష్టం రాదు. దానిని మళ్ళీ తిరిగి వాపసు చేసుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది కనుక ప్రతి జిల్లాలో ఒక Beggar Homeస్థాపించినట్లయితేబిక్షగాళ్ళ సమస్య తీరుతుందని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

రెండో పంచవర్ష ప్రణాళికలో ఎక్కువగా electricity వ్యవసాయం అభివృద్ధికానిదే పరిశ్రమలు బాగుపడడానికి అవకాశంలేదు. ఆ కారణము చేత ముఖ్యమంత్రిగారు నాగార్జునసాగర్ ప్రాజెక్టు పూర్తి అయినప్పుడు 75 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి దొరుకుతుందని తుంగభద్ర విద్యుచ్ఛక్తిలో ఇంకా 2 జనరేటర్లు ఎక్కువ చేస్తారని మాచ్‌ఖండ్ ప్రాజెక్టులో 3 జనరేటర్లు ఎక్కువ చేస్తారని చెప్పారు అందువల్ల ఎక్కువ electricity సంపాదనతో వ్యక్తికి 10 యూనిట్ల వరకు అనుభవించడానికి అవకాశము కలుగుతుందని త ద్వారా పరిశ్రమలు అభివృద్ధి చెందుతాయని విశ్వసిస్తున్నాము.

చిన్న చిన్న పరిశ్రమల అభివృద్ధికి ఒక చిన్న సహాయ సంస్థను 2 కోట్ల మూలధనముతో 50 లక్షలపెట్టుబడితో ప్రారంభం చేసినట్లు సూచించబడింది. ఆ సంస్థ ఎక్కువ ప్రయోజనకారిగాఉండి చిన్న పరిశ్రమలకు కుటీర పరిశ్ర మలకుకూడా దోహదం అవుతుందని విశ్వసిస్తున్నాను. చక్కెర ఫ్యాక్టరీలు సిమెంటు ఫ్యాక్టరీలు మరియు నూలుమిల్లు తాడిపత్రిలోను పెట్టాలని సంకల్పించబడింది. ఇవన్నికూడా వెనుకబడిన ప్రాంతాలు కాబట్టి share ధనం పోగుచేసుకోలేని కారణముచేత ఈ పరిశ్రమల స్థాపనకు ఆలస్యము అవుతుంది, కనుక ఈ సహాయ సంస్థద్వారా share capitalకు కొంత సహాయం ప్రభుత్వం చేసినట్లయితే ఇవన్నీ త్వరగా స్థాపించడానికి అవకాశం ఏర్పడుతుంది. అందువల్ల మనం వ్యవసాయకంగాను, పారిశ్రామికంగాను ముందుకు పోవడానికి అవకాశం ఉంటుందని సూచిస్తూ యింతటితో విరమి స్తున్నాను.

SRI P. RAMACHARLU:—అధ్యక్షా! ఈbudget ను అభినందించాలనే కుతూహలం మనస్సులోఉందిగాని మామూలు పద్ధతిలోకంటే ఇది భిన్నముగాలేదు, అనే బాధ మనస్సులోఉంది. ఎక్కువగా పన్నులులేవు అనే సంతోషముతప్ప సాధారణముగా రైతుకు కావలసిన మేళ్ళు దీనిలో లోపించినాయి. Electricity కి ప్రాజెక్టులకు విశేషంగా సొమ్ము ఖర్చు పెట్టుతూఉండడం వాస్తవమే కాని సామాన్యప్రజలకు electricity ప్రాజెక్టుల సంగతి అంతగా అవసరములేదు. వారు బండ్లకు బరువులెత్తుకొని పల్లెకు పోవలసివస్తే రోడ్లు సరిగాలేవని ప్రభుత్వమును తిట్టుకుంటారు. ఆస్పత్రికిపోతే

అక్కడ వైద్యుడు ఉండడు. ఔషధాలు ఉండవు. అలాంటప్పుడు Governmentను తిట్టుకుంటారు, ఈ మధ్యనే మంత్రి నాగేశ్వరరావుగారు మా తాలూకాలోని అస్పత్రులు తనఖీచేసారు. కొన్నిచోట్ల చెవిలో పెట్టుకొనుటకు ప్రత్తికూడాలేదు. ఏమంటే సప్లైకాలేదు అంటారు, కొన్నిచోట్ల ఆసుపత్రులున్నాయి. వైద్యులులేరు. వైద్యులున్నారు మందులులేవు.

THE HON. DR. B. GOPALA REDDI:— అయినా రోగాలు నివారణ అవుతునే ఉన్నాయి.

SRI P. RAMACHARLU:—మందు తీసుకొనకుండానే చికిత్స లేకుండాను కొన్ని రోగాలు నివారణ అవుతాయి. మరణించేవారు మరణిస్తూనే ఉంటారు. కాబట్టి అస్పత్రులకు పెట్టే దండుగ ఖర్చు ఇంకా పెట్టకుండావుంటే ఉత్తమం. అస్పత్రులువుంటే దానిలో కావలసిన మందులుండడం అవసరము. ధర్మవరం మొదలైనటువంటి తాలూకా head quarters లో డాక్టరు యింటింటికిపోయి రూపాయి, అర్ధ రూపాయి భిక్షమెత్తి కొన్ని మందులు కొన్నట్లు విన్నాను. సంజీవరెడ్డి మంత్రిగారుకూడా ఈ ధర్మవరం తాలూకా ఆస్పత్రికివెళ్ళి చూశారు. అక్కడ మందులులేవు. ఆ వేళ చాల ఆపాయ స్థితిలోవున్న పిల్లవానికి injection ఇవ్వవలసివస్తే లేవని ఆ పిల్లవాని గ్రహచారము కొద్ది అస్పత్రికి పోయాడని అనుకొన్నారు. ఈ విధంగా ఔషధాలులేకుండా ఉండేటటువంటి అస్పత్రులు వుంచడం భావ్యం కాదు. కాబట్టి ఏ ప్రణాళికలు ఎట్లావున్నా ఆస్పత్రులకు ఔషధాలు, డాక్టర్లను Supply చేయడమన్నది మొదటి కర్తవ్యము. ఇక రోగాలు ఎందుకు రావాలి వాటికి నివారణ ఎందుకుచేయాలి అని ఆలోచించవలెను. రోగాలు రాకుండా చేయడం మంచి పద్ధతని అందరూ అంగీకరిస్తారు. కాబట్టి రోగాలు రాకుండా చేసేందుకు ఒక పద్ధతి ఉన్నది. అందుకుగాను ప్రతిచోట త్రాగేందుకు మంచి నీటిని supply చేయాలి. త్రాగేనీరు విషయంలోకూడా ప్రభుత్వం ఉపేక్ష వహిస్తూఉన్నది. కొన్నిచోట్ల కొన్ని తాలూకాలకు Central Government ఏర్పాటుచేసిన దాని ప్రకారం ప్రతి పల్లెలోను మంచి నీళ్ళ బావులు త్రవ్వుచున్నారు. తక్కినచోట్ల నీటి వసతి లేనేలేదు. ఈ విషయాన్ని వెనుక ఒక సారి మనవిచేశాను. కళ్యాణదుర్గం తాలూకాలో సుమారు 30 ఏండ్లనుంచి కొన్ని గ్రామాలవారు ఎంతో ఆందోళన చేస్తూన్నారు. ఇంకను ఆ గ్రామములలో మంచినీళ్లు లేకుండా ఉన్నాయి. ఆ గ్రామాలపేర్లుకూడా ఇదివరలోనే చెప్పాను. ప్రతి యింటివారు ఒక బండిలో 12 కడవలుపెట్టుకొని 3 మైళ్ళ దూరం నుంచి నీళ్ళు తెచ్చుకొంటున్నారు. వారు స్నానం చేసినవి, పారబోసినవి పశువులు త్రాగుతున్నాయి. అక్కడివారంతతా నారికురుపులతో బాధ పడుతున్నారు. ఇటువంటి గ్రామాలకు 30 ఏండ్లనుంచి ఆందోళనచేస్తున్నా ప్రభుత్వం మంచి నీళ్ళ supply చేయలేక పోతున్నది. పోయిన సంవత్సరము ఇక్కడ నేను ఉపన్యాసం చేసినతరువాత ఆరోగ్యశాఖ మంత్రి

యింజనీరుగారు ఆ గ్రామాలను తిరిగి చూచినారు. జరిగిపోయింది. ఈ సంవత్సరముగూడా వాళ్ళు బురద నీళ్ళే త్రాగుచు వుండడం మంత్రిగారు కూడా చూశారు. పొలాలలో ప్రవహించే వాననీరంతా ఒక గుంటలో collect చేసి ఆ నీటిని త్రాగుతున్నారు. ఎండా కాలములో నీళ్ళు కొద్దిగా వుంటాయి. అయినా ఆ బురద నీళ్ళే త్రాగుతున్నారు. కాబట్టి రోగాలు రాకుండా వుండవు. అటువంటి రోగాలకు తగినటువంటి చికిత్సలులేకుండా వున్నది. డాక్టర్లులేకుండా మందులులేకుండావున్న ఆస్పత్రులుండేకన్న వాటిని ఎత్తి వేసినా సంతోషమే. ఈ రోగాలు లేకుండా చేయడము ప్రభుత్వపు ప్రప్రథమ వుద్దేశ్యం కావలెను. అటువంటి పనికి ముఖ్యమైన సూత్రం మంచి నీటి supply. ఆ విధముగానే ఇంకొక అనారోగ్యహేతువు ఇటీవల వచ్చింది. Prohibition వల్ల చాలా మంది రోగగ్రస్థులు అవుతున్నారు. ఏదో మత్తు నియ్యగలది, చిక్కింది అంతా త్రాగుతున్నారు. త్రాగటం మానివేయ లేరు. మనం ఎన్ని రిపోర్టులు వ్రాసుకొన్నా prohibition తగ్గిందని అను కున్నాగూడా వారు త్రాగడం మానలేదు. ఇంకా వృద్ధి అవుతూనేవుంది. ఇటీవల police కు prohibition department transfer చేసినారు. అప్పుడు prohibition వాళ్ళకు, పోలీసు వాళ్ళకు ఇచ్చే మామూలు దొంగ బట్టీలవారు ఇప్పుడు police వాళ్ళకే ఇయ్యవలసి వస్తోంది. Police వాళ్ళకు లాభకరంగావుంది గాని supply చేసేటటువంటి వాళ్ళు ఇదివరకు ఇచ్చే మామూలు ఇస్తున్నారు. అదేవృత్తి అవలంభిస్తున్నారు ఆ విధంగా జరుగుతోనేవుంది. Prohibition department లో కొందరు Gazetted officers, Special officers వున్నారు. Prohibition officers ను ఈ పర్మిట్లు, లైసెన్సులు check చేసేదానికి, foreign liquor licence check చేసేదానికి పెట్టి నట్టుగావుంది. పోలీసుకి ఈ డిపార్టుమెంటును ఇచ్చినపుడు వారికి (prohibition officers) కు ఆ అధి కారములేదని తోస్తున్నది. ఇటువంటి staff 29 మంది, Gazetted officers 21 మందిన్ని యున్నారు. 300 గార్డులు వున్నారని విన్నాను.

ఆ పని పోలీసుకు ఇచ్చినప్పుడు, వారికి అధికారం లేదని తోస్తుందినాకు అటువంటివారు ఈ permits check చేస్తూనే ఉన్నారు. కాని ఎవరైనా ఒకరు నేను permit చూపడంలేదు అంటే, వాళ్ళను ఆక్షేపణ చేసేటట్లు లేదు. అటువంటి Gazetted Officers ఇప్పుడు అనవసరము. వీరిని కూడ ఏ department కైనా చేరిస్తే ఖర్చు తగ్గిపోగలదు. ఈ మద్యనిషే ధము అనేది జాగ్రత్తగా అమలుపరిస్తేనేతప్ప, దీనివల్ల నష్టమేగాని ప్రజలకు మేలులేక దానివల్ల అనారోగ్యము హెచ్చుతూ వున్నది. ప్రజలు చాలా అకాల మరణానికి గురి అవుతున్నారు. అనవసరంగా ఎక్కువ ఖర్చు పెడుతూ ఉండేటటువంటి కాలంలో, P. W. D. Department ఒకటి అనేది మనకు తెలిసినదే. కొత్తగా ఇప్పుడు శాసనసభ్యులకు hostel కట్టి ఉన్నారు. ఆ hostel లో నేను చేరియున్నాను, దాంట్లో అడుగుపెట్టి

చూస్తే అప్పుడే ఒక గోడలో చీలికలు అగుపడ్డాయి. కావాలంటే, ఇంజ నీరుగాని, ముఖ్యమంత్రిగారుగాని ఇంకెవరైనాగాని పరిశీలించవచ్చు. నా రూము నెంబరు 13. ఆ కట్టిన గోడ నాలుగు వొప్పులుగా చీలి ఉన్నది. ఇది house of cracks ఏమో అనేట్లుగా కన్పిస్తుంది ఈ విధంగా ఇటువంటి కట్టడాలకు చాలా వ్యయము కావడము, తరువాత అవి ఉప యోగము లేకపోవడము జరుగుతూంది.

ఇంకొక విషయము చెప్పదలచుకొన్నాను, అడవులలో చెట్లు పెంచా లని మనమేదేదో వనమహోత్సవాలు మొదలైనవి చేస్తున్నాము. బాగానే ఉన్నది. ఈ వారములో నేను అట్లా బయటికి పోయినప్పుడు సుమారు 50 కట్టెల బండ్లు పోతున్నాయి. ఒక్కొక్క బండి 20, 30 రూపాయలు చెప్పు తున్నారు. అవి ఎక్కడనుంచి తెస్తున్నారో తెలియదు. Forests నుంచే దొంగతనంచేసి తీసుకొనివస్తూ ఉండవచ్చునేమో! కాని, వారు ఎక్కడ నుంచి తెచ్చినా అదేమి అడగకుండానే అందరు కొంటూనే ఉన్నారు. మంత్రులు కొంటున్నారు, ఉద్యోగస్తులు కొంటున్నారు. Forest ఆఫీసర్లు కొంటున్నారు, కలెక్టర్లు కొంటున్నారు, అందరు కొంటున్నారు. ఎందుకంటే అందరికి వంట కావాలి, నిత్యకృత్యాలు కావాలి, స్నాన సంధ్యాదులు కావాలి. గృహకృత్యాలన్ని చేసుకోవాలి, వీటన్నిటికి కట్టెలు అవసరము. కట్టెలు లేకుంటే ఇంట్లో ఏపనీ జరుగదు. కాబట్టి మన అడవులలో కట్టెలు కొట్టకూడదు అని నిషేధించినంతమాత్రము ప్రయోజనంలేదు. ఎందుచేత నంటే ప్రజానీకానికి నిత్యకృత్యాలు, స్నాన సంధ్యలు, వంటపనులు జరగా లంటే కట్టెలు చాలా అవసరము. ఇదంతాకూడ ఆలోచించే పూర్వము గవర్నమెంటు చౌకగా అమ్మేటటువంటి కట్టెల డిపోలు అక్కడక్కడ కొన్ని ఏర్పాటుచేసి ఉండినది. అటువంటివి ఇప్పుడుకూడ అవసరము. లేక పోతే, మనమేమో కళ్లుమూసికొని affiorestatiion అని అంటూ ఉండ డము, వాళ్ళేమో కట్టెలుకొడుతూ ఉండడం, వాటిని మనం కొంటూవుండ డము, ఇంకా మంచి కట్టెలు, లావు కట్టెలు తీసుకురమ్మని చెప్పడం ఇదంతా జరుగుతూ వుంటుంది. కాబట్టి మంత్రివర్గంవారు, ముఖ్యంగా ముఖ్యమంత్రిగారు ఈ విషయము ఆలోచించి పట్టణాలలో కట్టెల సప్లై ఏర్పాటు చేయించవలెనని కోరుతున్నాను.

తుంగభద్ర ఎగువకాలువ వస్తుందని రాయలసీమవాళ్ళు చాలా ఆశించు కొని ఉండిరి. ఈ చెరువులన్నీ నిండుతాయని అనుకొంటూ ఉండిరి. కాని ఈ తుంగభద్ర ఎగువకాలువ ఇంకా ఎగువనే వున్నదిగాని దిగలేదు. కాని ఏదో పెన్నారు ప్రాజెక్టు వస్తుందని, దానిగుండా ధర్మవరం చెరువు నిండుతుందని అన్నారు, కాని అదికూడ లేదు. కల్యాణదుర్గం ధర్మవరం ప్రాంతాలలోని చెరువులు చాలా తెగిపోయినాయి. ఇదివరకు వాటినిగురించి వెంకట సుబ్బారెడ్డిగారు చెప్పారు. ఆ చెరువుల repairs చాలా అవస్య

కము. కాని భైరవానితిప్ప అనే ప్రాజెక్టు ఉన్నదని అది జరుగుచూ ఉన్నదని చెప్పుతున్నారు. కాని ఆ ప్రాజెక్టు ప్రాంతములలో ఉండే కంబదూరు చెరువు మొదలగు 4, 5 పెద్ద చెరువులకు నీరు వచ్చేటటువంటి సదుపాయము లేదు. అది చేయడానికి సాధ్యమని అందరు చెప్పుతున్నారు. కనుక మన ప్రభుత్వము మైసూరు ప్రభుత్వముతో సంప్రదించి అక్కడ ఉన్నటువంటి వేదవతి నదినుంచి కాలువలు త్రవ్వే విధముగా ఏర్పాటు చేయవలసిందని ఇదివరకు ఎన్నోమార్లు ప్రభుత్వమువారిని కోరాను. కాని ఈ విషయంలో పని ఏదీ జరిగినట్లు కన్పడదు. కాబట్టి ఈ విషయాన్నికూడ గవర్నమెంటు పరిశీలిస్తారని అనుకొంటున్నాను.

తరువాత గ్రామోద్యోగులవిషయం కొంత చెప్పవలసి యున్నది. గ్రామోద్యోగులు పల్లెలలో స్వల్ప జీతాలతో పని చేయవలసిందిగా ఉన్నది. వారిని మాటిమాటికి headquarters కు రమ్మంటూ ఉంటారు. చాలా మంది క్రొత్త ఆఫీసర్లు అయినారు, వాళ్ళందరూ చెప్పిన పనిని గ్రామోద్యోగులు చేయవలసి యుంటుంది. ఎవరు చెప్పినమాట వినకపోయినా, వారికి జుల్మానా వేస్తున్నారు.

THE HON. DR. B. GOPALA REDDI :— రాజీనామా చేయలేకపోయినారా ?

SRI P. RAMACHARLU :— వారు రాజీనామా పెట్టకముందే ప్రభుత్వమే వారిని తీసివేసి, ఆ పనంతా ఒక డిపార్టుమెంటుకు అప్పచెప్పితే బాగుంటుంది. ఆ లెక్కలన్నీ standardise చేసి ఒక సంవత్సరం లెక్కలు వ్రాస్తే, అని పదేళ్ళు మారకుండా ఉండేటట్లుచేస్తే బాగుంటుంది. మైసూరు గవర్నమెంటులో ఏర్పాటు చేసినట్లు ఏర్పాటుచేస్తే మంచిది. లేకపోతే, ప్రతి సంవత్సరము ఎంత శిస్తు చెల్లించాలో రైతుకు తెలియదు. ఇచ్చినదానికి సరిగా రశీదులు ఇవ్వడంలేదు ఏ పొలానికి ఇస్తున్నారో తెలియదు. ఈ విధంగా మన మైనను గ్రామాలలో వ్యవహారాలు పెంచినట్లు అవుతుంది. పాతపద్ధతిలో ఒకవేళ వకీళ్ళకేమైన మేలు ఉన్నదేమోగాని రైతులకు ఏమీమేలులేదు. గవర్నమెంటుకుకూడ ఏమి మేలులేదు. కనుక ఈ లెక్కలన్నీ standardise చేసి ఒక కరణము, రెడ్డి లేకపోయినా,

SRI P. RAMACHARLU] [5th March 1956

రైతు తాను ఎంత కట్టవలసింది, పది ఏళ్ళవరకు ఇంత చెల్లిస్తూ ఉంటాను, ఏదైనా హెచ్చు తక్కువైతే గవర్నమెంటు నాకు నోటీసిస్తుంది అనుకొనే విధముగా ఏర్పాటు చేయవలసి యుంటుంది. ఈ విధముగా చేయకపోతే, ప్రతి సంవత్సరము, రైతు ఆందోళనపడుతూనే ఉంటాడు. సరియైన రశీదులు లేకుండానే వ్యవహారాలు పెరుగుతున్నాయి. కాబట్టి ఈ గ్రామోద్యోగులను ఉంచడమో, తీసివేయడమో ఏదో ఒక నిశ్చయము ప్రభుత్వము చేసుకొంటే బాగుంటుందిగాని ఈవిధంగా వారిని ఉపవాసముపెట్టి చంపవద్దని మాత్రము నేను కోరుతున్నాను.

The House then adjourned to meet again at 8 30 a.m. the next day.

# * APPENDIX.

(VIDE L. A. Q. STARRED NO. 721, PAGE NO. 22 PUT BY SRI. AYYAPU REDDY, M. L. A. (EXTRACT OF RULE 3 OF THE HINDU RELIGIOUS AND CHARITABLE ENDOWMENTS (ADMINISTRATION) SERVICE RULES ISSUED IN G O. MS. NO. 1232, RURAL WELFARE, DATED 22nd NOVEMBER 1951).

3. (a) *Appointment and qualifications for appointment;*

The method of recruitment and the qualifications of candidates for appointment to the several categories shall be as follows:—

| *Category.* (1) | *Method of recruitment.* (2) | *Qualifications for appointment.* (3) |
|---|---|---|
| 1. Commissioner. | (*a*) Promotion from Deputy Commissioners or (b) recruitment by transfer from persons holding the posts of District Judges in the Madras State Higher Judicial Service, provided that no District Judge shall hold the post of Commissioner for a period exceeding three years ( G.O.Ms. No. 1053, Rural Welfare dated 19th September 1952. | A degree in law of the Madras or Andhra University. |
| | *OR* | |
| | I.A.S. Officers in the Senior scale; or | |
| | Deputy Collectors holding Senior scale posts in the Indian Civil Administrative Cadre. | |
| 2. Deputy Commissioners. | (*a*) Promotion from persons holding the posts of Assistant Commissioners; including the post of Personal Assistant to Commissioner (G.O. No, 1072, Rural Welfare, dated 25th August 1953. | A degree in law of the Madras or Andhra University. |
| | (*b*) recruitment by transfer from persons holding the posts of subordinate Judges in the Madras Subordinate judicial Service; provided that no Sub-Judge shall hold the post of Deputy Commissioner for a period exceeding three years at a time (G.O.Ms. 1053, Rural Welfare, dated 19th September 1952. | |
| | *OR* | |
| | Members of the Madras Civil Service (Executive Branch) or | |
| | Madras General Service Part II Class IX. | |
| | Assistant Secretaries to Government, | |

| *Category.* (1) | *Method of recruitment.* (2) | *Qualifications for appointment* (3) |
|---|---|---|
| 3. Assistant Commissioners including Personal Assistant to the Commissioner dated (G.O. No. 1072, Rural Welfare, 25th August 1953). | (*a*) Transfer from non-Gazetted members of the Hindu Religious and Charitable Endowments Administration) Departments.<br>*OR*<br>*b*) by direct recruitment from<br>((i) advocates who have been actually practising at the Bar for a period of not less than five years.<br>(ii) members of the executive staff of religious institutions including executive officers. | A degree in Arts of the Madras or Andhra or Annamalai University preference being given to those possessing a degree in law of the Madras or Andhra University. |

(*b*) Appointment to the post of Deputy Commissioner shall be made on grounds of merit and ability, Seniority being considered only when merit and ability are approximately equaly (G. O. MS. No. 1072, Rural Welfare, dated 25th August 1953).

(*c*) No person shall be eligible for appointment as Assistant Commissioner,

(i) by transfer, if he has completed or will complete 50 years of age, provided that a candidate who has completed 47 years of age will not be eligible for inclusion of his name in the list of approved candidates (G. O. MS. No. 644, Rural Welfare, dated 11th May 1953).

(ii) by direct recruitment.

(*a*) from Bar, if he has completed or will complete 35 years of age; (G. O. MS. No. 34, Law (Endowments), dated 10th January 1955. (age limit raised from 30 to 35)-

(*b*) from among members of the executive staff of religious institutions, if he has completed or will complete 45 years of age.

*EXPLANATION*:—The age-limits referred to above shall be reckoned with reference to the lst day of july of the year in which the selection for appointment is made.

(d) Substantive vacancies in the categories of Assistant Commissioners shall, as nearly as may be, be filled in the proportion specified below.—

(i) 40 per cent, by transfer;

(ii) 20 per cent, by direct recruitment from among members of the staff of religious institutions, including executive officers; and

(iii) 40 per cent, by direct recruitment from the Bar.

*Note*:— In making appointments of the Commissioner, Deputy commissioners, and Assistant Commissioners, regard shall be had to the provisions of section 9 of the Madras Hindu Religious and Chatritable Endowments Act, 1951 that is to say, only persons professing the Hindu Religion shall be appointed.

# APPENDIX.

(Statement vide L. A. Q. O. Starred No. 436) (Page 120) put by Sri S. Vemaiah, M. L. A.

STATEMENT A (CURRENT AUDITS)

| Name of the district. | Number of institutions to be audited. | | | | Number of institutions audited upto 1-12-1955 | | | | Balance | | | | Remarks. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1361 | 1362 | 1363 | 1364 | 1361 | 1362 | 1363 | 1364 | 1361 | 1362 | 1363 | 1364 | |
| Srikakulam and Visakhapatnam. | 282 | 239 | 240 | 240 | 151 | 117 | 91 | 43 | 131 | 122 | 149 | 197 | Among the balance the number of institutions where no accounts are stated to have been maintained is 957 in fasli 1361, 864 in fasli 1362, 839 in fasli 1363. The audits for fasli 1364 are in progress. |
| East Godavari | 617 | 617 | 570 | 569 | 199 | 195 | 184 | 93 | 418 | 422 | 386 | 476 | |
| West Godavari | 499 | 501 | 526 | 521 | 272 | 266 | 229 | 105 | 227 | 235 | 297 | 416 | |
| Krishna | 440 | 440 | 419 | 419 | 263 | 250 | 245 | 108 | 177 | 190 | 174 | 311 | |
| Guntur | 749 | 759 | 759 | 759 | 457 | 432 | 353 | 125 | 292 | 327 | 406 | 634 | |
| Nellore and Chittoor. | 153 | 153 | 155 | 178 | 133 | 130 | 122 | 61 | 20 | 23 | 33 | 117 | |
| Kurnool, Cuddapah and Anantapur | 298 | 271 | 286 | 286 | 173 | 157 | 150 | 47 | 125 | 118 | 136 | 239 | |
| Tirumalai Tirupathi Devasthanams Tirupati. | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | .. | .. | .. | .. | 1 | |
| Total. | 3039 | 2985 | 2956 | 2973 | 1649 | 1548 | 1375 | 582 | 1390 | 1437 | 1581 | 2391 | |

[P.T.O.

## STATEMENT—B.

### (ARREAR AUDITS).

| Name of the district. | Number of institutions to be audited. | Number of institutions audited upto 30-11-1955 from 1358, 1359 and 1360. | Balance. | Remarks. |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| Srikakulam and Visakhapatnam. | 587 | 58 | 529 | |
| East Godavari | 1542 | 149 | 1393 | |
| West Godavari | 770 | 185 | 585 | |
| Masulipatam, (Krishna). | 262 | 154 | 108 | |
| Guntur | 1088 | 206 | 882 | |
| Nellore and Chittoor | 316 | 112 | 204 | |
| Kurnool, Anantapur and Cuddapah. | 328 | 92 | 236 | |
| | 4893 | 956 | 3927 | |

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS, KURNOOL AND PUBLISHED BY THE DIRECTOR OF STATIONERY AND PRINTING, GOVERNMENT PRESS, HYDERABAD (DECCAN).